AMMA NUDI
Telugu Monthly
Vol. 1
Issue 9
Rs. 20
November
2015
Tenali, AP



తెలుగుజాతి పత్రిక

1993-2013 నడుస్తున్న చరిత్ర

# అమ్మనుడి

నవంబరు, 2015



















## మన అమరావతి -మన రాజధాని సరే...మరి మన తెలుగెక్కడ?

- తెలుగుకై తమిళనాడు తెలుగువారి పోరాటం
- ఆంధ్రప్రదేశ్‌లో విద్యావికాస వేదిక ఆవిర్భావం
- అసమాన తెలుగు వీరనారి రాణీ రుద్రమదేవి



**'అమ్మనుడి'** పత్రిక మీకు నచ్చితే,
దయచేసి వెంటనే చందాదారులుగా చేరండి.

చందా సొమ్మును మీకు ఈ క్రింది రీతుల్లో మీకు ఎలా వీలయితే అలా పంపించవచ్చు.

- మనియార్డర్ ద్వారా పంపవచ్చు.
- ఆన్‌లైన్‌లో డబ్బు పంపేవారు నేరుగా బ్యాంకులో డబ్బు జమ చేయరాదు. NEFT / RTGS దరఖాస్తు ద్వారా మాత్రమే పంపించాలి.
- బ్యాంకు డి.డి. / మల్టీసిటీ చెక్ పంపవచ్చు.

*వివరాలు 4వపుటలో చూడండి.*
*ప్రతినెలా పోస్టులో పత్రికను పంపగలము.*

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. 3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రం విధిగా, స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తుంది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.

3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైన్ల)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

అక్టోబరు 22 దసరా పండుగ నాడు కొత్తరాజధాని నగరం అమరావతి కట్టుబడికి ప్రధాని చేత శంకుస్థాపన చేయించారు. మన అమరావతి –మన రాజధాని–అని నినాదాన్ని ఇంగ్లీషు అక్షరాల్లో ప్రదర్శించారు. ఎక్కడ వెతికినా తెలుగు అక్షరం కనిపించలేదు. వేదిక మీద, శిలా ఫలకం మీద..అంతటా ఇంగ్లీషే! మరి తెలుగెక్కడ? ఇది తెలుగు రాష్ట్రమేనా?

పుటలు....6-13




## లోపలి పుటలలో....



కైసేత: **నంద, పార్థివ శంకర్,** రేఖాచిత్రాలు: **బాలి**
ఫోటోలు: **టి.శ్రీనివాసరెడ్డి, ఎం.ఎస్.ఎన్.రెడ్డి**
పకపకలు: **సరసి** ముఖచిత్రం: **కలిమిశ్రీ**



**రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు : డాక్టర్ సామల రమేష్‌బాబు,** సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

తెలుగుజాతి పత్రిక
అమ్మనుడి
మాసపత్రిక
● నుడి ● నాడు ● నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1937 : మన్మథ నామ సంవత్సర ఆశ్వీయుజ మాసము *(కుందాపి) బహుళ షష్ఠి గురువారము నుండి కార్తీక *(కుందాపి) బహుళ పంచమి బుధవారము వరకు
* వ *కుందాపి = తెలుగు నెలలు

**చందా వివరాలు**

| | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|
| శాశ్వత చందా : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు నేరుగా బ్యాంకులో డబ్బును జమచేయరాదు. NEFT / RTGS దరఖాస్తు ద్వారా మాత్రమే **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.
**AMMA NUDI - AXIS BANK, TENALI**
అక్కౌంట్ నెం. **915020010550189**
**IFSC Code : UTIB0000556**
ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆవెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజీ ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

**చందాదారులకు తప్పనిసరి సూచనలు**

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. మీ చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాఫీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలు మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి. మీ చిరునామా మారినట్లయితే వెంటనే తెలియజేయండి.

# 'నడుస్తున్నచరిత్ర' చందా ఉన్నవారికి సూచన

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్నచరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్నచరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటివరకూ సరిపోతుందో - పత్రికను పెట్టి పంపే కవరుపై చిరునామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

### వెంటనే చందాలు పంపండి

అమ్మనుడి తొలి నాలుగు సంచికలను (మార్చి, ఏప్రిల్, మే, జూన్) నడుస్తున్న చరిత్ర చందా మిగిలి ఉన్నవారికి, అయిపోయిన వారికీ కూడా పంపించాము. ఇకపై చందా మిగిలిఉన్నవారికి, కొత్త చందాదారులకు మాత్రమే పంపగలము. పైన ఇచ్చిన సూచనను కొందరు గమనించి ఉండకపోవచ్చు. చూసినప్పటికీ పనుల వత్తిడిలో చందాసొమ్మును పంపించకపోయి ఉండవచ్చు. అటువంటివారు దయచేసి వెంటనే పత్రిక చందా పంపమని మనవి.

### శాశ్వత చందాదారులకు మనవి

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000 లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వతచందా రు.5000 లకు గాను రు.4000 లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. అలా చేయలేనివారికి ఏడాదిపాటు **'అమ్మనుడి'** పత్రికను పంపించగలం. అప్పటికీ చందాను కొనసాగించలేని వారికి పత్రికను పంపజాలమని మనవి చేస్తున్నాము. దయచేసి సహకరించగోరుతున్నాము.

### విన్నపం

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపిస్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందాదారులుగా చేర్చి పత్రికను శక్తిమంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారు మాదిరిప్రతి (శాంపుల్‌కాపి) ని కోరినచో వారికి ఉచితంగా పంపగలము.

**- ప్రచురణకర్త**






**కీ॥శే॥ దావులూరి సోమశేఖరరావు**

తెలుగు జాతి ట్రస్టు ప్రారంభ ఆలోచనకు నాంది పలికిన వారిలో ఒకరు. నడుస్తున్న చరిత్ర/ అమ్మనుడి పత్రికను తొలినుండి అభిమానించిన మిత్రులు. తెలుగు భాషోద్యమ సమాఖ్య, తెనాలి శాఖ అధ్యక్షులుగా ఎంతో కృషి చేశారు. 1987 నుండి సహకార రంగంలో తెనాలి అర్బన్ బ్యాంకు డైరెక్టరుగా, చైర్మనుగా, 1999 వరకు పని చేశారు. 1962లో ఆచార్య ఎన్.జి. రంగా, సర్దార్ గౌతు లచ్చన్న గార్ల నేతృత్వంలో స్వతంత్ర పార్టీతో రాజకీయ జీవితం మొదలుపెట్టి, జనతా పార్టీ, లోక్‌దళ్‌లలో పని చేశారు. తరువాత తెలుగుదేశం పార్టీలో చివరి వరకు క్రియాశీలంగా పని చేశారు. కాకతీయ కో-ఆపరేటివ్ సొసైటీని స్థాపించి, అధ్యక్షులుగా దానిని అనతి కాలంలోనే ఉత్తమ బ్యాంకులలో ఒకటిగా తీర్చిదిద్దారు.

---

కాకతీయ కో-ఆపరేటివ్ సొసైటీ
తరఫున ట్రస్టు అధ్యక్షులు
దావులూరి లక్ష్మీకాంతారావు గారు
వీరి జ్ఞాపకంగా ట్రస్టుకు రూ.10,000/-ప్రోత్సాహక విరాళాన్ని అందజేశారు.

# తెలుగుజాతి (ట్రస్టు)

## విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరుగుతున్నది. దానినే ఇప్పుడు **అమ్మనుడి** కొనసాగిస్తున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. కొన్ని కార్యక్రమాల్ని కూడా చేపట్టవలసివుంది. ఇందుకోసం ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును రిజిస్ట్రేషన్ చేయించాము. (92/2014).

తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలోనే కాక ఇతర రాష్ట్రాల్లోనూ, ఇతర దేశాల్లోనూ వున్న తెలుగు ప్రజలకోసం ట్రస్టు పనిచేస్తుంది.

'**నడుస్తున్న చరిత్ర**' 2013 అక్టోబర్‌తో నిలిచింది. దాని కొనసాగింపుగా మరింత సమగ్రంగా '**అమ్మనుడి**'ని 2015 మార్చి నుండి పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం '**ఎల్లలు లేని తెలుగు**'ను విడుదల చేశాము. తక్కిన కార్యక్రమాలను కూడా చేపడతాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో ఏర్పరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

**ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | |
|---|---|
| ప్రోత్సాహకులు రు. 10,000/-లు | పోషకులు రు. 25,000/-లు |
| విశిష్ట పోషకులు రు. 50,000/-లు | రాజ పోషకులు రు. 1,00,000/-లు |

దాత ఫొటోతో క్లుప్తంగా పరిచయాన్ని '**అమ్మనుడి**' పత్రికలో ప్రచురిస్తాము.
వీరికి పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి.
యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136

**పారుపల్లి కోదండరామయ్య,** ట్రస్టీ, 9505298565
**డా॥వెన్నిసెట్టి సింగారావు,** ట్రస్టీ, 9393015584
**స.వెం.రమేశ్,** ట్రస్టీ, 8500548142
**సామల లక్ష్మణబాబు,** ట్రస్టీ, 9440448244

## ఇవీ ముచ్చట్లు

**ఆం**ధ్రప్రదేశ్ కొత్త రాజధాని నిర్మాణానికై శంకుస్థాపన పండుగకు ప్రభుత్వం ముద్రించిన ఆహ్వాన పత్రంలో తెలుగక్షరం ముచ్చుకైనా లేదు. ఇందుకు భాషోద్యమకారులు నిరసన తెల్పుతూ వార్తా ప్రసార సాధనాల్లో ప్రకటనలు ఇచ్చారు. ప్రసిద్ధ వ్యంగ్య చిత్రకారుడు 'సరసి' (నడుస్తున్న చరిత్ర/అమ్మనుడికి ఆత్మీయులు) కూడా తమ నిరసనను ఈ కార్టూన్ ద్వారా ఫేస్‌బుక్‌లో తెలియపరిచారు. ఆ కార్టూన్ సంచలనాన్నే కలిగించింది.




**పా**కిస్తాన్ రాజ్యాంగంలో 251 ప్రకారం ఉర్దూను అధికార భాషగా పాటించాలి. ఇందుకోసం వెంటనే అన్ని విధాలా చర్యలు తీసుకోవాలని పాక్ అత్యున్నత న్యాయస్థానం ప్రభుత్వాన్ని సెప్టెంబరు 8న ఆదేశించింది. ఈ ఆదేశం వెలువడిన మరుక్షణం నుండి అన్ని అధికారిక వ్యవహారాల్లోనూ ఇంగ్లీష్‌కు బదులుగా ఉర్దూనే ఉపయోగించాలని, నాయకులు, అధికారులు తమ ప్రసంగాలను ఉర్దూలోనే చెయ్యాలని కూడా సుప్రీంకోర్టు ఆదేశించింది. అయితే పాక్ ప్రధానమంత్రి ఇటీవల ఐక్యరాజ్యసమితిలో ఇంగ్లీషులో మాట్లాడారట. అందువల్ల సుప్రీంకోర్టు ఆదేశాలను ఆయన ధిక్కరించినట్లయిందని జాహిద్ ఘనీ అనే వ్యక్తి పాక్ కోర్టులో ఫిర్యాదు చేశాడట. తన అభియోగంలో ఆయన మరొక మాట కూడా అన్నాడు. భారత్‌తో సహా పలు దేశాల నాయకులు ఐక్యరాజ్యసమితిలో తమ జాతీయ భాషల్లో ప్రసంగించారని, షరీఫ్ మాత్రం ఇంగ్లీష్‌లో ప్రసంగించాడని, ఇది కోర్టు ధిక్కరణే అవుతుందని ఆ పిటిషనర్ తన దావాలో పేర్కొన్నాడు. చూశారా! దేశాల ఆత్మగౌరవాన్ని కాపాడుకోవటానికి గుర్తుగా సొంత భాషకు ఎంత గౌరవాన్నిస్తారో...

**త**మిళనాడులో తమ భాషను స్వాభిమానానికి సంకేతంగా ఎంత ప్రాధాన్యత నిస్తారో అందరికీ తెలిసిందే. జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లో విద్య వ్యాపార రంగాలతో సహా అన్ని సందర్భాల్లో తమిళనాడులో జరిగే సమావేశాల్లో, సెమినార్లలో, వేదికమీద, బయట ఎటువంటి ప్రకటనలు, బ్యానర్లు పెట్టినా అందులో తమిళానికి ప్రాధాన్యత వుంటుంది. ఆ తర్వాతే ఇంగ్లీషుకు చోటు. వాళ్ళు ఇంగ్లీషును తగినంతగా మాత్రం అవసరాలకు వాడతారు. ఏదైనా తమ భాష తర్వాతే. కాని, మనం ఆంగ్లానికి అగ్రస్థానం ఇస్తాం. ఇస్తే గిస్తే తెలుగుకు ఆ తర్వాత స్థానమే. చాలా సందర్భాల్లో ఇంగ్లీష్ మాత్రమే వుంటుంది. ఇది మన గొప్పదనమా, ఆత్మవంచనా?!

సంపుటి : 1 సంచిక : 9
అమ్మనుడి
నవంబర్ 2015

సంపాదకీయం

# మళ్ళీ 2002లో కొచ్చామా?!

*ఈ అక్టోబరు 22న ఆంధ్రప్రదేశ్ కొత్త రాజధాని అమరావతి నగర నిర్మాణానికి శంకుస్థాపనను భారత ప్రధానమంత్రి మోడీ గారి చేత చేయించారు ముఖ్యమంత్రి చంద్రబాబు గారు. ఆ మొత్తం కార్యక్రమాన్ని మున్నెన్నడూ కనీ వినీ ఎరుగని స్థాయిలో జరిపిస్తామని ఆయన పదే పదే ప్రకటించారు. ప్రపంచంలోని అన్ని రాజధానుల్ని తలదన్నే గొప్ప రాజధాని నగరాన్ని నిర్మించుకోబోతున్నాం గనుక అందుకు తగ్గ విధంగా ఈ కార్యక్రమాన్ని జరపాలని నిర్ణయించినట్లు ఆయనే తన ప్రసంగాల్లో తెలియజేశారు. ప్రజల్లో ఎన్నో ఆశలను, ఉత్సాహాన్ని రేకెత్తించారు. మన మట్టి-మన నీరు అని ఆత్మగౌరవ నినాదాన్నిచ్చారు. 'మన అమరావతి- మన రాజధాని' అని కూడా ప్రకటించారు. ఆధునిక నాగరికతతో పాటు ఆంధ్ర సంస్కృతిని ప్రతిబింబించే విధంగా రాజధాని వుంటుందని ముఖ్యమంత్రి ప్రకటించారు. శంకుస్థాపన కార్యక్రమం ఈ రాష్ట్ర ప్రజలకు పెద్ద పండుగ అని, ఆనాడు దసరా పండుగ కూడా కనుక 'మనకు రెండు పండుగలు' ఒకేసారిగా వస్తున్నాయని ఆయన అన్నారు.*

*మరి ఆరోజు కార్యక్రమం ఆయన చెప్పినంత ఘనంగా జరిగిందా? దాని మంచి చెడ్డలు, మానావమానాల సంగతి ఏమిటి? ఏ విధంగా చూచినా ఆరోజు జరిగినదేమీ సవ్యంగా లేదని వస్తున్న విమర్శల సంగతి అలా వుంచండి. వాటిని వేరే చోట పరిశీలించుదాం. ఇక్కడ ప్రస్తావించుకోవలసింది- మొత్తం కార్యక్రమం జరిగిన తీరు వెనుక వున్న పాలకుల మనోస్థితి, వారి అంతరాల్లో గూడుకట్టుకుపోయిన భావజాలం ఏమిటి- అనేది. ఇందుకు తగ్గ సంకేతాల్ని ముఖ్యమంత్రిగారు, ఆయన ప్రభుత్వమూ స్పష్టంగానే ఇచ్చారు.*

*అన్ని దశల్లోనూ తెలుగుకు చోటు లేకుండా చేసి, తెలుగుదనాన్నీ, స్థానిక సంస్కృతినీ మటుమాయం చేసిన తీరులోనే ఆ సంకేతాలను మనం గమనించవచ్చు.*

*ఆహ్వానపత్రాల్లో తెలుగు లేకుండా చేసి, ప్రభుత్వ భాషావిధానం ఏమిటో జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లో స్పష్టం చేశారు.*

*శంకుస్థాపన ఫలకంపైన తెలుగు అక్షరం లేకుండా చేసి, మనం 'ప్రపంచీకరణ'కు తిరుగులేని ప్రతినిధులమని ప్రకటించారు. ఇందుకోసం ఆత్మాభిమానాన్ని విడిచిపెట్టేశామని నిస్సిగ్గుగా చేసిన మౌనప్రకటనగా ఆ 'ఫలకం' నిలిచి వుంది. ఆ సందర్భంగా జరిగిన పెద్ద సభావేదిక మీద కూడా ఆంగ్లమే తప్ప అమ్మనుడికి చోటే లేకుండా చేశారు. ఇంతకంటే ఒక జాతిని అవమానించడానికి వేరే ఏమైనా చెయ్యాలా?*

*ఒక్క బుద్ధుడి బొమ్మను మాత్రం వీలున్నన్నిచోట్ల ప్రదర్శించడం తప్ప ఆయన బోధల్ని గాని, తెలుగునేలపై బౌద్ధ ప్రాధాన్యత గురించి గానీ పెద్ద ఎత్తున ప్రచారం చెయ్యడానికి పూనుకోలేదు. అమరావతి ప్రదర్శనలో కూడా ఒక్క తెలుగు అక్షరం లేదు. ఇక మనదైన భావజాలానికి ఆస్కారం ఎక్కడుంది?*

*అన్నిటికంటే పాలకుల మైండ్‌సెట్‌ను, వారి పాలసీని స్పష్టం చేసేందుకోసం కాబోలు-చంద్రబాబు గారు, ఆయన కుటుంబ సభ్యులూ 'మన అమరావతి-మన రాజధాని' అనే నినాదాన్ని కూడా ఇంగ్లీషులోనే వ్రాసిన పలకలను చేతపట్టుకొని తీయించుకొన్న ఫొటోలను ఈ సంచిక ముఖచిత్రంపై చూడండి. ఇంతకంటే వారి యోచనలను వెల్లడించే సాక్ష్యాలు, వారి మనసును తెలిపే మౌనరాగాలు ఏంకావాలి?*

*ఒక్క రాజధాని సందర్భమే కాదు, ఆనాడే తిరుపతిలో జరిగిన 'మొబైల్ హబ్' (సెల్‌ఫోన్ల తయారీ పరిశ్రమల కేంద్రం)ను ఆవిష్కరించిన 'శిలాఫలకం' పైన కూడా ఒక్క తెలుగు అక్షరం అయినా లేదు. అంతా ఆంగ్లమే...ఆంగ్లం మాత్రమే. ఎందుకంటే ఈ ప్రాజెక్టు కూడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానిదే కనుక!*

*మరొక సంగతిని మనం ముఖ్యంగా గమనించాలి. ఆరోజే తిరుపతిలో విమానాశ్రయ కట్టుబడికి తెరదీసిన*

సంపాదక స్వరం

ఫలకాల్ని కూడా గమనించండి. మొదటిది తెలుగులో, రెండవది హిందీలో, మూడవది ఇంగ్లీష్‌లో పక్క పక్కనే పెట్టి కేంద్రం తన త్రిభాషా సూత్రాన్ని స్పష్టంగా ప్రదర్శించింది. దాన్ని చూచి అయినా మన పాలకుల్లో ఏమైనా మార్పు వస్తుందని అనుకొంటే అది మన తప్పే.

నిజానికి– మొన్న ఆగస్టు 29 తెలుగుభాషా దినోత్సవం నాడే తమ ప్రభుత్వ భాషావిధానాన్ని చాలా సున్నితంగా తన ప్రసంగంలో ప్రకటనల్లో మన ముఖ్యమంత్రిగారు తెలియచేశారు. దాన్ని 'అమ్మనుడి' సెప్టెంబరు సంచికలో ప్రస్తావించుకొన్నాం కూడా. ఇంకా, ప్రభుత్వ మానసిక స్థితిని, విధానాన్ని గ్రహించడానికి వేరే ఏం కావాలి?

ఇక్కడే– మనం 2003 వరకూ నడిచిన చంద్రబాబుగారి ప్రభుత్వ హయాంలో తెలుగును ఏ విధంగా అణగదొక్కిందీ గుర్తుకు తెచ్చుకోవాలి. ఆ పరిస్థితుల్లోనే తెలుగు భాషోద్యమం మొదలైన సంగతిని మనం గుర్తుకు తెచ్చుకోవాలి.

ఆంధ్రప్రదేశ్ సచివాలయం వాకిలిని హుస్సేన్‌సాగర్ వైపుకు మార్చినపుడు అక్కడ 'ఆంధ్రప్రదేశ్ సెక్రెటేరియట్' అని ఇంగ్లీష్‌లోనే ప్రముఖంగా బోర్డుపెట్టి తెలుగుమాటే లేకుండా చేసిన సంగతిని మనం మరచిపోలేం. అప్పుడే అక్కడ తెలుగుతల్లి విగ్రహాన్ని నెలకొల్పి, ఆమె పాదాల క్రింద దిమ్మెపై అన్ని వైపులా అవిష్కరణలో పాల్గొన్న అందరిపేర్లు, చివరకు 'తెలుగుతల్లి' అనే మాటను కూడా ఇంగ్లీష్‌లో మాత్రమే వ్రాసిన సంగతిని మనం మరచిపోలేం.

అప్పుడు తెలుగు భాషోద్యమకారులు ప్రభుత్వానికి నోటీసు ఇచ్చి, సత్యాగ్రహానికి పూనుకొని, సచివాలయం వాకిలికి అడ్డంగా పడుకొని, అరెస్టయిన సంగతినీ, విజయాన్ని సాధించి తెలుగుతల్లి విగ్రహం క్రింద, సచివాలయం వాకిలిపైన తెలుగు అక్షరాలను పెట్టించిన సంగతిని మనం మరచిపోకూడదు.

ఇప్పుడు మళ్లీ అదే పరిస్థితి వచ్చింది. అంటే మళ్లీ 2002–2003 నాటి పరిస్థితికి వచ్చాం. 2004 ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ ఓడిపోవడానికి ఎన్నో కారణాలున్నప్పటికీ భాషోద్యమకారుల ఆగ్రహం కూడా ఎంతో కొంత ప్రజల మనస్సులపై పని చేసిందనుకోవడం అతిశయోక్తేం కాదు.

ఇప్పుడు మొత్తం తెలుగు సమాజంలో ఒక విధమైన స్తబ్ధత చోటుచేసుకొంది. అన్ని విధాలుగా తీవ్రమైన అసంతృప్తి పేరుకొంటున్నది. ప్రస్తుతానికి ఏమీ చేయలేని మౌన ప్రేక్షకులుగా మిగిలిపోతున్నారు. ఎందుకంటే అన్ని పాలక రాజకీయ పార్టీలూ పేరులోనే తేడా తప్ప ప్రజావ్యతిరేక విధానాల్లో ఒకే ధోరణిలో వున్నాయి. తెలుగు పట్ల కూడా వాళ్ల ఆలోచనలు ఇంచుమించు ఒకే విధంగా వున్నాయి.

జనంలో భావోద్వేగాలను శాంతింప జెయ్యడం కోసం తెలుగు భాష, తెలుగు సంస్కృతి గొప్పదనాన్ని కీర్తిస్తూ నాయకులు మాట్లాడుతుంటారు. సందర్భం దొరికినప్పుడల్లా వేదికలపై తమకంటె తెలుగు భాషాప్రియులు లేనట్లు మాట్లాడతారు. తామే తెలుగు సేవకులమన్నట్లు, నేతలమన్నట్లు మాట్లాడతారు. ఆ తర్వాత మళ్లీ మామూలే. ఎవరికీ ఏమీ పట్టదు. ఎందుకంటే వాళ్లందరిదీ ఒకే 'మైండ్ సెట్'...ఒకే అభిప్రాయం. తప్పనిసరి అయితేనే తెలుగు, దాని అవసరం లేనపుడు అంతా పరభాషాదాస్యమే. అంతేగాని శాస్త్రీయమైన, హేతుబద్ధమైన భావజాలాన్ని ఆమోదించే స్థితిలో వారు లేరు.

అన్ని మతాల దేవుళ్లపట్ల, పండుగల పట్ల, ఆచారాల పట్ల రోజురోజుకు పాలకుల శ్రద్ధ పెరుగుతోంది. అదంతా ప్రజల ఆదరణను మరింతగా మోసగించి లబ్దిపొందడం కోసమే. తెలుగుపట్ల, తెలుగు సంస్కృతిపట్ల వారు అప్పుడప్పుడూ ప్రదర్శించే ఆసక్తి కూడా అటువంటి మోసపూరితమైనదే.

మళ్లీ 2002–2003 నాటి పరిస్థితి వచ్చిందని మనం గ్రహించాలి. దీన్నొక కాలం విసిరిన సవాలుగా, అవకాశంగా స్వీకరించి మరింత బలమైన ఉద్యమ నిర్మాణానికి పూనుకోవాలి. అది శంకుస్థాపన ఫలకాలతోనే మళ్లీ మొదలు కావాలి. ఒక స్పష్టమైన శాస్త్రీయమైన భాషావిధాన సాధనకోసం ఉద్యమం సాగాలి. తమ మాతృభాషా రక్షణకు, అభివృద్ధికి పాటుపడేవాళ్లకే ఓట్లు వేయాలనే తెలివిని, పట్టుదలను ప్రజల్లో పెంపొందించేందుకు నిరంతర ఉద్యమం సాగాలి.

**30-10-2015**

సామల రమేష్‌బాబు

–డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

ముఖచిత్ర కథనం

# తెలుగు రాజధానిలో తెలుగు నిషిద్ధమా?

నవ్యాంధ్ర రాజధాని అమరావతి శంకుస్థాపన ముగిసింది. తాను చేసినంత ఘనంగా ఆ ఉత్సవం మరెవరూ చెయ్యలేరని, చెయ్య బోరని అనుకుంటూ చంద్రబాబు ఉబ్బితబ్బిబ్బు అవుతున్నారు. అది ఆయన సహజగుణం. అయితే అమరావతి శంకుస్థాపన కార్యక్రమం ఎవరికైనా ఆనందం కలిగించిందేమో కాని ఆ నగరం ఎవరి కోసమైతే నిర్మించదలుచు కున్నారో ఆ తెలుగు వారికి మాత్రం ఏమాత్రం సంతోషం కలిగించలేదు. అందునా తెలుగు భాషాభిమానులకు నిరాశను మిగిల్చింది. ఆ కార్యక్రమ నిర్వహణలో ముఖ్యమంత్రి సృష్టించిన హడావుడి, ఆర్భాటం వంటి వాటిలోపడి చాలామంది ప్రత్యక్షంగా చూసినవారు, టెలివిజన్ తెరలముందు కూర్చున్నవారు గమనించారో లేదో కాని అమరావతి నగరంలో తెలుగుకి ప్రవేశం లేదన్న విషయం ఆనాడు స్పష్టమైంది. చంద్రబాబు పాలనలో తెలుగు భాషకు జరిగిన అన్యాయానికి, జరుగుతున్న అవమానానికి మరో మచ్చు తునక నిన్నటి అమరావతినగర శంకుస్థాపన. అమరావతి నగర శంకుస్థాపన కార్యక్రమం రోజున నిర్మించిన వేదికలపైన గాని, ప్రముఖులను ఆహ్వానిస్తూ కట్టిన స్వాగత ద్వారాలకు గాని ఎక్కడా తెలుగు వాసనలు లేవు. తాము తెలుగు మాట్లాడటమే చిన్నతనంగా, తెలుగు భాష తక్కువస్థాయిది అయినట్టుగా చంద్రబాబు వ్యవహరించాడు. ఆహ్వాన పత్రిక తెలుగులో ముద్రించలేదు. అందరికీ ఆంగ్లంలోనే ఆహ్వాన పత్రాల్నివ్వాలన్న నిర్ణయం తీసుకున్నాడు. ఆ విషయం మీద తెలుగు భాషాభిమానులు అభ్యంతరం తెలియజేస్తే మొక్కుబడిగా తెలుగులోనూ ఆహ్వాన పత్రాలు ముద్రిస్తున్నామని ప్రకటించారు. కాని నిజానికి ముద్రించిన ఆహ్వాన పత్రాలు పంచింది లేదు. ముద్రించిన తెలుగు ఆహ్వాన పత్రాలు




గోడౌన్లకే పరిమితమయ్యాయో, కట్టలు కట్టి కాల్వలో పారేశారో తెలియదు. కాని ఒక విషయం స్పష్టం. తెలుగుభాష విషయంలో అభి మానులు చెప్పేమాటలు, చేసే విమర్శలు చంద్రబాబు విషయంలో దున్నపోతు మీద కురిసే వాన చినుకుల వంటివే.

అమరావతి నగరానికి సింగపూర్ వారిచ్చిన నమూనాతో ఇంగ్లీషు అక్షరాలను కలగలిపిన బోర్డును వేదిక వెనుక భాగంలో పెట్టించాడు చంద్రబాబు. ఇటువంటి భారీ కార్య క్రమం తెలుగేతర రాష్ట్రాలలో జరిగి




నపుడు స్థానిక భాషకు ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు ఎలాంటి ప్రాధాన్యత, గౌరవం యిస్తాయో చంద్రబాబు తెలుసుకోవాలి. దక్షిణాదిలోని మరే ఇతర రాష్ట్రంలోనూ ఏలినవారు స్థానిక భాషను ఇలా అవమానించటం మనం ఎరుగం.

ఇక ప్రధానమంత్రి చేతుల మీదుగా వేసిన శంకుస్థాపన ఫలకం గమనించారా! అందులో ఒక్క తెలుగు అక్షరమంటూ లేదు. "నేను సైతం" అంటూ వచ్చీరాని తెలుగు ముక్కలు పలికి ప్రధాని నరేంద్ర మోడీ, నిన్న మొన్నటివరకు ఆంధ్రులను అన్ని రకాల అవమానకర మాటలతో తిట్టిన కె.సి.ఆర్ తెలుగు పలుకులు, తెలుగు ఆత్మ అంటూ వెంకయ్యనాయుడు పనికిమాలిన ప్రసంగం ద్వారా మనం తెలుగు వారమను కోవాలేమో గాని వేదిక అలంకరణ, శంకుస్థాపన ఫలకం వల్ల అది తెలుగునాట జరిగిన కార్యక్రమం అనిపించదు.

ఆయన పార్టీ పేరు 'తెలుగుదేశం', ఆయనకి అధికారం కట్టబెట్టేది తెలుగు ఓటర్లు, ఇంట్లో మాట్లాడేది తెలుగు, తినేది తెలుగు తిండి.... కాని ఆమహానుభావుడికి తెలుగంటే పడదు. ఆయనే మన ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు. తెలుగును కాదని తెలుగు విద్యార్థులకు ఇంగ్లీష్ మాధ్యమం అంటగట్టే యత్నం చాలా కాలంగా చేస్తున్నాడు. అటువంటి చంద్రబాబు తన ప్రసంగంలో ప్రధాని నరేంద్ర మోడీతో సహా వేదిక మీదున్న ఇతర భాషల వారికి అర్థం కావాలని మాట్లాడిన ఇంగ్లీషు విన్నారా? ఇటువంటి ఇంగ్లీష్‌నా ఆంధ్రప్రదేశ్‌లో విద్యార్థులకు ఆయన నేర్ప దలచు కున్నది? ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి స్థానంలో ఆయన అనుసరించిన విద్యా విధానంలో అటు మాతృభాష తెలుగు, ఇటు ఇంగ్లీషు రెండూ రాకుండా పోయాయి. డిగ్రీ,



రాజధాని అమరావతి కట్టుబడికి శంకుస్థాపన సందర్భంగా ఫలకాన్ని ప్రధాని ఆవిష్కరిస్తున్న దృశ్యం



తిరుపతిలో మొబైల్ హబ్ నిర్మాణానికి పునాది వేసిన సందర్భంగా ఫలకాన్ని ఆవిష్కరిస్తున్న దృశ్యం

పై రెండూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నిర్మాణాలే. రెండిట్లోనూ అధికార భాష, ప్రజల భాష అయిన మన అమ్మనుడి తెలుగుకు చోటు లేదు.

ఇంజనీరింగ్‌లు పూర్తి చేసినవారు తిరిగి ఇంగ్లీషు కోచింగ్ క్లాసులకు వెళుతున్నారు. పాఠ్యాంశ నైపుణ్యం లేదు. భాషా నైపుణ్యం లేదు. ఇప్పుడు దీనికోసం నైపుణ్యాలను అందించే కొత్త పథకాలు, నిధుల దండగ.

హైస్కూల్‌స్థాయి వరకు మాతృభాషలో విద్యాబోధన గావించిన మన తరాలకు భాష మీద పట్టు ఎలా వుందో, కాన్వెంట్ చదువులు, ఇంగ్లీషు మీడియం ప్రోత్సహించిన చంద్రబాబు హయాంలో బయటకొచ్చిన విద్యార్థులు ఎలా వున్నారో ఒకసారి చూడండి.

భాషావిధానం కరువైన ప్రభుత్వం చంద్రబాబుది. అందుకే ఆయన పొరుగు రాష్ట్రాలలో తెలుగును చంపేసి తమిళంను బలవంతంగా తమమీద రుద్దుతున్నారని అక్కడి తెలుగువారు గగ్గోలు పెడుతున్నా పట్టించుకోవడం లేదు. తెలుగు మాతృభాషగా వున్నవారికి అన్యాయం చేయవద్దని తమిళనాడు ముఖ్యమంత్రి జయ లలితకు ఉత్తరం రాయలేని బలహీన స్థితిలో వున్నాడు. చంద్రబాబు విదేశీ వ్యామోహం వల్ల తెలుగు భాషకు మరింత ప్రమాదం పొంచి వుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని విదేశాల అభివృద్ధికి రాళ్ళెత్తే సాంకేతిక కూలీలను ఉత్పత్తి చేసే రాష్ట్రంగా తయారుచేసి అది తన పరిపాలన ఘనతగా చెప్పుకుంటున్నాడు. తన విధానం వల్ల ఒక తరం పూర్తిగా మాతృభాషకు దూరమైందని, వారి పిల్లలు అమెరికాలో తెలుగుకు దూరంగా పెరుగుతున్నారన్న బాధ చంద్రబాబులో లేదు. ఆర్థిక ఎదుగుదల వుంటే తల్లిదండ్రులు, తల్లి భాష ఎటు పోయినా పరవాలేదనుకుంటున్నాడు. దీనిని అడ్డుకోవాలి. రేపు రాబోయే రోజుల్లో అమరావతిలో తెలుగు గతి ఏమిటో శంకుస్థాపన నాడే చంద్రబాబు రుచి చూపించాడు కాబట్టి తమ భాషను తాము కాపాడుకొనే యత్నం భాషాభిమానులు చేయాలిపుడు.

అమరావతి శంకుస్థాపన హడావుడిగా ముగించి ప్రధాని వెంట తిరుపతి కార్యక్రమాలకు వెళ్ళి అక్కడి కేంద్ర ప్రభుత్వ భాషా విధానం గమనించిన తర్వాతైనా చంద్రబాబుకు పశ్చాత్తాపం కలిగి ఉంటుందా అనేది సందేహమే. కేంద్రానిది త్రిభాషా సూత్రం. స్థానిక భాష, జాతీయ భాష, ఆంగ్లభాష అనుసరిస్తాయి. దానికి అనుగుణంగానే తిరుపతి విమానాశ్రయం,



# సన్నాయి నొక్కులు

ఎవడు ఏ మేళం వాయిస్తే ఆ మేళానికి
ఎగబడి ఎగిరెగిరి వాయించిందెవరు?
ఎవడు ఏ తాళం మోగిస్తే ఆ తాళానికి
ఎదురొచ్చి ఎసగెసగి వంత పాడిందెవరు?
ఊపిరి లూదిందెవరు?
ప్రజా ప్రయోజన కళలు, కలు
కబేళాకు తోలడానికి
బృందగాన మాలపించిందెవ్వరు?
వెండితెర బహుబల్లి నోరు తెరిచి
రాచరికం నాలుకతో కరిచి
గ్రాఫిక్ గోళ్లతో నొక్కి
చూపుల తలలు కొరికి
కాసుల సొరంగంలోకి ఈడ్చుకుపోతుంటే
సైసై మని ఊగిందెవరు?
జైజై మని మోగిందెవరు?
తమకై తమ వ్యక్తి చింతనని దూరం పెట్టి
సమిష్టి స్వేద సంపద మీద
నిర్మించుకోవలసిన గ్రామాల్ని
చిత్రశకట శ్రీమంత చలనం క్రింద...
దత్తత స్వీకార దాక్షిణ్యం కింద
ఉబ్బరింతలు ఉబ్బించుకోవచ్చని
ఉసిగొల్పిందెవరు?
పడుచు పిల్లల పరువాన్ని పీలికలు చేసి
వెకిలి వ్యాపార సూత్రాలకు వేలాడదీసిందెవరు?
ప్రజల్ని పక్కదారి పట్టించే
పోకిరి పోట్లాటలెంతకాలం?
ఎవరి ఎక్కువలు పెంచడానికీ
ఎగుడు దిగుడు ఎత్తుగడల
ఎత్తుబారం సెట్టింగులు?
నీతిలీలలు?
ఎవరి పెత్తనాన్ని పదిలపరచడానికీ
సంభాషణీయం?
ఎవరి పాటల పాటవానికీ
వివిధ సంగీతవాద్య సంయోగం?
ఏ భాషోద్ధరణకీ
సన్నాయి నొక్కులు?

రచయిత:
**శ్రీ వెలుగు వెంకట సుబ్బారావు,** ఉపాధ్యాయుడు, కవి.
మొబైల్ : 92909 42433

ఫలకాలను తెలుగులో కూడా ఏర్పాటు చేశారు. భాషావిధానం అంటూ ఒకటి వున్నందున అక్కడి అధికారులు దాని ప్రకారం మూడు భాషల్లో ఫలకాలను ఏర్పాటు చేశారు. ఆ కార్యక్రమం తర్వాత జరిగిన మొబైల్ ఫోన్ల తయారీ కేంద్రానికి వేసిన శిలాఫలకంలో మళ్ళీ కథ మామూలే. అది రాష్ట్ర ప్రభుత్వ కార్యక్రమం. కనుక–అక్కడ ఒక్క ఆంగ్లంలో మాత్రమే శిలాఫలకం ఉంది. ఇది చాలదూ చంద్రబాబు ప్రభుత్వానికి తెలుగంటే ఎంత చులకనో తెలియ డానికి! ఇది చాలదూ చంద్రబాబు ప్రభుత్వ భాషావిధానం ఏమిటో తెలుసుకోవడానికి?

చంద్రబాబు ప్రభుత్వానికి ఒక భాషా విధానం అంటూ లేదని ఆయన దగ్గర పనిచేసే అధికారులందరికీ తెలుసు. అందుకే గుంటూరు జిల్లా కలెక్టర్ ధైర్యంగా ఇంగ్లీషు భాషలో మాత్రమే శిలాఫలకం తయారు చేయించాడు. శంకుస్థాపన రోజుకు వారం పదిరోజుల ముందు నుండీ రాష్ట్ర యంత్రాంగం మొత్తం అమరావతి మీదే దృష్టి కేంద్రీకరించారు, అక్కడే మకాం వేశారు. అయినా వారిలో కనీసం ఒక్క మంత్రికిగాని, తెలుగు వాడైన ప్రధాన కార్యదర్శి, డి.జి.పి. లకు గాని తెలుగు పదం లేదన్న విషయం స్ఫురణకు రాలేదా? వారికి అటువంటి ఆలోచన రానంతగా చంద్రబాబు ప్రభుత్వ భాషావిధాన లోపం వారిమీద పనిచేసిందా?

అమరావతిలో అది చేస్తాం ఇది చేస్తాం.. అంతా విదేశాల నుండి తెచ్చి యిక్కడ పెడతాం అన్నదే చంద్రబాబు మాట. ఆయన నది విదేశమైనా కనీసం తాను పెట్టుబడుల కోసం భిక్షాటన చేస్తున్న చైనా, జపాన్‌లు అనుసరిస్తున్న భాషావిధానం, అక్కడి నాయకులు ప్రదర్శించే భాషాభిమానం చంద్రబాబుకి కనిపించలేదా? వారి నుండి ఆ స్ఫూర్తిని తీసుకోలేదా బాబు. ఇంగ్లీషులోనే సర్వస్వం అనుకునే చంద్రబాబు మీద వత్తిడి తెచ్చి తెలుగు భాష గౌరవ ప్రతిష్ఠలకు భంగం కలిగిస్తే వూరుకోం అన్న హెచ్చరిక జారీ చేయాలి. అది విని చంద్రబాబు తన భాషా విధానం మార్చు కున్నాడా సరే, లేకుంటే వచ్చే ఎన్నికల్లో ఆయన్నే వదిలించుకునేందుకు తెలుగు భాషాభిమానులు ఉద్యమిస్తారని ఆయన తెలుసుకోవాలి.

ఇది హెచ్చరిక.

రచయిత–రాజకీయ విశ్లేషకుడు, విశ్రాంత అధ్యాపకుడు, మొబైల్ : 9440421695

పిట్టచూపు

# అమరావతి ఆరంభంలో ఆడంబరం, అవమానాలే మిగిలాయి!

– చలసాని నరేంద్ర

**ఆం**ధ్రప్రదేశ్ రాజధాని నగరం అమరావతి శంకుస్థాపన విజయదశమి పర్వదినం నాడు రంగరంగ వైభవంగా జరిగింది. స్వయంగా ప్రధానమంత్రి నరేంద్ర మోడీ వచ్చి ఈ కార్యక్రమాన్ని జరిపారు. ఈ సందర్భంగా పలువురు పారిశ్రామిక దిగ్గజాలు, పొరుగు రాష్ట్రం తెలంగాణ ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్ రావు కూడా వచ్చి పాల్గొనడంతో వార్తల పరంగా ప్రాధాన్యతను సంతరించుకొంది. దీనికి ప్రజల రాజధాని నగరంగా పేరు పెట్టడంతో ప్రజలు పెద్ద ఎత్తున వచ్చి ఈ సంబరంలో భాగస్వాములయ్యారు.




అయితే కార్యక్రమం జరిగిన తీరు ఒకింత నిరాశాజనకంగానే ఉంది. మరో వంక ఈ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి ప్రధానమంత్రి ఘనమైన వరాల వర్షం కురిపిస్తారని పెద్ద ఎత్తున ప్రచారం జరిగింది. అయితే ఆయన ఢిల్లీ నుండి తీసుకు వచ్చిన మట్టి, నీరు ఉన్న కుండల్ని ఇచ్చి సరిపెట్టుకోవడంతో ప్రజలు తీవ్ర ఆశాభంగానికి గురయ్యారు.

అసలు కార్యక్రమం జరుగుతున్న తీరు పట్ల ముందుగానే ప్రధానమంత్రి కార్యాలయం తీవ్ర అసంతృప్తిని వ్యక్తం చేసింది. నాలుగున్నర నెలల క్రితమే 'భూమి పూజ' అంటూ జరిపి ఇప్పుడు 'శంకుస్థాపన' అంటున్నారు ఏమిటని ప్రధాన మంత్రి ప్రిన్సిపల్ కార్యదర్శి ఒకరు ముఖ్యమంత్రి కార్యాలయంలోని కీలక అధికారికి ఫోన్ చేసి సంజాయిషీ అడిగారు. అప్పుడు ఏదో మంచి రోజు అనుకొని నిరాడంబరంగా జరిపామని, ఇప్పుడు భారీ స్థాయిలో జరుపుతున్నామని ఆ అధికారి అన్నాడు. అంటే ఇప్పుడు మంచిరోజు కాదా' అని అమాయకంగా ఢిల్లీ నుండి అడిగితే ఆ అధికారి తెల్లముఖం వేయవలసి వచ్చింది.

అదే విధంగా అమరావతి కార్యక్రమం నిర్వహణను ముంబయికి చెందిన ఒక ఈవెంట్ మేనేజ్‌మెంట్ సంస్థకు 10 కోట్లకు అప్పచెప్పటం ఏమిటని ప్రధానమంత్రి కార్యాలయం విస్మయం వ్యక్తం చేసింది. ఒక ప్రభుత్వ కార్యక్రమ నిర్వహణను ప్రైవేటు సంస్థ నిర్వహించడం ఏమిటని ప్రశ్నించారు. ఆ విధంగా జరిగితే ప్రధానమంత్రి పాల్గొనడం కష్టం కాగలదని స్పష్టం చేసారు. దానితో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు వెంటనే ఆ సంస్థతో చేసుకున్న కాంట్రాక్టును రద్దు చేసారు. అదే విధంగా సినీ రంగ ప్రముఖులు పలువురిని పిలిపించి శంకుస్థాపన కార్యక్రమాన్ని ఒక సినిమా ఉత్సవంవలే జరపాలని వేసుకున్న ప్రణాళికలు అన్నింటినీ మానుకున్నారు.

శంకుస్థాపన కోసం వివిధ ప్రభుత్వ శాఖల సాధారణ బడ్జెట్ నిధులనుండి ఖర్చులు చేయించి ప్రత్యేకంగా నిధుల కేటాయింపు పెద్దగా లేకుండా జాగ్రత్త పడ్డారు. నిర్మించిన హెలిపాడ్‌లను తగ్గించారు. అతిథులు అందరినీ గన్నవరం విమానాశ్రయం నుండి హెలికాప్టర్‌లలో తీసుకువచ్చే ఆలోచనలను విరమించుకున్నారు. దుబారా ఖర్చులు కుదించుకొంటున్నామనే సంకేతం ఇవ్వడానికి ప్రయత్నం చేశారు.

**అయితే మొత్తం కార్యక్రమం ఒక కార్పొరేట్ కంపెనీ కార్యక్రమం వలే జరిగింది గాని, 'ప్రజల భాగస్వామ్యం' దేవుడెరుగు, ప్రజా ప్రతినిధులు, ప్రభుత్వ ఉన్నత అధికారుల భాగస్వామ్యం సైతం కనబడలేదు. ప్రపంచంలోనే అత్యుత్తమ రాజధానిని తెలుగు ప్రజలకు నిర్మిస్తామని అంటున్నారు. అయితే ఈ కార్యక్రమంలో వేదికపైన ఒక తెలుగు అక్షరం కూడా కన్పించనే లేదు. తెలుగుతనం లేకుండా ఇటువంటి కార్యక్రమం జరపడం కన్నా తెలుగు ప్రజలకు అవమానం మరొకటి ఉంటుందా?**

వేదికమీద ఉన్నవారిలో ఆంధ్రప్రదేశ్ లోని ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులు ఇద్దరే ఇద్దరు. వారు చంద్రబాబు నాయుడు, కేంద్ర మంత్రి అశోక్ గజపతి రాజు. ప్రజలనుండి ఎన్నిక కాలేక, దొడ్డిదోవన వచ్చి అధికారం చలాయిస్తున్నవారో, పొరుగు రాష్ట్రం నుండి ఎన్నికైన చంద్రశేఖరరావు, బండారు దత్తాత్రేయ వంటివారో ఉన్నారు. ప్రభుత్వ కార్యక్రమం అన్న తరువాత రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగాని, జిల్లా కలెక్టర్ గాని వేదిక మీద అసలు కనిపించక పోవడం విస్మయం కలి

గిస్తున్నది. ఇక స్థానిక సర్పంచి, శాసన సభ్యుడు, పార్లమెంటు సభ్యుడు వంటి వారె వ్వరూ ఆ ప్రాంతంలో కనిపించనే లేదు. అయినా దీనిని 'ప్రజల రాజధాని' అని నమ్మించే ప్రయత్నం చేస్తున్నారు.

సింగపూర్, జపాన్ మంత్రులు ఈ కార్య క్రమంలో పాల్గొన్నా వారు తమ దేశానికి చెందిన కంపెనీల వ్యాపార ప్రయోజనాల కోసం వచ్చినవారే గాని, మన ప్రజల పట్ల సానుభూతితో, సహకార హస్తంతో వచ్చిన వారు కాదని గమనించాలి. మొత్తం సింగపూర్ కంపెనీలతో నిర్మాణం చేయించాలని పథ కాలు సిద్ధం చేశారు. అయితే గతంలో సింగ పూర్ పాత్ర కేవలం రాజధాని నగరం ప్లాన్ తయారు చేసి ఇవ్వడం వరకే అని స్పష్టం చేశారు. నిర్మాణంలో ఆ దేశానికి ఎటువంటి అనుభవం లేదని మన మంత్రులే స్వయంగా పలుమార్లు చెప్పారు. పైగా, పలు విదేశాలలో భారీ నిర్మాణాలు చేబడుతున్న అనేక పేరున్న కంపెనీలు భారత దేశంలోనే ఉన్నాయి.

**కానీ ఇప్పుడు సింగపూర్ కంపెనీలతో లాలూచీ పడి, వారి పేరుతో తమ స్వార్థ ప్రయోజనాలు నెరవేర్చుకోవడం కోసం ఒక పెద్ద స్థిరాస్తి మాఫియా తెలుగు రాష్ట్రంలో రాజధాని పేరుతో స్వైర విహారం చేస్తున్నట్లు అర్థం అవుతున్నది. మొన్నటి వరకు కొంత కాలం హైదరాబాద్ నుండే ప్రభుత్వం పని చేస్తుందని, కొన్ని కార్యాలయాలను మాత్రమే విజయవాడకు తరలిస్తామని, రాజధాని నిర్మాణం జరిగినా తాను మాత్రం హైదరా బాద్‌లోనే నివాసం ఉంటామని చెప్పిన చంద్ర బాబు నాయుడు, ఇప్పుడు అకస్మాత్తుగా జూన్ లోగా ప్రభుత్వ ఉద్యోగులు అందరూ విజయ వాడకు తరలి రమ్మని వత్తిడి చేస్తున్నారు.**

ప్రభుత్వంలో కీలకపాత్ర వహిస్తున్న కొందరు నాయకులను స్థిరాస్థి వ్యాపారులే నడి పిస్తున్నారా అనే అనుమానాలు ఈ సంద ర్భంగా కలుగుతున్నాయి. ముఖ్యమంత్రితో సహా పలువురు ప్రముఖులు నిబంధనలను అతిక్రమించి స్థిరాస్థి వ్యాపారులు నిర్మించిన భవనాలలో నివాసానికి సిద్ధపడటం గమ నార్హం. అటువంటి వ్యాపారులు తాము నిర్మి స్తున్న భవనాలను భారీ అద్దెలకు ప్రభుత్వానికి అప్పచెప్పి లబ్ధి పొందడం కోసమే ఈ హడా




వుడి చేయిస్తున్నట్లు పలువురు అనుమాని స్తున్నారు.

అమరావతికి శంకుస్థాపన జరిగిన రెండు రోజులకే, సమీపంలో తెలుగుదేశం పార్టీకి చెందిన ఒక నాయకుడి పొలం అగ్నికి ఆహుతి కావడం ఈ సందర్భంగా విస్మయం కలిగిస్తున్నది. ప్రభుత్వం తమకు స్పష్టమైన హామీ ఇస్తేనే, తమ భూములను రాజధాని నిర్మాణానికి అప్పచెబుతామని స్పష్టం చేస్తున్న వారిని భయపెట్టి దారిలోకి తెచ్చుకోవడం కోసం జరుగుతున్న కుట్రపూరిత వ్యవహారంగా ఇదంతా కనిపిస్తున్నది.

మరోవంక శంకుస్థాపనకు వస్తున్న ప్రధానమంత్రి ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి భారీ నిధుల వర్షం కురిపిస్తారని పత్రికలలో వార్తలు శరపరంపరగా వచ్చాయి. అందుకోసం నీతి ఆయోగ్ కసరత్తు చేస్తున్నట్లు కూడా వార్తలు వచ్చాయి. గతంలో బిజెపి నాయకత్వం హామీ ఇచ్చిన 'ప్రత్యేకహోదా'ను ఇప్పుడు ప్రకటించ డానికి బీహార్ ఎన్నికలు అడ్డుగా ఉన్నాయని, ఈలోగా భారీ ఆర్థిక ప్యాకేజి ప్రకటిస్తారని అందరూ ఎదురు చూశారు.

అయితే రాష్ట్రవిభజన చట్టానికి కట్టుబడి ఉంటామని తప్ప,ప్రధానమంత్రి ఒక రూపాయి కూడా అదనంగా సహాయాన్ని ప్రకటించలేదు. చట్టంలో ఉన్న అంశాలను అమలు చేయడం ప్రభుత్వ విధి. ఇప్పటికే ఆయా అంశాలను అమలు చేయడంలో కేంద్ర ప్రభుత్వం తన చిత్తశుద్ధిని చూపించలేక పోతున్నది. ఇప్పుడు ప్రధానమంత్రి వ్యవహారం చూస్తే, ఆయన నుండి మరింత సహాయం ఆశించడం వ్యర్థమే అని అర్థం అవుతున్నది.

కేంద్రమంత్రి యం.వెంకయ్య నాయుడు గాని, ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు గాని కనీసం 'ప్రత్యేక సహాయం' ప్రస్తావననే తీసుకు రాకపోవడం గమనిస్తే వీరిద్దరూ రాష్ట్ర ప్రయోజనాలను కాపాడగలరని ఆశించడం ఆశాభంగమే కాగలదని అర్థం అవుతున్నది. కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలను కాపాడటం పట్ల వీరు చూపిస్తున్న శ్రద్ధ, ప్రజల ప్రయోజ నాల పట్ల ఏమాత్రం చూపించక పోవడం విచారం కలిగిస్తున్నది.

మరోవంక ఈ కార్యక్రమాన్ని బహిష్క రించిన ప్రతిపక్షాలు సహితం తాము ఉన్నా మని వార్తలలో కనిపించే ప్రయత్నం చేయడం మినహా, ప్రజలకు నాయకత్వం వహించి, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై వత్తిడి తీసుకు రాగల సత్తా వారెవ్వరిలోనూ కనిపించడం లేదు. ప్రధానంగా ప్రముఖ ప్రతిపక్ష నాయ కులు అందరూ వ్యక్తిగతంగా కృష్ణ-గుంటూరు జిల్లాల మధ్య రాజధాని నగరం రావడం పట్ల తీవ్ర వ్యతిరేకతతో ఉండడంతో, వారిని ప్రజలు విశ్వాసంలోకి తీసుకోలేక పోతున్నారు.

తాము రాజధాని నగరానికి వ్యతిరేకం కాదుగాని... అంటూ వారు చేస్తున్న డొంక తిరుగుడు వాదనలను ప్రజలు నమ్మడం లేదు. గుంటూరులో ఆమరణ నిరాహార దీక్ష చేపట్టిన వై ఎస్ ఆర్ కాంగ్రెస్ పార్టీ అధినేత వై యస్ జగన్మోహన్ రెడ్డిని వారం రోజుల తరువాత పోలీసులు అరెస్టు చేయగానే శిబిరం ఎత్తి

వేయడంతో వారీ విషయంలో చిత్తశుద్ధితో ఉన్నారా అనే అనుమానాలకు దారి తీస్తున్నది. జగన్మోహన్‌రెడ్డిని అరెస్టు చేయగానే మరో సీనియర్ నాయకుడు దీక్షను కొనసాగిస్తే వారి పట్ల ప్రజలలో కొంత నమ్మకం కలిగే అవకాశం ఉండేది.

ఇక వామపక్షాలు, కాంగ్రెస్ పార్టీల నాయకుల వాదనలను ప్రజలు ఎవ్వరూ అంత తీవ్రంగా పరిగణించడం లేదు. కొన్ని సందర్భాలలో వారు వాడుతున్న దూషణ పూరిత పదజాలం వారి ఉద్దేశ్యాల పట్ల అపనమ్మకాన్ని కలుగచేస్తున్నది. రాజధాని నగరం విషయంలో తీవ్ర ప్రభావం చూపుతున్న కార్పొరేట్ శక్తులను బయటపెట్టి, ప్రజలకు వాస్తవాలు తెలిపే ప్రయత్నాలను ప్రతిపక్షాలు ఏవీ చేయక పోవడం గమనార్హం. రాజకీయంగా తమ ఉనికిని కాపాడుకొనే ప్రయత్నమే గాని, ప్రజల పక్షాన నిలబడే తెగింపును వారు ప్రదర్శించలేక పోతున్నారన్నది స్పష్టం అవుతున్నది.

ప్రభుత్వంలో భాగస్వామిగా ఉన్న భా.జ.పా. పరిస్థితి హృదయ విదారకం అవుతున్నది. కొందరు నాయకులు చంద్రబాబు నాయుడిని ఇంద్రుడు, చంద్రుడు అని పొగడ్తలతో ముంచెత్తుతుంటే మరి కొందరు ప్రభుత్వ వ్యవహారాల పట్ల అసహనం వ్యక్తం చేస్తున్నా, వారిది అరణ్య రోదనగానే మిగులుతున్నది. వారు స్పష్టమైన వైఖరిని అవలంబించలేక పోతున్నారు. దానితో రాజకీయంగా తెర మరుగు కావడం మినహా వారికి భవిష్యత్తు అగమ్యగోచరంగా కనిపిస్తున్నది.

రచయిత - పాత్రికేయుడు,
హైదరాబాద్
ఫోన్ : 98495 69050

# మధురాంతకం రాజారాం 'ఉత్తమ కథలు' పుస్తకం విడుదల




*పై చిత్రంలో ఎడమనుండి డా. పత్తిపాక మోహన్ (కార్యక్రమాధికారి, నే.బు.ట్ర), ఎం. నారాయణ శర్మ, ఆచార్య రాచపాలెం చంద్రశేఖర రెడ్డి, ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి, సింగమనేని నారాయణ, ఆచార్య మధురాంతకం నరేంద్ర).*

నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా (ఎన్.బి.టి) ఉత్తమ గ్రంథాల ప్రచురణకోసం, పఠనాసక్తిని పెంపొందించడంకోసం 1957లో భారత ప్రభుత్వం కేంద్ర మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖ ఆధీనంలో స్థాపించబడిన సంస్థ. దేశవ్యాప్తంగా నిర్వహిస్తున్న పుస్తక వికాస కార్యక్రమాల్లో భాగంగా 4 అక్టోబరు, 2015 ఆదివారం రోజున ఉదయం 10.30 గంటలకు కడపలోని సి.పి. బ్రౌన్ భాషా పరిశోధనాకేంద్రం, ఎర్రముక్క పల్లెలో నేషనల్ బుక్ ట్రస్టు, ఇండియా పుస్తకావిష్కరణ సభను నిర్వహించింది.

ఈ సభలో సుప్రసిద్ధ కథా రచయిత, రాయలసీమ జనజీవితాల్ని చిత్రించిన కథకులు 'మధురాంతకం రాజారం ఉత్తమ కథలు' పుస్తకాన్ని ఆవిష్కరించారు. శ్రీ సింగమనేని నారాయణ సంపాదకత్వంలో ఈ సంపుటిని నేషనల్ బుక్ ట్రస్ట్ ఇటీవల ఆదాన్-ప్రదాన్ శీర్షికన ప్రచురించింది.

ఆచార్య రాచపాలెం చంద్రశేఖర రెడ్డి అధ్యక్షతన జరిగే సభలో ప్రసిద్ధ కథకులు, ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొని ఆవిష్కరించగా, విమర్శకులు ఎం. నారాయణశర్మ కథలను సమీక్షించారు. సంపాదకులు సింగమనేని నారాయణ, ఆచార్య మధురాంతకం నరేంద్ర గౌరవ అతిథులుగా పాల్గొన్నారు. డా. పత్తిపాక మోహన్ కార్యక్రమాన్ని నిర్వహించారు.

## నానీలు

1. నిశ్శబ్దం
వెయ్యి గొంతుకల్తో అరుస్తోంది
శబ్దం
ఎక్కడో మూలకు నక్కింది
2. జీవితం
నడిబొడ్డున నిలబడి
బతుకు పాత్ర చాచాను
అంతా దుఃఖమే!
3. విత్తనం కూడా
దుఃఖిస్తోంది
చిత్తయిపోయిన
రైతును చూసి
4. ఎన్ని అప్పు పత్రాల్ని
మింగిందో
ఏపుగా పెరిగింది
పత్రహరితం
5. ప్రేమ కావ్యానికి
పీఠిక రాస్తున్నాను
కొన్ని నీళ్లు
మరికొన్ని నిప్పులు

**- వెల్లంకి శ్రీధర్**
కర్నూలు
ఫోన్: 98669 77741

- డా॥ గారపాటి ఉమామహేశ్వరరావు
-డా॥ అద్దంకి శ్రీనివాస్



# తెలుగు రాష్ట్రాలలో భాషావిధానం-3

(అక్టోబరు సంచిక తరువాయి)

**5.2 పాలనా రంగంలో భాషా విధానం**

ప్రజాస్వామ్య మనుగడనూ పరిరక్షణనూ పటిష్ట పరిచేవిధంగా భాషావిధానం ఉండాలి (భాషాదృక్పథంలోని ప్రథమసోపానంలో చెప్పుకున్న విధంగా). సామాన్యప్రజలకు అందుబాటులో ఉండేవిధంగా వారి నిత్యజీవితంలోని అవసరాలను తీర్చేవిధంగా ఉండాలి.

**నియమాలు:**

1. ప్రజల భాషలో పరిపాలన ప్రజల కనీస హక్కు.
2. గ్రామస్థాయి నుంచి సచివాలయ స్థాయి వరకు అన్ని పాలనా విభాగాలలో తెలుగు వాడకం విధిగా జరగాలి.
3. సమస్త ప్రజా సంబంధాలలో తెలుగు అనుసంధాన భాషగా ఉండాలి. ప్రజలకూ ప్రభుత్వానికీ సంబంధించి వ్యవహారమంతా తెలుగులోనే నడవాలి.
4. తెలుగు రాష్ట్రాల మధ్య తెలుగులోనే ఉత్తర ప్రత్యుత్తరాలు నడపాలి.
5. చట్టాలు అన్నీ తెలుగులోనే తయారు కావాలి.

**ప్రాతిపదిక:**

భారత రాజ్యాంగం 345-350 అధికరణాలలో దేశంలోనూ రాష్ట్రాలలోనూ అనుసరించదగిన భాషావిధానంపై కొన్ని మౌలికసూచనలు చేసింది. రాష్ట్రప్రభుత్వం చేతా పౌరులందరిచేతా తమ సొంత ఆధికారిక భాషా విధానవ్యాప్తిని అమలు చేయడానికి రాష్ట్రానికి ఇది ఒక అవకాశం కల్పిస్తోంది. దీనివల్ల పాలన వ్యవహారాలలో అధికార భాషావిధానాన్ని కచ్చితంగా అమలుచేయడానికి రాష్ట్రానికి ఇదో అవకాశం కల్పిస్తోంది.

### 5.2.1. దేశంలో ...

భారతదేశంలో వివిధ ప్రాంతాల ప్రజలు అనేక భాషలు మాట్లాడతారు. వీటిలో కనీసం 800 భాషలు, 2000 వరకూ మాండలికాలు ఉన్నాయి. కేంద్ర ప్రభుత్వ పాలనావ్యవహారాలకు హిందీ లేక ఆంగ్ల భాషలను వాడవచ్చని భారత రాజ్యాంగం నిర్దేశించింది. రాష్ట్రాలు తమతమ అధికార భాషలను వాడుతూ కేంద్ర ప్రభుత్వంతో సంపర్కించేందుకు హిందీ లేక ఆంగ్లం వాడవచ్చు. హిందీ, ఆంగ్లాలతో కలిపి భారత్ లో 24 అధికార భాషలు ఉన్నాయి. అధికార భాషా కమిషను వద్ద ఈ భాషలకు ప్రాతినిధ్యం ఉంటుంది. కేంద్ర ప్రభుత్వం నిర్వహించే పరీక్షల్లో అభ్యర్థులు పై భాషల్లో దేనిలోనైనా సమాధానాలు రాయవచ్చు.

భారత రాజ్యాంగం లోని 343 వ అధికరణం దేవనాగరి లిపిలోని హిందీని అధికార భాషగా గుర్తించింది. 1950 లో రాజ్యాంగంలో పొందుపరిచినట్లుగా 1965 లో యూనియన్ అధికార భాష హోదా ఆంగ్లం నుంచి హిందీకి మారింది. హిందీని పూర్తి స్థాయిలో అమలుపరచాలనేది ప్రభుత్వ ఉద్దేశ్యం. అయితే, హిందీయేతర దక్షిణాది రాష్ట్రాలు దీన్ని వ్యతిరేకించడంతో జంట అధికార భాషల పద్ధతి ఇంకా కొనసాగుతూ వస్తోంది. శీఘ్ర పారిశ్రామికీకరణ, ఆర్థిక వ్యవస్థపై బహుళజాతి సంస్థల ప్రభావం మొదలైన కారణాలవల్ల ప్రభుత్వంలోనూ, బయటా కూడా దైనందిన కార్యకలాపాల్లో ఆంగ్ల ప్రాధాన్యత పెరుగుతూ వచ్చింది. దాన్ని తొలగించాలన్న ప్రతిపాదనలు అటకెక్కక తప్పలేదు.

కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాలతో చేసే భాషా వ్యవహారం ఈ కింది విధంగా ఉంటుంది:

1. హిందీ: హిందీయేతర రాష్ట్రాలతో వ్యవహరించేటపుడు హిందీ భాషను వాడుతుంది. అరుణాచల్ ప్రదేశ్, అండమాన్ నికోబార్ దీవులు, బీహార్, చండీగడ్, చత్తీస్ గడ్, ఢిల్లీ, హర్యానా, హిమాచల్ ప్రదేశ్, జార్ఖండ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, ఉత్తరాంచల్, రాష్ట్రాల్లో కూడా హిందీయే అధికార భాష.
2. ఆంగ్లం: ఇతర రాష్ట్రాలతో వ్యవహరించేటపుడు కేంద్రం ఆంగ్లాన్ని వాడుతుంది. లోక్‌సభ, రాజ్యసభలు రెండింటిలోనూ ఆంగ్లమూ హిందీ రెండూ వాడుకోవచ్చు. ఈ రెండు భాషలలోనూ వ్యక్తం చేయలేని పక్షంలో మాతృభాషకు అనుమతి ఉంది (రాజ్యాంగ ప్రకరణం 20). హిందీ భాషను వ్యాప్తి చేయడం, ఆంగ్ల వినియోగాన్ని తగ్గించడం (రాజ్యాంగ ప్రకరణం 344) స్థూల ఉద్దేశ్యం. (ఈ మధ్యనే భారతీయ సార్వజనీన సేవా మండలిలో హిందీ, ఆంగ్లేతర భాషల మాధ్యమాలకు సంబంధించిన పరీక్షలను కేంద్రం తీసివేయడానికి సిద్ధపడింది. అందుకు వ్యతిరేకంగా హిందీయేతర భాషలవారు ఉద్యమించడంతో కేంద్రం విరమించుకుంది).

### 5.2.2 రాష్ట్రంలో ...

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, అధికార భాష (తెలుగు) ఆధికారిక పత్రాల రచనలపై శ్వేతపత్రం విడుదల చేసింది(1965). ఈ శ్వేతపత్రం పరిపాలనావసరాల నిమిత్తం ఆయా కాలాలలో తెలుగు భాష ఉపయోగాన్ని గురించిన చరిత్రను కూడా పట్టిక రూపంలో ఇచ్చింది. సుమారు వెయ్యి సంవత్సరాలు అంటే తూర్పు చాళుక్యుల పరిపాలన ప్రారంభమైన క్రీ.శ. 650 నుండి విజయనగర సామ్రాజ్యం అంతమైన 17 వ శతాబ్దం వరకు తెలుగు ఆధికారిక భాషగానే ఉంది అని చెప్పవచ్చు. పరిపాలన అవసరాల నిమిత్తమై ఆయా కాలాల్లో తెలుగు భాష ఉపయోగాన్ని గురించిన చరిత్రను ఈ శ్వేతపత్రం సంగ్రహంగా తెలియజేస్తుంది. దీనిని 1968లో ప్రచురించారు.

భారతదేశ భాషల జాబితా రాజ్యాంగంలోని ఎనిమిదవ షెడ్యూలులో చేర్చబడింది (చూ. 345 నుంచి 348 ప్రకరణాలు, అనుబంధం 1). రాష్ట్రప్రభుత్వానికి చెందిన అధికార కార్యకలాపాలకు ఈ భాషలలో వేటినైనా స్వీకరించవచ్చు. అందువల్ల వివిధ స్థాయిలలో ప్రభుత్వ పరిపాలన తెలుగులో సాగించడానికి ఆంధ్రప్రదేశ్ విధాన సభ 1955 సెప్టెంబర్ 29 న ఒక తీర్మానాన్ని ఆమోదించింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తరువాత తెలుగును అధికార భాషగా స్వీకరించాలి అనే అభ్యర్థన పెరిగింది. అందువల్ల ఉత్తర ప్రత్యుత్తరాలను తెలుగులో సాగించే విషయంలో ఎదుర్కొనే సమస్యలను అధ్యయనం చేయడానికి 1959లో ప్రభుత్వం ఒక ప్రత్యేక అధికారిని నియమించింది. మొదట, తాలూకా దాని కన్నా దిగువ స్థాయిలో తెలుగును ప్రవేశపెట్టాలనీ, తెలుగును పరిపాలన భాషగా ప్రవేశపెట్టడంలో తోడ్పడే యంత్ర పరికరాలనూ, పారిభాషిక పదావళినీ సమకూర్చుకోవాలనీ ఆ అధికారి సూచించారు. ప్రజలతో నిత్య సంబంధం ఉండే 27 శాఖలలో తాలూకా దానికింది స్థాయిలలో తెలుగును ఉత్తర ప్రత్యుత్తరాలకు వినియోగించాలనీ ప్రభుత్వం 1960లో ఉత్తర్వులు ఇచ్చింది. దానిని మరో 4 శాఖలకు విస్తరిస్తూ మరుసటి సంవత్సరం 1961లో మరో ఉత్తర్వు జారీచేసింది. అధికార కార్యకలాపాలలో సాధరణంగా వాడే ముసాయిదాలు వాటి తెలుగు పాఠాలుగల పుస్తకాలు 1962లో ప్రచురించి ఆ శాఖలన్నింటికీ అందజేశారు. ప్రభుత్వ ఉద్యోగుల్లో తెలుగు రాని ఉద్యోగులు ఉండటంతో 1960 నుంచే వారికి శిక్షణ ఏర్పాటు చేశారు. చివరకు ఆంధ్రప్రదేశ్ అధికార భాషాచట్టం (1966) ఈ రాష్ట్రానికి తెలుగును అధికార భాషగా ప్రకటించింది.

రాజ్యాంగంలో హిందీ ఆంగ్లం రెండింటికీ ప్రాధాన్యం ఉంది. పార్లమెంటరీ వ్యవహారాలు, న్యాయవ్యవస్థ, కేంద్రప్రభుత్వ సంస్థల మధ్య కార్యకలాపాలు, ఆధికారిక కార్యకలాపాలు ఆంగ్లంలోనూ, జాతీయ అధికార భాష అయిన హిందీలోనూ జరుగుతున్నాయి. ప్రభుత్వ ఉత్తర్వులు, మెమొరాండాలు, లోక సభ, రాజ్యసభ వ్యవహారాలు, ఎక్కువగా ఆంగ్లంలోనే జరుగుతుంటాయి. ప్రభుత్వ, ప్రభుత్వేతర లేఖలు, ప్రకటనలు, సవరణలు ఆంగ్లంలోనూ అలాగే హిందీ భాషలోనూ జరుగుతుంటాయి. తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర, పశ్చిమబెంగాలు లాంటి రాష్ట్రాలు ప్రాంతీయ భాషలకు అధిక ప్రాధ్యాన్యం ఇచ్చాయి. ఆంధ్రప్రదేశ్ లో ప్రభుత్వ, ప్రభుత్వేతర ప్రకటనలు, ఉత్తర్వులు మొదలైన కార్యకలాపాలన్నీ ఆంగ్లంలోనే జరుగుతున్నాయి. అన్ని పాలనా వ్యవహారాలలోనూ తెలుగును తప్పనిసరిగా వాడాలనే నియమం ఉన్నప్పటికీ తెలుగు వాడకం అంతంత మాత్రమే. ప్రభుత్వంలో ఉన్న వివిధ రంగాలకు సంబంధించిన ఆంగ్లపదాలకు సరైన తెలుగు పదాలు తెలియక పోవటం అనేది ఎప్పటికీ ఒక కారణం కాదు. ప్రభుత్వ నేతలూ అధికారుల అలసత్వమే దీనికి ప్రాథమిక కారణం. కొన్ని కోట్లమంది ప్రజలు మనపై ఉంచిన నమ్మకాన్ని ఒమ్ముచేసినట్లే.

ఆంధ్రప్రదేశ్ 1951లో, ఒడిశా 1954లో, తమిళనాడు 1956లో, అస్సాంలో 1960, గుజరాత్ 1961లో, కర్ణాటక 1962 లో, మహారాష్ట్ర 1965లో అధికార భాషా చట్టాలు చేశాయి. ఆంధ్రప్రదేశ్ 1966లో అధికార భాషాచట్టం చేసింది. అందులోని ఏడవ విభాగంలో రాష్ట్ర అధికార భాష తెలుగు అని స్పష్టంగా పేర్కొంది. అందులోనే ఇతర భాషల వాడుక గురించి పేర్కొంది.

1988 అక్టోబర్ 2 న ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం అధికార భాషగా తెలుగు వాడకం పై ఒక ఉత్తర్వు జారీ చేసింది. ఆ ఉత్తర్వు ఇది.

1988 నవంబరు 1 నుండి రాష్ట్ర పరిపాలనలో అన్ని స్థాయిలలోనూ ప్రభుత్వ ఉత్తర ప్రత్యుత్తరాలు, ప్రభుత్వ ఉత్తర్వులు తెలుగులోనే ఉండాలి, వాటికి ఇంగ్లీషు వాడకూడదు. ఇంగ్లీషు భారత ప్రభుత్వం లేక ఇతర ప్రభుత్వాలతో జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలకు మాత్రమే పరిమితం.

ఏ తెలుగు వాడాలి? ఏ మాండలికం వాడాలి? అనే ప్రశ్నలకు సమాధానం, అధికారికి వచ్చిన నచ్చిన తెలుగు వాడాలి. ఈ ఆధునిక సాంకేతిక సమాజంలో ఏ తెలుగు వాడాలా అనే ప్రశ్న అసందర్భం. అనవసరం. సంగణక ఉపకరణాల ద్వారా ఒక మాండలికంలో ఉన్న తెలుగును మరో మాండలికంలోనికి కోరినవిధంగా మార్చుకోవచ్చు. అలా మార్చుకోవడం మాండలిక పరివర్తనాల వల్ల సాధ్యం.

**సూచనలు :**

ప్రభుత్వ శాఖలలో తెలుగు వాడకానికి ఆరు సూత్రాలు, అవి :

1. తెలుగు వాడకమే ప్రజా స్వామ్య ఉనికికి గీటురాయి.
2. ఏ తెలుగు రాయాలి, ఎలాంటి తెలుగు రాయాలి అనే సందిగ్ధతకు తావులేదు. సామాన్య ప్రజలకు అర్థం కావడమే పరిపాలన భాష పరమ ప్రయోజనం.
3. ఒకరి తెలుగును మరొకరు గౌరవించాలి. రాతకోతలలో సైతం మాండలికం, గ్రామీణ తెలుగు భాషా శైలి తళుకులీనవచ్చు. శైలీభేదాలూ మాండలికమిశ్రమాలూ వాడవచ్చు.
4. తెలుగుపదం తట్టనప్పుడు ఆంగ్ల పదాలను తెలుగు లిపిలో రాయాలి. ఆంగ్లానికి సరైన తెలుగు మాట లభ్యం కానప్పుడుగానీ దానికి సరైన తెలుగు మాట కల్పించినప్పుడుగానీ ఆ ఆంగ్లం మాటను కుండలీకరణాలలో చూపించాలి.
5. ప్రభుత్వ విభాగాలన్నింటా తెలుగులో పరిపాలనా భాషా వ్యాసంగానికి సంబంధించి ఉపకరణాల వాడకాన్ని పెంచాలి.

# 5.3 సమాచార ప్రసార రంగాలు

ఆధునికయుగంలో అత్యంత కీలకమైనదీ ప్రభావశీలమైనదీ సమాచార ప్రసార రంగం. ఇది ప్రజలకూ పాలకులకూ మధ్య వారధి లాంటిది. ఈ రంగంలో భాషావిధానం భాషావికాసానికి ఇతోధిక సహకారాన్ని అందిస్తుంది.

**నియమాలు:**

1. ప్రసార మాధ్యమాలలో ప్రజల భాష ఉండాలి.
2. అవి అన్ని ప్రసారమాధ్యమాలవారికీ అందుబాటులో ఉండాలి.
3. ప్రభుత్వ, ప్రైవేటు రంగాలలోని ప్రసారమాధ్యమాలు విధిగా తెలుగు/ ప్రజల భాషే వాడాలి.
4. ప్రైవేటురంగాల ప్రసారమాధ్యమాలు ప్రభుత్వనిధులనుగానీ, ప్రభుత్వప్రకటనలనుగానీ పొందాలంటే ప్రజలభాషనే వాడాలన్న నియమం ఉండాలి.

5. యూనికోడ్ వినియోగించేవారికి ప్రభుత్వనిధులను, ప్రభుత్వ ప్రకటనలను పొందడానికి అర్హులుగా పరిగణించాలి.

**ప్రాతిపదిక :**

తొలినాళ్ళలో పత్రికలు, రేడియో, చలనచిత్రాలు, టీవి, ప్రసార మాధ్యమాలుగా ప్రముఖ పాత్ర వహించాయి. ఆధునికంగా పెరిగిన సాంకేతికాభివృద్ధిలో భాగంగా సంగణకాలు, ఈమెయిళ్ళు, అంతర్జాల సేవలు, పొట్టిసందేశాలు మొదలైన వాటివల్ల ప్రసారమాధ్యమాల ప్రాధాన్యం పెరిగింది. అందువల్ల సాంకేతిక విజ్ఞానమే లక్ష్యంగా దూసుకు పోతున్న సమాజంలో సమాచార సృష్టితో పాటు సమాచార ప్రసార వినిమయాలకు విశేష ప్రాధాన్యం ఉంది. పూర్వం రేడియో, తంతి తరువాత టీవీ, ఫోను, ఇప్పుడు సెల్‌ఫోను, అంతర్జాలం వచ్చాయి. కంప్యూటరుతోపాటు అంతర్జాల విస్తృతి పెరగడం వల్ల సాంకేతిక, విద్యారంగాలతోపాటు జీవ, ఖగోళ, భౌతిక, నృశాస్త్ర, సామాజిక, తత్వశాస్త్రాలు, సాహిత్యం మొదలైన అన్ని రంగాల్లో మౌలికమైన మార్పులు వచ్చాయి.

సాధారణంగా కంప్యూటరు, దాన్ని ఆధారంగా చేసుకున్న 'అంతర్జాలం'–జ్ఞాన వినిమయ వ్యాప్తికీ తద్వారా జ్ఞాన సృజనకూ వీలు కలిగిస్తాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలు అభివృద్ధి చెందిన దేశాలను చేరుకోవడానికి సమాచార సాంకేతికత ఓ సాధనం. ఇది జ్ఞానాధిక్యం లోనే కాదు, సాంకేతిక వైవిధ్యంలోనూ ఎన్నడూ లేనంత గుర్తింపు పొందింది. దీనిని వివిధ ప్రాయోజక సేవలకి సంబంధించిన ఏ అంశానికైనా అనువర్తింప చేయవచ్చు. అంతర్జాలానికి అనుసంధించిన కంప్యూటర్లు ఎటువంటి జ్ఞానాన్నయినా వాడుకకు వీలుగా మార్చడంలో కీలకపాత్ర పోషిస్తున్నాయి. కంప్యూటర్లూ అంతర్జాలమూ ప్రజల అవసరాలను తీర్చేదిశలో దిశానిర్దేశం చేస్తున్నాయి. కంప్యూటరీకరణలో భారతీయ భాషలు ప్రవేశించాయి. దానితో జాతీయ బహుళ భాషల, బహుళ మాధ్యమాల కంప్యూటరీకరణ ఆధునిక అవసరంగా మారి పోయింది. శాస్త్ర సాంకేతిక విద్య, వాణిజ్యాది రంగాలలో కలిగిన మార్పులు భాషకు దిశానిర్దేశం చేస్తున్నాయి. సమాచార విప్లవానికి వాహికలుగా ప్రసారమాధ్యమాలు నేటి తెలుగుపై ఎక్కువ ప్రభావాన్ని చూపుతున్నాయి. అలాగే శాస్త్ర సాంకేతిక రంగాల అభివృద్ధి, విదేశీ విద్య, సంస్కృతి, జీవనవిధానం, వాణిజ్యం, మొదలైన రంగాలలో ప్రసారమాధ్యమాలు తెలుగుభాష మీద అధిక ప్రభావం చూపు తున్నాయి.

### 5.3.1 దేశంలో ......

భారతదేశంలో తొలినాళ్ళ నుంచీ సమాచార ప్రసార రంగాలలో భాషాపరంగా దేశభాషల విషయంలో చెప్పుకోదగ్గ ప్రాధాన్యం కనిపించదు. సమాచార ప్రసార రంగాలలో ఆధునికంగా పెద్ద విప్లవమే వచ్చింది. అయితే ఇది భారతదేశంలో గత 63 ఏళ్ల కాలంలో సాధించిన ప్రగతి కంటే ఇటీవలి 15 ఏళ్ల కాలంలో సాధించిన పురోగతి ఎక్కువ. శాస్త్ర సాంకేతిక విద్య, వాణిజ్యాది రంగాలలో కలిగిన మార్పులు భాషపై ప్రభావం చూపుతున్నాయి. సమాచారవిప్లవ వాహికలయిన ప్రసార మాధ్యమాలు ప్రాంతీయభాషలపై విపరీతమైన ప్రభావాన్ని చూపు తున్నాయి. దీనివల్ల ప్రాంతీయభాషలలోని ప్రత్యేక లక్షణాలు క్రమంగా తగ్గిపోతాయి. అందుకే ప్రసారమాధ్యమాలు మాండలిక పదాలను వ్యాప్తిలోకి తేవాలి. ఆకృషి పత్రికలలో జరగలేదు. నేడు కేవలం రాజ కీయవార్తలే కాక శాస్త్ర సాంకేతిక రంగాల విషయాలు కూడా పత్రికలలో వస్తున్నాయి. కాబట్టి ఇలాంటి వార్తలు, ప్రపంచవార్తలు రాసేటప్పుడు సమానార్థకపదాలను సృష్టించుకోవలసిన అవసరం ఎంతో ఉంది. ఆ కృషీ పెద్దగా జరగలేదు. ఒక ఉదాహరణ చూడండి. సోవియట్ యూనియన్లో గోర్బచెవ్ సంస్కరణలు చేసినప్పుడు ఆ వార్తలు మన పత్రికలలోనూ వచ్చాయి. అవి 1. గ్లాస్ నోస్త్, 2. పెరిస్త్రోయికా. ఈ రెండుమాటలూ రష్యన్ పదాలు. వీటిని మనపత్రికలు యథాతథంగా వాడాయి. అలా కాకుండా 1. గోప్యరాహిత్యం లేదా దాపులేమి 2. పునర్వ్యవస్థీకరణ అని కొత్తపదాలను కల్పించి ఉంటే ప్రాంతీయ సాధారణ పాఠకులకు కూడా అర్థమయ్యేవి.

ప్రసారమాధ్యమాలలో అవసరం లేకున్నా ఆంగ్లపదాల వాడకం పెరిగింది. ఆంగ్లభాషా ప్రాచుర్యం అత్యంత ప్రభావం చూపిన తొలి నాళ్ళలో సమానార్థక పదనిర్మాణానికి ప్రాంతీయభాషలలోని పత్రికా రచయితలు కొన్ని విధానాలను రూపొందించారు. కాని అది ఆచరణలో మృగ్యం. మదరాసు ఆకాశవాణిలో ప్రతిరోజూ కొత్త పారిభాషిక పదాలను గురించిన ఒక కార్యక్రమం జరిగేది. కిందటిరోజు ఆంగ్లపత్రికలో వచ్చిన కొత్త పారిభాషిక పదాలకు తమిళంలో సమానార్థక పదాలను సృష్టించి ప్రసారం చేసేవారు. హిందీలో భా.జ.పా, మా.క.పా. మొదలైన హిందీపొడి అక్షరాలు వాడేవారు. తెలుగులో ఐరాస, ఐకాస అని కొన్నాళ్ళు పత్రికలు వాడాయి. హిందీ, తమిళం, కన్నడం, బెంగాలీ మొదలైన భాషలలోని పత్రికలు ఆంగ్లపదాలు చాలా తక్కువ వాడు తున్నాయి.

స్వాతంత్ర్యానికి పూర్వం జాతీయస్థాయిలో వార్తాపత్రికలు ఆంగ్లభాషలోనే ఎక్కువ. ప్రాంతీయభాషలపట్ల ఆదరణ జాతీయస్థాయి ప్రసారమాధ్యమాలలో ముఖ్యంగా పత్రికలలో కనిపించదు. అయితే జాతీయోద్యమంకోసం ప్రజలను చైతన్య పరచవలసిన అవసరంపై దృష్టి పెట్టిన కారణంగా అన్ని ప్రాంతీయ భాషలలోనూ వార్తాపత్రికలు ప్రారంభమయ్యాయి. వాటిలో భాషావిధానంపై ఒక సార్వజనీనమైన దృక్పథం గానీ ఆచరణ గానీ లేదు. సామాన్యులకు అవి అందుబాటు లోనికి రాలేదు. దానికి కారణం ఆయా పత్రికలు తొలినాళ్ళలో గ్రాంథికభాషను వాడడమే. అయితే స్త్రీలకోసం పిల్లలకోసం ప్రత్యేక పత్రికలు రావడం ఆనందించదగ్గ విషయం. ప్రస్తుతం జాతీయస్థాయి అత్యున్నత ప్రమాణాలు కల పత్రికలు అన్ని దేశీయ భాషలలోలనూ వస్తున్నాయి గానీ వాటిలో భాషపై శ్రద్ధ పెద్దగా కనిపించదు. ఆంగ్ల పదప్రయోగాలు వాటిలో అధికంగా ఉంటున్నాయి.

1947నాటికి భారతదేశంలో టెలిఫోన్ అనేది అందరికీ అందు బాటులో లేని పనిముట్టు. లేదు. ఇప్పుడు టెలిఫోన్, పేజర్ల దశ దాటి పోయింది. చరవాణుల విప్లవం దేశవ్యాప్తంగా విస్తరించింది. ప్రస్తుతం భారతదేశంలో 52 కోట్లకు పైగా ప్రజలు చరవాణులను వాడుతున్నారని ఒక అంచనా. ఇంకా 50 కోట్లమందికి కావాల్సి ఉంది. వీటిలో మాతృభాషా వినియోగం కావలసినంత స్థాయిలో ఇప్పటికీ లేదు.

టెలివిజన్లు కూడా నేడు అతిసామాన్యుడికి సైతం అందుబాటులోకి వచ్చాయి. 1995 సంవత్సరం వరకు కేవలం దూరదర్శన్ సంబంధిత

ప్రభుత్వ ప్రసార సాధనాలు మాత్రమే సమాచార సాధనాలు. ఇప్పుడు 24 గంటల వార్తా ప్రసారాలు, స్టింగ్ ఆపరేషన్లు, లైవ్ కవరేజీలు గల ప్రయివేటు ఛానళ్ళు రంగప్రవేశం చేశాయి. వీటిలో కచ్చితమైన భాషావిధానంగానీ చిత్తశుద్ధితో కూడిన ఆచరణగానీ కనిపించవు. ఎక్కువగా ఆంగ్లభాషను వినియోగించడమే ఆధునికత అనే చెడు సంకేతాన్ని ఇవి ప్రజలకు అందించడం దురదృష్టకరం.

### 5.3.2 రాష్ట్రంలో ...

సమాచార సాంకేతిక రంగాలలో ప్రసార వినిమయ వ్యాప్తికీ భారతీయ భాషల అభివృద్ధికీ, వాటి సహజస్థానాన్ని అందించే ప్రయత్నాలు జరుగుతున్న సంధి కాలంలో మనం ఉన్నాం. కంప్యూటర్లూ అంతర్జాలం విశ్వవ్యాపిత విపంచి(www)అక్షరాస్యతని పెంచ డానికేగాక, మానవ వనరుల బహుళ ప్రయోజనాల కోసం ఉపయోగ పడుతున్నాయి. ఈ సందర్భంలో వీటిని ప్రజలందరికీ చేరువ చేయాలి. జాతీయ లక్ష్యాలను చేరుకోవడానికి తగినవీ ప్రయోజనకరమైనవీ అయిన సాంకేతిక విజ్ఞాన వీథులుగా వీటిని భావించాలి. ఇవి భాషల మధ్యనున్న సాంకేతికతకు సంబంధించిన సాంఖ్యిక వ్యత్యాసాన్ని (డిజిటల్ డివైడ్) తగ్గించడానికి ఉపయోగపడతాయి.

సమాచారం ఎక్కువమందికి చేరువకావడమే లక్ష్యంగా గల పత్రికలు, రేడియోలూ, చలనచిత్రాలు, టీవీ, మొదలైన ప్రసారమాధ్య మాలు ప్రజల వ్యవహారభాషనే వాడాలి. ప్రభుత్వ రేడియోకేంద్రాలలో దూరదర్శన కేంద్రాలలోనూ కేంద్రంనుంచి ప్రసారమయ్యే కార్యక్రమాలు హిందీ ఆంగ్ల భాషలలో ఉంటాయి. ప్రాంతీయ కార్యక్రమాలు మాత్రం ప్రాంతీయ భాషలలో ఉంటాయి. ఈ విధంగా బహుభాషా వ్యవహారా నికి వీటిలో అవకాశం ఉంటుంది. అయితే ప్రాంతీయ కార్యక్రమాల రూపకల్పనలో స్థానిక మాండలికాలకు ప్రాధాన్యం కల్పించడం ద్వారా సమాచారం ఎక్కువగా ప్రజలకు చేరువచేయవచ్చు. వీటి శ్రోతలు కూడా ఎక్కువగా గ్రామీణప్రాంతాలకు చెందినవారే. కేంద్రనుంచి ప్రసారమయ్యే కార్యక్రమాలకు అనువాదాలు అందించే వ్యవస్థ కూడా అన్ని ప్రాంతీయకేంద్రాలలో ఉంటే భాషాభివృద్ధి, ఉపాధి కల్పన పెరుగుతుంది. ప్రయివేటు సంస్థలు నడిపే ఎఫ్ ఎమ్ రేడియోలు, టీవీఛానళ్ళు దీనికి భిన్నం. ఇప్పుడు ఇవన్నీ జనబాహుళ్యాన్ని బాగా ఆకర్షిస్తున్నాయి. కాబట్టే వీటిద్వారా భాషావికాసానికి దోహదంచేసే భాషావిధానాన్ని రూపొందించుకోవాలి. భాషకోసం కృషిచేసే మాధ్యమా లకు ప్రభుత్వం ప్రత్యేక ప్రోత్సాహకాలను ప్రకటించాలి. ప్రజలభాషల లోనే కార్యక్రమాలు విధిగా రూపొందించాలనీ స్థానిక మాండలిక భాషలకు అందులో ప్రాధాన్యం కల్పించాలనీ వాటికి ప్రసారమాధ్య మాలకు అనుమతులను జారీచేసేటప్పుడు ప్రభుత్వం నిబంధనలను పెట్టాలి. అనుమతులను కొనసాగించేటప్పుడు భాషాపరంగా వాటి పనితీరును సమీక్షించాలి.

కేంద్రప్రభుత్వరంగ సంస్థలు హిందీ, ఆంగ్లం, ప్రాంతీయ భాషలను సందర్భానికి తగినవిధంగా వాడతాయి. పత్రికలయితే సాధారణంగా ఏదైనా ఒక భాషకే పరిమితమై ఉంటాయి. అయితే ప్రాంతీయ వార్తలను ఆయా ప్రాంతాలలో ఉండే స్థానిక విలేకరులే రాస్తారు. దానివల్ల పత్రికలలో కొంత మాండలికపదాల రంగప్రవేశం జరుగుతుంది. మెయిన్ ఎడిషన్లను కూడా మాండలిక భాషలవారీగా ముద్రిస్తూ వాటిలో మాండలిక పదాలకు తగిన ప్రాధాన్యం కల్పించాలి. అలాగే చలనచిత్రాలు, టీవీ కార్యక్రమాలు వార్తలను ధారావాహికా లను ప్రత్యేక కార్యక్రమాలను ప్రత్యేకంగా మాండలిక భాషలలోనే రూపొందించుకోవాలి. ప్రసార మాధ్యమా లన్నింటా భాషామారకం (%code switching%), భాషామేళనం (code mixing) కాస్త అతిగా ఉంటుంది. లేఖనంలో కంటే మౌఖికంలో ఇది ఎక్కువ. సంస్థలు ప్రాంతీయభాషలలోనూ మాండలికాలలోనూ సరైన పదాలు అందు బాటులో ఉన్నప్పుడు ఆ పదాలనే వాడేలా ప్రసారమాధ్యమాలలో భాషా విధానం ఉండాలి. ఇలా చేస్తే భాషాభివృద్ధి, పరిరక్షణ సులభమవు తుంది. ప్రాంతీయభాషా నిపుణులకూ తెలుగు మాధ్యమంలో చదువుకొన్నవారికీ ఉపాధి లభిస్తుంది.

**సూచనలు :**

1. సాధారణ ప్రజానీకానికి ఉపయోగపడేలా సమస్యలకు పరిష్కారాలు తెలుగు లోనే అందించే, చర్చావేదికలూ, సైట్లూ రావాలి.
2. ఎలక్ట్రానిక మాధ్యమం ద్వారా తెలుగులో అంతర్జాతీయ భాషలకు సమాంతరంగా సమస్త విషయాలనూ సృష్టించాలి.
3. సమాచార సాంకేతిక సేవికలు (సర్వర్లు) తెలుగు భాషలో అందు బాటులో ఉండాలి.
4. భాషా సంగణక అంతర్జాల సాంకేతికతలపై దృష్టి సారించి ఈ సాంకేతిక వసతుల్ని తక్కువ ధరలో ప్రజలభాషల్లో అందించాలి.
5. కనీసం తెలుగుపత్రికల్లో వాడుతున్న ఆంగ్లపదాలను గుర్తించి వాటికి ప్రత్యామ్నాయాల్నిసూచించేదిశగా ఈ ప్రయత్నం వుండాలి.
6. సమయానుసారంగా ప్రజలనుండి ఆంగ్లపదాలకు తగిన మాట లను సేకరిస్తే వ్యవహారానికి దగ్గరగా ఉన్న పదాలు వ్యాప్తిలోకి వచ్చే అవకాశం ఏర్పడుతుంది.
7. ప్రస్తుతం రాష్ట్రంలో తెలుగు అధికసంఖ్యాకవర్గ భాషగానూ ఉర్దూ అల్ప సంఖ్యాక వర్గ భాషగానూ ఉంది. ఈ భాషల మధ్య సాంఖ్యికనిఘంటువులు విరివిగా కావాలి. ప్రసార మాధ్యమాలకు ఇవి ఎంతగానో సహకరిస్తాయి.
8. ఇప్పటిదాకా విశ్వసంకేతఖతులలో (%Unicode fonts%) లేని తెలుగు సాహిత్యాన్ని విశ్వసంకేత ఖతులలోనికి మార్చే మార్పిడి సాధనాలు కావాలి.
9. ఆన్ లైన్ లోనూ ఆఫ్ లైన్ లోనూ విరివిగా నిఘంటువులను వాడుకునే సౌలభ్యాలు కలగాలి.
10. ఎన్ని ఎక్కువ తెలుగు నిఘంటువులు అంతర్జాలికలో చేరితే తెలుగు అంతగా బలపడుతుంది.
11. ఆధునిక అవసరాలకు ధీటుగా తెలుగు భాష తయారు కావాలి.
12. తెలుగు మాధ్యమంలో కంప్యూటర్ చదువులు కూడా రావాలి.
13. విశ్వవ్యాప్తంగా తయారవుతున్న జ్ఞాన సృష్టిని యంత్రానువాదాల తోనూ లిప్యంతరీకరణతోనూ సమాచార ప్రసార సాధనాలు తెలుగులో అందించగలగాలి.
14. ముద్రణ మాధ్యమానికి దూరమైన మాండలికాలు ప్రసార అర్హతను పొందాలి. ఆ మేరకు టీవీ మాధ్యమాలు ఆయా ప్రాంతాల ప్రేక్షకులను ఆకర్షించేలా మాండలిక భాషావ్యాప్తి చేయడానికి కృషిచేయాలి.

**తరువాయి వచ్చే సంచికలో....**

# విద్యారంగంలో శక్తిమంతమైన సామాజిక జోక్యం కోసం
# విద్యా వికాస వేదిక





**మన** విద్యారంగం ఓవైపు నుంచి చూస్తే అద్భుతంగా వుందనిపిస్తుంది. అమెరికాలో ఎక్కువమంది భారతీయ విద్యార్థులు తెలుగువారే. ఐఐటిల్లో సింహభాగం తెలుగు పిల్లలదే. సిలికాన్ వ్యాలీలో రెండో భాష తెలుగేనన్న బడాయికూడా తక్కువేం కాదు. బహుశః పిల్లల చదువుల కోసం తల్లిదండ్రులు ఎక్కువ ఖర్చు చేస్తున్న రాష్ట్రం కూడా మనదే కావచ్చు. ఏడాదికి ఒక్క పాఠశాల విద్యకే ప్రైవేటు పాఠశాలలకు రూ. 10వేల కోట్లు చెల్లిస్తున్న రాష్ట్రం మనది. సామాజిక పెట్టుబడులు కూడా విద్యారంగంలోకి వెల్లువెత్తుతున్నాయి. ఇదంతా చూచి, తీరా చూపించి ఇంతకంటె కావాల్సింది ఏముంది అని చాలామంది ప్రశ్నిస్తుంటారు.

కానీ రెండో పార్శ్వం కూడా వుంది. భారతదేశంలోనే ఎక్కువ కార్పొరేట్ పరమైన విద్య మన రాష్ట్రంలోనే వుంది. కేవలం రెండు యాజమాన్యాల పరిష్వంగంలోకి 80 శాతం ఇంటర్మీడియేట్ విద్యార్థులు చేరిపోయారు. ఈ ఏడాది ఇప్పటికే వీటిలో 30 మందికి పైగా ఆత్మహత్యలు చేసుకొన్నారు. ఈ యజమానులే ఇప్పుడు రాజ్యాన్ని శాసిస్తున్నారు.

మరోవైపు ప్రభుత్వ విద్యారంగం అన్ని స్థాయిల్లోనూ కుదేలయ్యింది. రోజూ ఏదో ఒక విమర్శ వీటి చుట్టూ నడుస్తుంటుంది. నిరుపేదల శరణాలయాలుగా ఇవి మారాయి. తీవ్రమైన అసమానతలు విద్యారంగంలోకి చొచ్చుకొచ్చాయి. ఇవి సామాజిక అసమానతల్ని స్థిరీకరిస్తున్నాయి.

ఇదంతా ఒక ఎత్తయితే అసలు అటు ప్రైవేటు సంస్థల్లోనైనా, ఇటు ప్రభుత్వ విద్యాలయాలలోనైనా చదువు పేర జరుగుతున్నదేమిటి? పాఠాల స్థానంలోకి పరీక్షలు, టీచింగు స్థానంలోకి కోచింగు జొరబడి పోయాయి. చదువుకు నిర్వచనమే మారిపోయింది. ఇక పిల్లల హక్కులూ, పిల్లల వికాసం,శాస్త్రీయ విద్య, రాజ్యాంగ విలువలు లాంటి మాటలకి చూస్తుండగానే కాలంచెల్లిపోయింది.

ఫలితంగా సమాజమెంత నష్టపోతున్నదో సగటు కుటుంబం కూడా అంతే నష్టపోతున్నది.దేశం ఎంత కోల్పోతున్నదో బాల్యంకూడా అంతే దగాపడుతున్నది.

కొంచెం కొంచెం ఇప్పుడివన్నీ చర్చకొస్తున్నాయి. ఆవేదన మొదలైంది. ఇంగ్లీషు చిలకపలుకుల నుంచి సామాజిక శాస్త్రాల కనుమరుగుదాకా మనలో చాలామందికి కడుపులో దేవినట్టు చేస్తున్నాయి.

అయితే ఇప్పుడు కావల్సింది మనపిల్లల్ని గురించి వారి చదువుల్ని గురించి విస్తృతంగా మాట్లాడుకోగల్గడం, వీలైనన్ని గొంతులు విన్పించడం. అవి వీలున్నంత ఐక్యంగా విన్పించడం. శక్తిమంతమైన సామాజిక జోక్యం, పలు రూపాల్లో జోక్యం. అది బోధనాభ్యసనాల్లో గావచ్చు. విధానాల విషయాల్లో కావచ్చు.

విద్యారంగం కేంద్రంగానూ, విద్యారంగంతో ముడిపడ్డ అంశాల చుట్టూనూ పనిచేస్తున్న వాళ్ళకు మనరాష్ట్రంలో కొదవలేదు. కొందరు విద్యావేత్తలు, బోధనాభ్యసనతత్వం కోసం జీవితాల్ని అంకితం చేసినవాళ్ళు. కొందరు పిల్లల హక్కుల పరిరక్షకులు. కొందరు సామాజికోద్యమకారులు. ఇంకొందరు మాతృభాషాభిమానులు. కొందరు సాహితీ మిత్రులు, ఆర్థిక రంగ నిపుణులు,సామాజిక శాస్త్రాభిమానులు సైతం తక్కువేమీ లేదు. వీరితోపాటు వినియోగదారులుగానైనా విద్యార్థులు, తల్లిదండ్రులు సరేసరి. ఉపాధ్యాయులూ, వారి సంఘాలూ ఉండనే వున్నారు.

స్పష్టమైన కొన్ని అంశాల ప్రాతిపదికన–ఉదాహరణకు మాతృభాషలో ప్రాథమిక విద్య, అందరికీ సమానమైన నాణ్యమైన విద్యకు ప్రభుత్వం పూచీపడ్డం, ప్రైవేటు కార్పొరేట్ విద్యా నియంత్రణ, పిల్లల సర్వతోముఖ వికాసం వంటి వాటి పట్ల రాజీ లేకుండా కలిసి పనిచెయ్యలేమా? ఎవరి వ్యక్తిత్వం వారు వుంచుకొంటూనే కలిసి గళం విన్పించలేమా?

ఈచర్చ జరిపి జరిపి ఒక కొలిక్కి వచ్చాక 'విద్యావికాసవేదిక' ఆవిర్భావ సమావేశం అక్టోబరు 2న విజయవాడ సిద్ధార్థ కళాశాల

ఆడిటోరియంలో జరిపాము. దాదాపు 700 మంది వివిధ రంగాలవారు హాజరయ్యారు. విద్యా వికాసవనం, అరవింద, అభ్యాస లాంటి విద్యాసంస్థలు చొరవచూపాయి. జనవిజ్ఞాన వేదిక, మంచి పుస్తకం, ప్రజాసాహితి, సామాజిక శాస్త్రాల అధ్యయన వేదిక లాంటి సంస్థలు, పలు ఉపాధ్యాయ సంఘాలు, విద్యారంగ మేధావులు అభిమానులు వీరిలో వున్నారు.

విద్యావేత్త మంచికంటి శివరాం, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయ పూర్వ వైస్ ఛాన్సలర్ ప్రొ॥ వియన్నారావు,సాహితీ విమర్శకులు కొత్తపల్లి రవిబాబు, మాజీ ఎమ్మెల్సీ కె.యస్. లక్ష్మణరావు తదితరులు పాల్గొన్నారు. విద్యావికాసవనం పరిమిగారు సమన్వయ కర్తగా వ్యవహరించారు.

రోజంతా జరిపిన చర్చల అనంతరం చివరగా వి. బాల సుబ్రహ్మణ్యం కన్వీనరుగా, పరిమి, ఆర్ శాంతి, పి. రాజగోపాల్, శ్రీహరి, జి.ప్రభుదాసు, ప్రొ॥ విజయకుమార్‌లతో ఒక తాత్కాలిక కమిటీ, ఒక సలహామండలి, ఒక విషయ నిపుణుల కమిటీ ఏర్పడ్డాయి.

అన్ని జిల్లాల్లోనూ, జిల్లా 'విద్యావికాస వేదిక'లు ఏర్పర్చే పనిలో పడ్డాం. గ్రామస్థాయిదాకా విస్తరించాలని ప్రయత్నం.

శక్తిమంతమైన సామాజిక జోక్యం కోసం వీలున్నంతమందిని ఒక తాటిమీదికి తేవాలనే లక్ష్యానికి చేయూతనివ్వగల వారికందరికీ 'విద్యావికాస వేదిక' ఆహ్వానం పలుకుతుంది.

**–వి. బాలసుబ్రహ్మణ్యం,** శాసనమండలి సభ్యులు
9490098912

## మాతృభాషలోనే ప్రాథమిక విద్య

### ఆంధ్రప్రదేశ్‌లో 87% మంది అభిప్రాయం ఇదే...

ప్రాథమిక విద్యాబోధన మాతృభాషలోనే జరగాలి. ఆంగ్ల మాధ్యమాన్ని ఆరో తరగతి నుంచి మాత్రమే ప్రవేశపెట్టాలి. ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాల్లో విద్యాశాఖ జరిపిన అభిప్రాయ సేకరణలో 87% మంది ఈమేరకు స్పష్టం చేశారు. మాతృభాషలో బోధన జరిగితేనే విద్యార్థులు సులభంగా ఆంగ్ల పదాల్ని, పాఠాల్ని అర్థం చేసుకుంటారని, చక్కగా మాట్లాడగలుగుతారని ముక్తకంఠంతో పేర్కొన్నారు. అభివృద్ధి చెందిన దేశాల్లో సైతం మాతృభాషలోనే ప్రాథమిక విద్యాబోధన జరుగుతోందని గుర్తుచేశారు. రాష్ట్రంలో కేవలం 13%మంది ఒకటో తరగతి నుంచే ఆంగ్ల మాధ్యమంలో బోధన ప్రవేశపెట్టాలని పేర్కొన్నారు.

రాష్ట్రవ్యాప్తంగా ఏటా 10% విద్యార్థులు ప్రభుత్వ పాఠశాలలకు దూరమవుతున్నారు. అన్ని వర్గాల తల్లిదండ్రులు తమ పిల్లల్ని ఆంగ్ల మాధ్యమంలోనే చదివించేందుకు ప్రాధాన్యమిస్తున్నారు. ఈ నేపథ్యంలో ఒకటో తరగతి నుంచే ఆంగ్ల మాధ్యమంలో తరగతుల నిర్వహణను ప్రవేశపెట్టే విషయమై విద్యాశాఖ అభిప్రాయ సేకరణ చేపట్టింది. 13 జిల్లాల నుంచి సేకరించిన సమాచారాన్ని రాష్ట్ర విద్య పరిశోధన శిక్షణ క్రోడీకరించి నివేదిక రూపొందించింది. ఆంగ్ల మాధ్యమం కారణంగానే ప్రైవేట్ పాఠశాలల వైపు తల్లిదండ్రులు ఆకర్షితులవుతున్నారని భావిస్తున్న తరుణంలో దీనికి భిన్నంగా స్పందన రావడం ప్రాధాన్యం సంతరించుకుంది.

**నివేదికలోని అంశాలు**

- ఒకటో తరగతి నుంచే ఆంగ్ల మాధ్యమంలో తరగతులు నిర్వహిస్తే విద్యార్థులు నష్టపోతారు. మాతృభాషలో బోధన ద్వారా ఏ ఇతర భాషలోనైనా చదవగలిగే సామర్థ్యాలు విద్యార్థులకు లభిస్తాయి.
- 1నుంచి 5వ తరగతి వరకు ఆంగ్లం పాఠాలను సమర్థంగా బోధించేందుకు వీలుగా ఉపాధ్యాయులకు ప్రణాళికాబద్ధంగా పునశ్చరణ తరగతుల్ని నిర్వహించాలి.
- ఆరో తరగతి నుంచి ఆంగ్ల మాధ్యమంలో బోధనను ఎంపిక చేసుకునే (ఆప్షన్‌గా) సౌకర్యం కల్పించాలి. 'సక్సెస్' కింద గుర్తించిన ఉన్నత పాఠశాలల్లో ఆరు నుంచి పదో తరగతి వరకు తెలుగుకు సమాంతరంగా ఆంగ్ల మాధ్యమంలోనూ బోధన జరుగుతోంది. దీనిని పూర్తిగా అందుబాటులోకి తీసుకురావాలి.
- ప్రస్తుతం అనేక ప్రభుత్వ పాఠశాలల్లో ఒకటి నుంచి ఐదో తరగతి వరకు ఒకే ఉపాధ్యాయుడితో బోధన జరుగుతోంది. విద్యార్థుల సంఖ్యను అనుసరించి కొన్నిచోట్ల మాత్రమే ఇద్దరు, ముగ్గురు చొప్పున ఉపాధ్యాయులు ఉన్నారు. ఒకే ఉపాధ్యాయుడు అన్ని తరగతుల వారికి బోధించాల్సి రావడంతో విద్యార్థులకు తగిన విధంగా ఆంగ్లంలో పాఠాల్ని చెప్పేందుకు వీలు ఏర్పడడం లేదు.
- ఇలా కాకుండా 1నుంచి 5 తరగతుల విద్యార్థులకు పాఠాల్ని చెప్పేందుకు ఐదుగురు ఉపాధ్యాయులను నియమిస్తే, ఆంగ్లంలోబోధనకు ఎటువంటి సమస్యలు ఉండవు. పిల్లల్ని ప్రభుత్వ పాఠశాలలకు పంపించేందుకు తల్లిదండ్రులు కూడా ముందుకు వస్తారు.
- ప్రైవేట్ పాఠశాలల్లో 1 నుంచి 5 వరకు ఆంగ్ల మాధ్యమంలో తరగతుల్ని నిర్వహించకుండా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలన్న డిమాండ్ కూడా పలుచోట్ల వ్యక్తమైంది. ఇలాచేస్తే ప్రభుత్వ పాఠశాలల మనుగడకు ఢోకా ఉండదని చెబుతున్నారు.

(ఈనాడు అక్టోబరు 22, 2015)

# నుడి- నానుడులలో నల్లమల

పాటలు, కథలు, పొడుపు కథలు, స్థలాల పేర్లు, పండుగలు, ఆచారాలు, మందుమాకులు- ఇలా వీటన్నిటిలోగల క్రమాన్ని, విజ్ఞానాన్ని, ప్రపంచ వ్యాప్తంగా ఉన్న అనుభవాలను గమనిస్తూ మన తరతరాల విజ్ఞానాన్ని, మన ప్రాంతం మీద హక్కులకు, మన వనరుల అభివృద్ధికి, ఉపాధికి ఆధారం చేసుకోవాలి. ఎదిగే తరంలో ఈ ఆలోచనను పెంచడం కోసం నల్లమలలో ఉన్న నుడి- నానుడులను ఇక్కడ ఇస్తున్నాము

- సంపాదకులు

నల్లమల్లడవుల తెల్లవారేపొద్దు
అంబటాలకే సీమపై అగ్గి కురిపించు
సందెపూట నందికొండ నీడల్లో కొండ వాలుల్లో
సల్లగాలికి ఒళ్ళు మరిసి నిదురించు అలసి నిదురించు
నను గన్న నా తల్లి రాయలసీమ రతనాల సీమ
తనువెల్ల తరగని గనులున్న సీమ గిరులున్న సీమ॥

**...గోరటి వెంకన్న**

"చెంచుల అహోబలపు శ్రీ నారసింహుడు" **...అన్నమాచార్య**

"సిద్ధమునివరులు ఇందలి చెంచులెల్ల" **...జక్కన**

"మాకాంక్ష లీడేర్చు- మాచెర్ల చెన్న"

**... పల్నాటి వీరభారతం, శ్రీనాథుడు**

"ఏ కులమని నను వివరమడిగితే- ఏమని చెప్పుదు లోకులకు పలుగాకులకు" **... సిద్ధయ్య**

"చిత్తస్వాతిలోన చెలరేగి పోయేవు ఎంత శౌర్యమే- **గుండ్లకమ్మ"**

ఉబగడ్డిలో ఉడుము బలిసె- కాసిగడ్డిలొ కణుజు బలిసె
అడవితీపి పగుళ్ళలో ఉంటుంది- తేనెపట్టు
వట్టి బరకల పాలు పొంగు- పుట్టకొక్కులు
కొమ్మకొమ్మకు సంగటి ముద్దలు- వెలక్కాయలు

కానుగచెట్టు పూసినప్పుడు ఉసిళ్ళకు కాళ్ళు వస్తాయి
రేలచెట్టు పూసినప్పుడు రెక్కలు వస్తాయి
ఏగిపూసినప్పుడు బండలపై ఎగురుతాయి- ఉసిళ్ళు

కోరిందలు పూసేటప్పుడు కాటు తక్కువ (దీపావళి)
ఏపె పూసేటప్పుడు ఉట్టి తట్టలే (శ్రావణం)
ఎర్రబలుసు పగిలినప్పుడు కాటు ఎక్కువ (తొలకరి)- తేనెలు

**... చెంచుల నానుడులు**

"నాగార్జునుడికి నమస్కరించి- మాశర్లయో శెన్నుని దలిసి
కారంపుడి అంకమ్మను కొలిసి- గుత్తికొండ బెలస్తానంలోను
మత్తు నిద్ర బ్రెమ్మయ్యను లేప"




"ఉప్పు గోంగూర ఊరతొక్కుతో- సప్పిడి తైదల సంకటిగాదిక
పప్పుగాక పది కూరలతోని- సాముల బువ్వా రామరాజ్జెమై!"

కట్టమీద రెండు జిట్ట రేగుల్లు
అవి అల్లుకొన్నాయి అల్లనేరేళ్లు
అల్లిబిల్లి చెట్టు అల్లినేరేళ్లు
అల్లనేరేడు కింద చల్లని చెలమ కాడ చల్లి చెలమ చల్దారగించి"

"నల్లకొండల నడుమ వుతికేటి చాకి
మాయన్న యేసిన ధట్టి పేరేమి
చింతకుంట నూలమ్మ శిరువేళ్ల తొగరు
నంద్యాల నల్లంచు లంజె పేటంచు
కందనోలు కరకంచు కంది బేడంచు"

"కోయిల్‌కుంట్లా గుట్టలెంటా
కుందేరూ వొడ్డులెంటా
గుర్రమెక్క నీవువస్తే కుంపిణీకి గుండె దిగులూ
దొరవారి నరసింహ్వా రెడ్డి
నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహ్వారెడ్డి"

అడవిలో ఆంబోతు రంకెలేసింది- గొడ్డలి
అడవిలో అక్కమ్మ ఆకుపోసింది- సాలీడు
అద్దంకి చేలో హంసలేచింది- పుట్టగొడుగు
ఆకాశాన వెన్నముద్దలు వేలాడుతున్నాయి- వెలక్కాయలు
ఆకాశాన అరవైఆరు కొడవళ్ళు వేలాడుతున్నాయి- చింతకాయలు
అరచెయ్యంత పట్నం అరవైఆరు గదులు, గదికొక
సిపాయి,సిపాయికొక తుపాకి- తేనెపట్టు

"కొలంది మీటిన పుట్టకురువ లంకాపురి- గొనకొన్న జలరాశి
గుండ్లకమ్మ"

"అహహ నీ మాయ యేమని యభినుతింతు
బొసఁగ నీ పాదమునఁ బుట్టి పుడమి ముంచె
మేలుగా నౌల మంచెఁ బాతాళగంగ
నెమలి గుండము శ్రీరంగ నిర్మలాంగ"
"రమ్యగుణసాంద్ర కంబము రామచంద్ర"
"వానకురిపించి రక్షించు మానవులను- రమ్మధవళాంగ కాకర్ల
రామలింగ"
"నందవరమందు నెలకొన్న నయకదంబ-
సరససద్గుణ నికురంబ చముడమాంబ"
"కృష్ణవేణ్ణానది కేవల పశ్చిమం- బలేశ్వరం బన నెసంగు పురము"
"శ్రీగిరిప్రాగ్దిశ శ్రీ కాలవాలమై- విలసిల్లు విరిదండ విన్నకొండ"
"గడ్డి గడ్డని ముంచి దొడ్డగా పలికేవూ
గడ్డి బేరము జెప్పు వో పిల్లా
నీ మూట బేరము జెప్పుసోకిల్ల
దండిదీ నామూట కుర్రోడా
నువు దైర్నముంటే దించు పిల్లోడా
అయ్యో వంటెద్దు నాగడ్డి మొయ్యాలే
నీకు వొక్కటే రంకేమొ యెయ్యాలే
"చెన్నారగ పూర్వము నిట- కన్నెలు వసియించు చుండ్రి దేవకన్యల
వోలెన్
అన్నారులు కలుగుటచే- అన్నా వచియింత్రు కన్నె లూరను పేరన్"
"వెలిగొండలకంటె పొడుగు- కనిగిరి కంటె వెడల్పు-
ఉదయగిరికంటె ఎత్తైన కొండలు లేవు"
"వెలిగొండ వంటి తండ్రి కంటే- ఏకులబుట్ట వంటి తల్లిమేలు"
"సంగాం కొమ్మ సక్కగా ఎత్తినట్లు"
గుట్టలచేను కురవ- గుండెల్లో గస
బండకింద బొచ్చుపురుగు- ఎలుగు
రాగునిండా తప్పెట్లు- కప్పలు
చిన్నపిల్లవానికి పుట్టెడు అంచులు- ఏదుముళ్ళు
"పులికి మల అండ- మలకు పులి అండ" -రచయిత డా॥


**పి. శివరామకృష్ణ శక్తి**
9441427977

తెలుగమ్మ ఒడిలో
బౌద్ధం - 9

- డా॥ బొర్రా గోవర్ధన్

# తెలుగు బౌద్ధులు ఎంచుకొన్న 'పెద్ద దారి'



ఒకనాడు మహాయాన బౌద్ధానికి కేంద్రంగా విలసిల్లిన నాగార్జున కొండ వద్ద బుద్ధ విగ్రహం

**బౌద్ధం** ఒక శాస్త్రీయ తాత్త్విక సిద్ధాంతం. శుద్ధ నమ్మకం కాదు. బౌద్ధం చెప్పే బుద్ధం, ధమ్మం, సంఘం ఇవే నీ నమ్మకాలు కావు నిజాలు. నిజం చెప్పాలంటే ఇవి మంచి జీవన విధానానికి మార్గాలు. నమ్మకాలు మారవు. నమ్మకాలు మనకు కనపడవు. మన సజ్ఞానేంద్రియ జ్ఞానానికీ అందవు. ఋజువుకు నిలబడవు. కాబట్టి నమ్మకానికి కాలం, ప్రదేశంతో పనిలేదు. - అవి అలాగే మన భావజాలంలో కలసిపోయి, భారజలంగా మారిపోయి తరాలనుండి తరాలకు ప్రవహిస్తూ ఉంటాయి. కానీ నిజాలు వేరు. సత్యం వేరు. పరిపూర్ణమైన నిజం వైపుకు పోయినకొద్దీ... దాని విశాలత పెరిగి పోతూ ఉంటుంది. అంటే దాని కొలతలు మారిపోతూ ఉంటాయి. -

భౌతిక విజ్ఞాన శాస్త్రంలో అణువుగురించి చెప్పుకొంటే... ఎప్పుడో.. డాల్టన్ మహాశయుడు అణువుకంటే చిన్నదైనది ఏదీ లేదు, ఉండదు' అని చెప్పాడు. దాన్నిక చిన్న చిన్న ముక్కలుగాచేయలేం అని చెప్పాడు. ఆ ప్రతిపాదన చాలాకాలం ఉంది. ఆ తర్వాత అణువును ఛేదించవచ్చుని నిరూపించారు. పరమాణువుల్ని కనుగొన్నారు. అదీ కొంతకాలమే ఉంది. ఆతర్వాత పరమాణు గర్భం లోని ఎలక్ట్రాన్‌లు, ప్రోటాన్లు, న్యూట్రాన్ల గురించి చెప్పారు. ఆ తర్వాత వాటి రూపాలకి కారణమైన క్వార్క్‌ను కనుగొన్నారు- ఇప్పుడు ఆ శాస్త్రం హిగ్స్‌బోసాన్లు దాకా వచ్చింది- అంటే పది శాతం సత్యం నుండి 100 శాతం సత్యం వైపుకు మారిపోతూ... సాగిపోతుంది. అందుకే మనం ఇంతకు ముందు చెప్పుకున్నట్లు కాలం గడిచిన కొద్దీ దాని విశాలత పెరిగిపోతూ ఉంటుంది.

అలాగే... బౌద్ధం కూడా నమ్మకం కాదు. అందుకే అదీ... కాలం గడిచేకొద్దీ ఎన్నో మార్పులకి లోనైంది. నిజమైన సత్యావిష్కరణ కోసం సాగిన ఎన్నో మార్గాలుగా అది మారిపోయింది.

ఒక నది పుట్టుక స్థానంలో చిన్నగానే ఉంటుంది. ఆ తర్వాత మహా ఉధృతంగా ప్రవహిస్తుంది. చివరికి పాయలు పాయలుగా చీలిపోయి డెల్టాలు ఏర్పాటు చేసి, నేలను సస్యశ్యామలం చేస్తుంది. 'అలాగే.. బౌద్ధం కూడా అనేక వాదాలుగా, ఎన్నో పాయలుగా మారి, ప్రపంచాన్ని 'ధమ్మ డెల్టాలు'గా మార్చింది. మానవతా పంటలు పండించింది. పండిస్తూనే ఉంది, పండిస్తుంది కూడా-

ఇలా... బౌద్ధ ధమ్మాన్ని పరివ్యాపితం చేసే క్రమంలో కొన్ని మార్గాలు తప్పుదారిన పోవచ్చు. అవి తప్పో, ఒప్పో ఇంకా మనకు ఋజువు కాక పోవచ్చు. కానీ- ఒక శాస్త్రీయ సిద్ధాంతం ఎన్ని 'ధోరణులు'గా, ఎన్ని దారులుగా మారిపోతుందో బౌద్ధం కూడా అన్ని దారుల్లోకీ పోయింది.

బౌద్ధం ఒక ప్రజాస్వామిక తత్త్వం. బౌద్ధ సంఘాల్లో ఏ నిర్ణయం తీసుకున్నా అది సంఘం ఉమ్మడి నిర్ణయమే. దాని కోసం ఎంతో చర్చ జరుగుతుంది. సంఘంలోని మెజారిటీ అభిప్రాయమే అంగీకారమవుతుంది. భిక్షువులకే కాదు, చివరికి బుద్ధుని విషయంలోనైనా అంతే.

బుద్ధుడు తాను ఏదైనా ఒక నియమాన్ని ఏర్పాటు చేయాలనుకొంటే, ఒక సంఘానికి నాయకునిగానో, ఒక ధమ్మ స్థాపకునిగానో కాకుండా, తన అభిప్రాయాన్ని 'సంఘం ముందు ఉంచి' చర్చించి సంఘం అంగీకారంతోనే 'ఆ నియమాన్ని' చేర్చేవాడు, తొలగించేవాడు.

బుద్ధుని కాలంలోనే, బుద్ధుడు జీవించి ఉండగానే బౌద్ధ సంఘ నియమాల విషయంలో బుద్ధునితో విభేదించి దేవదత్తుని నాయకత్వంలో మరో బౌద్ధ సంఘం ఏర్పడింది. తర్వాత కాలక్రమంలో ఆ సంఘం కనుమరుగై ప్రధాన ప్రవంతిలో కలసిపోయింది. ఇంకా అనేక నియమాలపైన బుద్ధునితోనే తర్జన భర్జనలు పడ్డ భిక్షువులు కూడా ఉన్నారు.

బుద్ధుడు ఒక సమయంలో విధించిన ఒక నియమాన్ని, కాలక్రమంలో దాన్ని 'అవసరం' అనుకుంటే తొలగించేవాడు. మారిన కాలానికి అనుగుణంగా కొత్తవి చేర్చేవాడు.

ఇదంతా ఇక్కడెందుకంటే... బౌద్ధం గొప్ప 'శాస్త్రీయం' అని చెప్పడానికే. కాలాన్ని బట్టి మారేదే శాస్త్రీయం. మారనిది మతం.

అందుకే ప్రపంచంలో ఈనాడున్న అన్ని మతాలు, అవి ప్రతిపాదించిన ఎన్నో విలువల విషయంలో ఈనాడు తల్లక్రిందులై పోతున్నాయి.

ఆధునిక విజ్ఞానం, ఆధునిక నాగరికత, ఆధునిక జీవనం అందించిన మానవీయ విలువలకు ఈనాటికీ 'సరిపోయే' ధర్మం బౌద్ధం ఒక్కటే. అందుకే ఈనాడు ప్రపంచం మొత్తం ఆ దిశగా కళ్ళు తెరుచుకొని చూస్తోంది!

**బౌద్ధంలో విభేదాలు:** నిజం చెప్పాలంటే 'విభేదాలు' అనడం అంత సరైనపదం కాదు. అభిప్రాయ భేదాలు అనడం సముచితం. ముఖ్యంగా బౌద్ధంలో నూతన దృక్పథాలు రెండు రకాలుగా వ్యక్తం అయ్యాయి. ఒకటి: బౌద్ధ సిద్ధాంతం వల్ల, రెండు: బౌద్ధం ఆచరణ వల్ల. ఈ రెండింటి వల్ల బౌద్ధంలో ఎన్నో అభిప్రాయ భేదాలు వచ్చాయి.

ముఖ్యంగా బౌద్ధంలో వచ్చిన సిద్ధాంత భేదాల్లో ప్రధానమైన దారులన్నీ ఆంధ్ర బౌద్ధులవే.

బౌద్ధంలో ప్రధానమైన విభాగం బుద్ధుని నిర్వాణం పొందిన వందేళ్ళలోనే జరిగిపోయింది. ఇంకా చెప్పాలంటే... బుద్ధుడు ఉన్నప్పుడే ఆవిధమైన భేదం చూచాయగా పొడచూపింది.

బుద్ధుడు చెప్పిన విషయాల్ని, ధర్మాల్ని యధాతథంగా అనుసరించాలని భావించి, ఆ విధంగా నడిచేవారు ఒకరు. బుద్ధుడు ప్రవచించిన నియమాల్ని కొద్ది కొద్దిగా సవరించి, నూతన మార్గంలో పోవాలనుకునేవారు మరొకరు. వారిలో మొదటి మార్గంలోంచి రెండో మార్గంలోకి వచ్చినవారు ఎక్కువమంది అయ్యారు. అందుకనే... మొదటివారిని 'హీనయానులు" అనీ రెండోవారిని "మహాయానులు" అనీ అంటారు. ఇది సాధారణంగా అందరూ చెప్పుకునే విషయం. కానీ... ఇది పైకి మనం తేలిగ్గా ఉండడానికి చెప్పుకునేదే కానీ... వాటికి అసలైన అర్థాలు వేరు. అవి తెలుసుకుంటే వాటి ముఖ్య తేడాలు తెలుస్తాయి.

**హీనయానం:** బౌద్ధుల అంతిమలక్ష్యం నిర్వాణం. నిర్వాణం అంటే ఒక విధంగా విముక్తి. ముక్తి లాంటిదే. మన మనస్సుల్లో కోరికలన్నీ సమూలంగా నాశనం చేసుకొని, ఏలాంటి కోరికలు లేని దశే నిర్వాణం. నిర్వాణం అంటే చనిపోయేటప్పుడు పొందేది మాత్రమే కాదు. ఒక మనిషి బ్రతికుండగా కూడా ఈ నిర్వాణ దశను పొందవచ్చు.

"ఆనందానికి పొంగక, దుఃఖానికి కుంగక, సరైన జ్ఞానంతో, సరైన నిర్ణయంతో ఒక విషయాన్ని గురించి నిర్ణయం తీసుకోవడం. ప్రేమ, ద్వేషం, ఈర్ష్య, పగలు, ఆపేక్షలు లేకుండా ఒక విషయాన్ని 'యధార్థ స్థితిలో' గుర్తించడం. ఇలా ఉండగలిగే స్థితిని "ఉపేక్ష" అంటారు. ఇలాంటి స్థితికి చేరుకుంటే ఆ వ్యక్తి మనోస్థితి నిర్మలంగా, నిర్వికారంగా ఉంటుంది. కోరికలు లేనిదిగా "నిర్మలంగా" ఉంటుంది. ఇలాంటి స్థితిని బ్రతికి ఉన్నప్పుడు కూడా పొందవచ్చు–

ఉదాహరణకి... బుద్ధుడు రాజ్యాన్ని త్యజించి వచ్చాడు. భోగభాగ్యాలన్నీ వదులుకొని 'ముని'గా మారాడు. హంసతూలికా తల్పాలు వదిలి, కఠిన బండరాళ్ళమీద బ్రతికాడు. ఏనాడూ... 'అయ్యో! అలాంటి స్థితి వదిలి వచ్చానే' అనే ఆలోచనే చేయలేదు.

అలాగే... తను సన్యసించి, తిరిగి తన రాజ్యానికి వచ్చాక, సిద్ధార్థుని భార్య యశోధర తన కుమారుడు రాహులుణ్ణి బుద్ధుని వద్దకు పోయి, వంశపారంపర్యంగా నాకు వచ్చే రాజ్యభాగం... ఆస్థిహక్కు పంచమని' అడగమని పంపుతుంది. రాహులుడు వచ్చి "తండ్రీ! నా హక్కు నాకు ఇవ్వండి" అని అడుగుతాడు. అప్పుడు బుద్ధుడు–

"నాయనా! నేను ఈ మార్గంలో కొచ్చాను. భిక్షువు నయ్యాను. ఈ కష్టాలు, నష్టాలు నీకెందుకు... నీవైనా రాజ్యపాలన చేస్తూ మన వంశగౌరవం నిలుపు. సుఖంగా పాలించు" అని చెప్పలేదు. వెంటనే తన బిడ్డను కూడా భిక్షువుగా మార్చి, అతని చేతిలో ఒక భిక్షాపాత్ర పెట్టాడు.

ఇంకో విషయం... ఒకసారి మౌద్గల్యాయనుడు అనే బౌద్ధ భిక్షువు ఒక ఇంటికి వెళ్ళి భిక్ష అడిగాడు. ఆ ఇంటిలోని వ్యక్తి కుష్ఠువ్యాధి గ్రస్తుడు. ఒక కుండలో సద్ది పున్నీళ్లు (గతరాత్రి గంజిలో నానబెట్టిన అన్నం) తెచ్చి భిక్ష వేస్తాడు. ఆ భిక్ష తీసుకుని మౌద్గల్యాయనుడు తింటూ ఉన్నప్పుడు, ఆ భిక్షలో ఒక 'చర్మం తోలు' కనిపిస్తుంది. అది ఆ భిక్షవేసిన కుష్ఠువ్యాధి వానిది. అయినా, ఎలాంటి వికారాలకి లోనుగాకుండా, దాన్ని తీసి ప్రక్కన పెట్టి మామూలుగానే భిక్ష స్వీకరిస్తాడు.

ఇదే– "నిర్వాణం" అంటే– పైన చెప్పిన సంఘటనలు మూడూ బ్రతికి ఉన్నవ్యక్తి సాధించిన నిర్వాణ దశలే.

అయితే... ఇక్కడ విషయం ఏమంటే... ఇలాంటి నిర్వాణం పొందిన వ్యక్తి తనకు తానుగా మరింత ధ్యానం చేస్తూ... ఆస్థితిలోనే దుఃఖాన్ని జయించి బ్రతకడం– హీనయానులు అవలంబించే మార్గం.

## రచయిత బొర్రా గోవర్ధన్‌కు గౌరవ డాక్టరేట్




ఐక్యరాజ్యసమితి అనుబంధ సంస్థ అయిన "అకాడమీ ఆఫ్ యూనివర్సల్ గ్లోబల్ పీస్" వారు 2015వ సంవత్సరానికి గాను సాహిత్యంలో బౌద్ధరచయిత బొర్రా గోవర్ధన్‌కు గౌరవ డాక్టరేట్‌ను ఇచ్చారు. అక్టోబర్ 31న చెన్నైలో జరిగిన స్నాతకోత్సవంలో ఈ డాక్టరేట్ ప్రదానం చేశారు. గోవర్ధన్ బౌద్ధంలో సాగిస్తున్న సాహిత్య కృషికి, బౌద్ధ దర్శనం, భగవాన్‌బుద్ధ, మన మార్గం బౌద్ధమే, సంఘమిత్ర కథలు, వినయపిటకం, బుద్ధభేరి, బౌద్ధం ఇప్పటికీ అవసరమా?- గ్రంథాలకు గాను ఈ గౌరవం దక్కింది."ప్రపంచ శాంతికి బౌద్ధం ఒక మార్గదర్శి కాబట్టి, ఆ మార్గాన్ని ప్రజలకు విశేషంగా అందిస్తున్నందుకు ఈ డాక్టరేట్ ప్రకటించినట్లు" ఈ సంస్థ ప్రకటించింది.

అంటే...తనకు తానుగా తన దారిలో తాను పోవడం.

కానీ... ఇలా తనకు తానుగా తన దారి చూసుకొని తను పోవడం కంటే... ఇలా పోయే దారి చాలా ఉదాత్తమైంది కాబట్టి... ఆ మార్గంలోకి మన చుట్టూ ఉన్న సమాజాన్నంతా తీసుకురావాలి. అలా వారందర్నీ తీసుకు రావాలంటే... అవసరమైతే మనదారిని కాస్త మార్చుకోవాలి. లేదా మనం పొందే "నిర్వాణ" స్థితిని వాయిదా వేసుకోవాలనే ఆలోచన కొందరిలో కలిగింది. తనకు తానుగా కాకుండా సమాజం మొత్తాన్నీ దుఃఖం నుండి విముక్తి చేయాలనే ఈ ఆలోచనే... బౌద్ధంలో కొత్త దారికి మార్గం వేసింది. అదే "మహాయానం". వీరికి బుద్ధుని పట్ల ఎంత ప్రేమ, గౌరవాలు ఉంటాయో- అంతే ఆరాధన కూడా ఉంటుంది. వీరి సిద్ధాంతంలో బుద్ధుడు అపార కరుణా సమన్వితుడైన "బోధిసత్త్వుడు". ఈ ప్రపంచాన్నంతా దుఃఖవిముక్తి కలిగించేదాకా ఆయన బుద్ధుడై నిర్వాణం పొందాడు. ప్రజలందర్నీ దుఃఖ విముక్తి కలిగిస్తూ, తన "నిర్వాణాన్ని వాయిదా వేసుకుంటూ ఉంటాడు.

దయ, కరుణ, ప్రేమ, మైత్రి... ఇలాంటి భావాలు పరిపూర్ణంగా మూర్తీభవించిన మూర్తి ఆయన-

ఇదీ ఈ రెండు దృక్పథాల్లో ప్రధాన విభేదం.ఎన్ని విభేదాలున్నా- పంచశీల, అష్టాంగమార్గం, దశశీలలు అందరికీ ఒక్కటే. అయితే మహాయాన సంప్రదాయంలో బోధిసత్త్వుడు మనకోసం తన నిర్వాణాన్ని త్యాగం చేసిన త్యాగజీవి కాబట్టి, ఆయన పట్ల మన అనురాగం పెరిగింది. అదే క్రమంగా"బుద్ధ ఆరాధనకు" దారి తీసింది.

అయితే... అందరూ ఈవిషయంలో పొరపడే ఒక విషయం ఉంది. -

మహాయానం వల్ల "బుద్ధుని ఆరాధన" వచ్చింది అని తప్పుగా మాట్లాడతారు- బుద్ధ ఆరాధనలో కానీ, బుద్ధ పూజలో కానీ... ఎక్కడా

"ఓ బుద్ధా! నాకు సంపదలు కలిగించు! నన్ను ఫలాని పరీక్షలో ఉత్తీర్ణుణ్ణి చేయి! నన్ను ఫలానా కష్టాల నుండి గట్టెక్కించు! లేదా ఫలానా వాడికి నష్టం కలిగించు.... నా కష్ట నష్టాలు తొలగించు... ఇలా చేస్తే నీకు ఫలానా మ్రొక్కు తీరుస్తా!" అనే ఆరాధనలు, వేడుకోళ్ళు ఏ బౌద్ధ సంప్రదాయంలో ఈనాటికీ లేవు.

"నన్ను సంస్కరించు... నన్ను మంచి మార్గంలో నడిపించు" అని కూడా లేవు, ఉండవు.

"నేను ఇలా నడుస్తాను. నేను ఇలా మంచిమార్గంలో పయనిస్తాను. పంచశీల పాటిస్తాను" అని మనకు మనం బుద్ధ ప్రతిమ ముందు చెప్పుకోవడమే ఉంటుంది.

ఇలా... "నన్ను నీవు నడిపించు..." అని **మనిషి తనకు తనుగా 'బానిసగా' లొంగి పోవడాన్ని బౌద్ధంలోని ఏ వర్గమైనా, ఏ ధర్మమైనా అంగీకరించదు, ఒప్పుకోదు. అలా చేస్తే అది బౌద్ధమే కాదు. బౌద్ధ సిద్ధాంతానికి మనిషే పునాది.**

ఇక, అసలు విషయానికొద్దాం. తనకు తానుగా ఒంటరిగా నిర్వాణ మార్గాన్ని ఎంచుకునేవారు హీనయానులు.

అందరినీ నిర్వాణ మార్గంలో నడిపించుకు పోయేవారు మహాయానులు. 'హీన' అంటే "ఇరుకైన" అని, యానం అంటే 'మార్గం' అని, ఇరుకైన దారి, చిన్న దారి, కాలిబాట... అని దీనర్థం. ఎవరికి వారు ఒకే వ్యక్తిగా పోయేదారి కాబట్టి వారికి "చిన్నదారి" సరిపోతుంది. కానీ ప్రజలందరూ పోవాలంటే "కాలిబాట" సరిపోదు. ఇరుకైన దారులు సరిపోవు. విశాలమైన రాదారులు కావాలి. కాబట్టి వారుపోయేదారి "మహాదారి" కావాలి. కాబట్టి దాన్ని మహాయానం అన్నారు.

ఇదీ... హీనయాన (కాలిబాట), మహాయాన (పెద్దదారి) సంప్రదాయాల మధ్య తేడా టూకీగా. ఈమార్గాలలో తెలుగునాట బౌద్ధులు ప్రధానంగా 'పెద్దదారినే' ఎంచుకున్నారు. ఎంచుకోవడం కాదు... ఆ దారికి మార్గం తీసిన వారూ అయ్యారు.

కరుణ ప్రధానమైన మహాయాన సంప్రదాయంలో బౌద్ధ లోకంలో మహా తాత్త్వికులుగా వెలుగొందిన వారి గురించి కొద్దిగా తెలుసుకుందాం!

**-ఇంకావుంది**

చరిత్రపై తెలుగు సంతకం

**డి.పి. అనూరాధ**

అసమాన తెలుగు వీరవనిత

# మహారాణి రుద్రమదేవి



రుద్రమ్మ భుజశక్తి అని శంకరంబాడి మా తెలుగుతల్లి గీతం వినపోయిస్తే ఈ కాకతీయ
రాణి గురించి మనకు ఎక్కువగా ఎక్కడా కన్పించదు... విన్పించదు...
కానీ సూర్యుడి తేజస్సును అరచేతితో ఆపలేం...
వజ్రం మట్టిపొరల్లో ఎంతగా మగ్గిపోయినా తన తేజస్సును కోల్పోదు...
రుద్రమదేవి కూడా అంతే...
ఆమె జీవితానికి సంబంధించి ప్రతి అంశమూ ఆశ్చర్యకరం... స్ఫూర్తిదాయకం... 12వ శతాబ్దిలో తెలుగు మహిళ ఆశయాలు ఇంత ఉన్నతంగా ఉన్నాయా అన్పిస్తుంది.

+++

**అ**యితే రుద్రమదేవి గురించి పూర్తి వివరాలు తెలుసుకునే ముందు క్రీ.శ.
రెండో శతాబ్దిలోనే అసమాన ధైర్యసాహసాలు కనబరచిన మరో తెలంగాణ రాణి నాగనిక గురించి తెలుసుకుందాం...
నాగనికా దేవి...
రుద్రమ కంటే వెయ్యేళ్ల ముందు తెలుగు గడ్డను పరిపాలించిన శాతవాహన రాణి...
శాతవాహన రాజు మొదటి శాతకర్ణి భార్య...
తన భర్త దక్షిణాధిపతి అంటూ నాణేఘాట్ శాసనం వేయించింది...
ఈ శాసనం వల్లే శాతవాహనుల పుట్టుపూర్వోత్తరాలు స్పష్టమయ్యాయి.
భర్తతో పాటు నాగనిక రెండు అశ్వమేధ యాగాలను నిర్వహించింది...
ఈ సందర్భంగా
వేయించిన నాణేలు ఇటీవలే బయటపడ్డాయి.
కొన్ని నాణేలపై రెండు వరుసల్లో అంటే పైన సిరి శాతకనిస... కింద నాగనికయ అని రాసి
ఉండడం విశేషం...
మరి కొన్నిటి మీద నాగనిక పేరు ఒక్కటే ఉంది.
మొదటి శాతకర్ణి మరణించే సమయానికి పిల్లలు చిన్నవాళ్లు కావడంతో నాగనిక కొంతకాలం
పరిపాలించిందని చరిత్ర చెబుతోంది.
తన పేరున నాణేలు ముద్రించుకునే శక్తివంతమైన రాణి... నాగనిక అని ఈ నాణేల వల్ల తెలుస్తోంది...
శాతవాహనుల సమయంలో మహిళలు ఎంతో ఉన్నతమైన స్థితిలో ఉండేవారు...

**రాణి** అనగానే మనకు ఝాన్సీ లక్ష్మీబాయి గుర్తుకు వస్తుంది...
ఇంకాస్త ఆలోచిస్తే ఢిల్లీని పరిపాలించిన రజియా సుల్తానా...
ఈజిప్టు రాణి క్లియోపాత్రా... ఇలా ఎక్కడెక్కడి వాళ్లో మన కళ్లముందు నిలుస్తారు...
కానీ మహారాణి రుద్రమదేవి అంతగా గుర్తుకు రాదు...
లక్ష్మీబాయి ఝాన్సీని ఏడాది...
రజియా సుల్తానా ఢిల్లీని నాలుగేళ్లు,
క్లియోపాత్రా ఈజిప్టును 19 ఏళ్లు పరిపాలిస్తే...
రాణి రుద్రమదేవి ఓరుగల్లును 27 సంవత్సరాలు పరిపాలించింది.
భారతదేశ చరిత్రలోనే కాదు ప్రపంచ చరిత్రలో మరే స్త్రీ ఇన్నేళ్ళు సింహాసనాన్ని అధిష్టించలేదు...
రుద్రమదేవి యుద్ధరంగంలోనే వీరస్వర్గం పొందింది.
అప్పటికి రుద్రమ వయసు 84 సంవత్సరాలు...
అంతటి పండు వయసులో కూడా యుద్ధం చేయగలిగింది అంటే రుద్రమ శక్తి అసాధారణం... అసమానం...
కానీ మనం రుద్రమ్మను మరచిపోయాం...
ఆమె ఖ్యాతినీ మరచిపోయాం...
సాహిత్యలోకమే కాదు. సినిమా రంగం కూడా రుద్రమదేవిని అంతగా పట్టించుకోలేదు..
ఇప్పుడు గుణశేఖర్ ఎంతో కష్టపడి 'రుద్రమదేవి' సినిమా తీసేవరకూ...
నాయకురాలు నాగమ్మ, మాంచాలల మీద చూపించిన ఆసక్తి రుద్రమదేవి మీద చూపించలేకపోయారు..

తల్లి పేరును తమ పేరులో పెట్టుకోవడం శాతవాహనుల సంప్రదాయం..
గౌతమీపుత్ర శాతకర్ణి... వాశిష్టిపుత్ర పులుమావి... ఇలా ఉంటాయి ఈరాజుల పేర్లు...
తాము ఫలానా రాజు కుమారులం అనే కంటే ఫలానా తల్లి బిడ్డలం అని చెప్పుకోవడం భారత
చరిత్రలోనే విచిత్రం...ఇది మానవ పరిణామక్రమంలోని
మాతృస్వామ్య వ్యవస్థ ప్రభావాన్ని తెలియజేస్తోంది.
ధరణికోటను పాలించిన ఇక్ష్వాకులు కూడా ఇదే సంప్రదాయాన్ని కొనసాగించారు. వీరి
రాజకుటుంబంలోని స్త్రీలకు వారు నమ్మిన మతాన్ని ఆశ్రయించే అవకాశం ఉండేదని
చరిత్ర చెబుతోంది...
అందుకే ఈ కాలంలో ఇక్ష్వాకు వంశానికి చెందిన స్త్రీలు బౌద్ధం స్వీకరించి, భిక్షువులతో పాటు
దేశదేశాలు పర్యటించారు... బుద్ధుడి సందేశాన్ని ప్రచారం చేశారు...
అయితే స్త్రీల జీవితం సామాజిక...ఆర్థిక... మత రంగాలకే పరిమితమై ఉన్న రోజులలో
కాకతీయ ప్రభువు గణపతి దేవుడు అందరికంటే పదడుగులు ముందుకు వేశాడు.
తన కుమార్తెలు రుద్రమదేవి, గుణపాంబలను యుద్ధతంత్రంలోనూ రాజనీతిలోనూ
ప్రవీణులను చేశాడు...వారిని పాలకులనూ చేశాడు...



**కా**కయతీయ ప్రభువుల్లో చాలా గొప్పవాడు గణపతి దేవుడు...
మహారాష్ట్రలో శివాజీలాగ...మన ఆంధ్రప్రదేశ్‌కు గణపతి దేవుడు అంతటివాడు...
శివాజీకంటే సుమారు 500 ఏళ్ల ముందువాడు గణపతి దేవుడు...
తెలుగు మాట్లాడేవాళ్లందరినీ ఏకఛత్రం కిందకి తెచ్చినవాడు గణపతి దేవుడే..
ఇతడి గురించి ఎంత చెప్పినా తక్కువే...
ఒకటి కాదు రెండు కాదు 63 సంవత్సరాలు రాజ్యాన్ని పరిపాలించాడు..
ఇంతటి గొప్ప చక్రవర్తికి సంబంధించి ఒక్క శిల్పమూ...కనీసం చిత్రమూ నేడు కన్పించదు...
వెండితెరమీద ఎన్నో చారిత్రక పాత్రలను పోషించిన నందమూరి తారకరామారావు గణపతి
దేవుడి పాత్ర వేయకపోవడం ఆశ్చర్యం వేస్తుంది..
ఉత్తర భారతానికి చెందిన విక్రమార్కుడిగా... అక్బరుగా కూడా వేసిన ఎన్టీఆర్ మన గణపతి
దేవుడిని విస్మరించడం శోచనీయం..
శాతవాహనుల తరువాత తెలుగు తేజం దశదిశలా పాకేలా చేసిన ఘనత గణపతి దేవుడిదే..
ఇన్నేళ్ల పరిపాలనలో ఒక్క యుద్ధంలో కూడా ఓడిపోలేదు...


వరంగల్ కోటలోని ప్రతాపరుద్రుడు

ఆఖరుకి క్రీస్తు శకం 1262లో ముత్తుకూరు యుద్ధంలో ఓడిపోయాడు..
ఆ వెనువెంటనే రాజ్యాధికారాన్ని కూతురుకి అప్పగించి రాజ్యాధికారం నుంచి
తప్పుకున్నాడు.
ఓ పక్క రాజ్యవిస్తరణ చేస్తూనే మరో పక్క కాలువలు...చెరువులనూ తవ్వించి రాజ్యాన్ని
అన్నపూర్ణగా మలచిన నిజమైన భూపతి గణపతి దేవుడు...
ఓరుగల్లు కోట నిర్మాణాన్ని పూర్తి చేశాడు...
అత్యద్భుతమైన కాకతీయ శిల్పం ఈయనకాలంలోనే రూపుదిద్దుకుంది...
క్షీణించిపోయిన విదేశీ వర్తకాన్ని తిరిగి పునరుద్ధరించాడు...
విదేశీ వర్తకులారా భయపడకండి నేనున్నాను అంటూ అభయహస్తం ఇచ్చిన ప్రభువు
గణపతి దేవుడు...
దీనికి సాక్ష్యమే నేటి మోటుపల్లి ఓడరేవు...
ప్రకాశంజిల్లాలో ఓ కుగ్రామం మోటుపల్లి...
ఇక్కడ ఏ విశేషమూ కన్పించదు...
ఊరికి కాస్త దూరంలో ఉన్నాయి రెండు ఆలయాలు... ఇవి కళావిహీనంగా కన్పిస్తాయి...
ఎక్కడ చూసినా ఇసుకే...
కాకతీయుల సమయంలో మణిమాణిక్యాలని... రత్నాలను రాశులుగా పోసి ఈ ఆలయాల

పరిసరాల్లో అమ్మేవారట...
ఇది అక్షరాలా నిజం అంటోంది ఒక శిలా శాసనం...
మోటుపల్లిలోని వీరభద్ర స్వామి ఆలయ ప్రాంగణంలో ఈ శిలాశాసనం ఉంది...
క్రీస్తు శకం 1244వ సంవత్సరంలో గణపతి దేవుడు ఈ శాసనాన్ని వేయించాడు..
నా జీవితముకన్నను సాహసికులగు నా ప్రజల సంరక్షణమే నాకు ఎక్కువ ప్రీతికరము అని
ఈ అభయ శాసనంలో గణపతి దేవుడు పేర్కొన్నాడు...
విదేశాల నుండి వచ్చే వస్తువులపై నామమాత్రపు సుంకాన్ని వేసి వాణిజ్యాన్ని ప్రోత్సహించాడు
గణపతి దేవుడు...
ఈ శాసన భాష సంస్కృతం...
ఇందులో కర్పూరం...ముత్యాలు...సుగంధద్రవ్యాలు ఇటువంటి పదాలు సులభంగానే అర్థం అవుతున్నాయి.

గణపతి దేవుడి సమయంలో స్త్రీల పాత్ర ఎటువంటిది అనే విషయం తెలుసుకోవాలంటే
రామప్ప ఆలయాన్ని చూడాలి...
ఇక్కడి శిల్పాలలోని స్త్రీ మూర్తులని చూడాలి..
వరంగల్‌కి 70 కిలోమీటర్ల దూరంలో ఉంది రామప్ప ఆలయం..
ఈ ఆలయానికి మూడు పక్కలా ఉన్నటువంటి 12 సాలభంజికలు ముందుగా దృష్టిని
ఆకర్షిస్తాయి..
ఒక్కో సాలభంజిక ఒక్కో రకమైన ఆహార్యంతో లావణ్యంతో ఆకట్టుకుంటుంది.
ఓ సాలభంజిక హైహీల్స్ వేసుకుని ఉండడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.
అంటే అప్పటి మహిళలు హైహీల్స్ వేసుకునే వారన్నమాట...
ఇంకా ఇక్కడ వాయిద్యాలను మోగించే మహిళలు... కత్తులు పట్టిన మగువలు... ఏనుగులను...
అశ్వాలనూ ఎక్కి యుద్ధాలు చేస్తున్న వీరనారులు ఇలా ఎన్నో శిల్పాలు ఉన్నాయి.
మహిళలు పురుషులతో సమానం అనే దృష్టి గణపతి దేవుడికి ఉండేది.
అందుకే గణపతిదేవుడు 1262లో తన పెద్ద కూతురు రుద్రమ దేవిని రుద్రమదేవ
మహారాజులుంగారు అనే పేరుతో పట్టాభిషేకం చేయించాడు.
అప్పటివరకూ మహామండలేశ్వరులుగా చెప్పుకునే కాకతీయ సంప్రదాయాన్ని పక్కకు
పెట్టడంలో ఓ విశేషం ఉంది..
ఆనాటి సమాజానికి స్త్రీరాజ్య పాలన కొత్త విషయం.
అందుకని కొంతమంది చులకన చేయవచ్చు.. శత్రువులు తక్కువ అంచనా వేయవచ్చు..
అందుకే మహారాజులుంగారు అని ప్రచారం చేయించాడు..
దానికి తగినట్టు రుద్రమదేవి ఆహార్యం కూడా పురుషవేషంలోనే ఉండేది.

✦✦✦

**చి**న్నప్పటి నుంచి రుద్రమదేవి ఎక్కువగా పురుష దుస్తులే వేసుకునేదట..
విద్యలోనూ యుద్ధతంత్రంలోనూ ఆరితేరిన వీరనారి...
రుద్రమ రాజ్యాన్ని చేపట్టిన పదేళ్ల పాటు శత్రు దాడులను ఎన్నో ఎదుర్కొంది.
పశ్చిమం నుండి దేవగిరి రాజు యాదవ మహాదేవుడు ఓరుగల్లుపై దండెత్తి వచ్చాడు.
ఓరుగల్లు కోట స్వాధీనం కాలేదు... కానీ చాలా మంది సైనికులు కోట లోపల బందీ
లయ్యారు.
వేరేదారి లేక మహాదేవుడు వెనుదిరిగాడు.
రుద్రమ అశ్వారూఢియై మహాదేవుని తరిమి తరిమి కొట్టింది.
దేవగిరికి మధ్యలోనే వచ్చే యాదవుల బెదద కోట అంటే నేటి బీదర్‌ను స్వాధీనం
చేసుకుంది.
గత్యంతరం లేక మహాదేవుడు కాకతీయ రాణి రుద్రమదేవితో సంధి కుదుర్చుకున్నాడు.
శత్రు సైనికులను అంత తొందరగా ఆమె విడిచిపెట్టక యుద్ధనష్టపరిహారంగా కోటి బంగారు
నాణేలను తీసుకున్నట్లుగా ప్రతాపరుద్ర చరిత్ర పేర్కొంటోంది..
వాటిని తన సైనికులకు పంచిపెట్టింది...
బీదరుకోటలో తన సామంతరాజుని అధిపతిగా చేసింది...
ఈ ఘనవిజయానికి గుర్తుగా రుద్రమదేవి తండ్రిబిరుదు రాయగజకేసరిని స్వీకరించి
తండ్రికి తగ్గ తనయగాపేరుతెచ్చుకుంది.
దీనికి సంబంధించిన శిల్పాన్ని ఓరుగల్లు కోట బురుజు మీద చెక్కారు.

✦✦✦

రుద్రమదేవి నిరంతరం యుద్ధాలలో నిమగ్నమైనా ప్రజా పాలనను పక్కన పెట్టలేదు..
అభివృద్ధి కార్యక్రమాలను నిర్లక్ష్యం చేయలేదు..
ఓరుగల్లు కోటకు మరమ్మతులు చేయించింది.
మట్టి కోటకు బురుజులను... అగడ్తలను నిర్మించి కోటను దుర్భేద్యంగా మార్చింది.
గొప్ప ధర్మ ప్రభువులుగా పేరు తెచ్చుకొన్న అశోకుడు కానీ... అక్బరు కానీ చేయలేనిది
రుద్రమదేవి చేసింది...
ఆరోగ్యశాలలతో పాటు ప్రత్యేకంగా ప్రసూతి కేంద్రాలను ఏర్పరచింది.
అశోకుడు రహదారులకిరువైపులా చెట్లను నాటించాడు. వసతి గృహాలను నిర్మించాడు.
తొలినాళ్లలో వైద్య కేంద్రాలు ఉండేవని జైన గ్రంథాల వల్ల తెలుస్తోంది.
కానీ ప్రసూతి కేంద్రాలను ఏర్పరచడం అన్నవి ఎక్కడా లేదు...
ఓ స్త్రీగా మహిళాలోకానికి రుద్రమదేవి అందించిన కానుక ప్రసూతి కేంద్రాలు..
ఇవే తర్వాత కాలాల్లో మెటర్నిటీ హాస్పిటల్స్‌గా రూపుదిద్దుకున్నాయి...

రుద్రమదేవి తన పాలన కాలంలో సంస్కృతాన్నీ వేదవేదాంగాలను బోధించేందుకు కళాశాలలను స్థాపించింది.
ఈ కాలంలో గ్రామ రక్షణకోసం ఒక్కో గ్రామంలో 10 మంది వీరభద్రులు...21 మంది భటులు ఉండేవారట..
అంటే రుద్రమదేవి సమయంలో కాకతీయ గ్రామాన్ని తీసుకుంటే ఇక్కడ అక్కడ ఓ పాఠశాల..
ఆరోగ్యశాల... ప్రసూతి కేంద్రం... గ్రామ రక్షణకు వీరభద్రులు...ప్రజల రక్షణకు రక్షక భటులు ఇలా ఉండేవారన్నమాట.
మహారాణి రుద్రమదేవి కాలంలో జెనీవా నుంచి మార్కోపోలో దక్షిణ భారతానికి వచ్చాడు.
మార్కోపోలో ఓరుగల్లు రాజ్యవిశేషాల గురించి ఎన్నో రాశాడు... కాకతీయుల రాజ్యంలో
సన్నని...చాలా శ్రేష్టమైన వస్త్రాలను నేస్తారు... వీటి విలువ చాలా ఎక్కువ. ఈ బట్టలు సాలెపురుగు జాలిలా ఉంటాయి..
వాటిని ధరింపని రాజు కాని, రాణి కాని ప్రపంచంలో ఉండరు అని రాశాడు.
రుద్రమదేవికి చాళుక్య రాకుమారుడు వీరభద్రుడితో గణపతిదేవుడు వివాహం చేయించాడు.
వీరికి ముగ్గురు కూతుర్లు... ముమ్మడమ్మ... రుద్రమ.. రుయ్యమ..
పెద్దకూతురు ముమ్మడమ్మ కొడుకు ప్రతాపరుద్రుడు..
రుద్రమ సింహాసనం అధిష్టించే సమయానికే ఆమె భర్త వీరభద్రుడు అకాలమరణం చెందాడు..
గణపతి దేవుడి ప్రోత్సాహంతో ప్రతాపరుద్రుడిని దత్తత తీసుకుంది రుద్రమ..
ప్రతాపరుద్రుడికి యుద్ధనీతితో పాటు సకల విద్యలనూ నేర్పించింది..
యువరాజుగా ప్రకటించింది.. రాచకార్యాలలో తల్లికి బాసటగా ఉండేవాడు ప్రతాపరుద్రుడు.
కడప మండలాధీశుడు అంబదేవుడు వల్లూరు రాజధానిగా స్వతంత్రపాలన మొదలు పెట్టాడు.
ఇతడి ఆగడాలు అరికట్టేందుకు రుద్రమ తన సైన్యాన్ని సిద్ధం చేసింది..
ప్రతాపరుద్రుడు వ్యూహరచన చేశాడు. సైన్యం మొత్తం మూడు విభాగాలుగా విడిపోయి
ముక్కోణంగా శత్రువులను ఎదుర్కొన్నారు...ఒక విభాగానికి ప్రతాపరుద్రుడు, రెండో విభాగానికి ఆడిదం మల్లుసేనాని...
మూడో విభాగానికి స్వయంగా రుద్రమ నాయకత్వం వహించారు.
దురదృష్టవశాత్తూ త్రిపురాంతకం వద్ద అంబదేవునితో జరిగిన యుద్ధంలో రుద్రమ ప్రాణాలు కోల్పోయింది..
అప్పటికి ఆమె వయసు 84 సంవత్సరాలు..
క్రీస్తు శకం 1289 నవంబరులో ఆమె సైన్యాధికారి మల్లికార్జున నాయకుడితో సహా యుద్ధ రంగంలో ప్రాణాలు విడిచిందని నల్గొండ జిల్లా చందుపట్ల శాసనం వల్ల తెలుస్తోంది..
ఆఖరు శ్వాసను కూడా రాజ్య పరిరక్షణ కోసమే వెచ్చించిన రుద్రమ దేవి మహిళాశక్తికి ప్రతీక.

రుద్రమ తరవాత ప్రతాపరుద్రుడు రాజయ్యాడు.
అల్లావుద్దీన్ ఖిల్జీ సైన్యాలు ఓరుగల్లుపై ఏడుసార్లు దాడిచేసి విఫలమయ్యాయి.
1309లో ప్రతాపరుద్రుడు అల్లావుద్దీన్ సైన్యాలకు లొంగిపోయి సంధి కుదుర్చుకున్నాడు.
అల్లావుద్దీన్ సేనాధిపతి మాలిక్ కాఫర్ ఢిల్లీకి 612 ఏనుగులు, 20వేల గుర్రాలు, 9600
మణుగుల బంగారం, మణులు, నగలు తరలించుకుపోయాడని,
ఆ సంపదల బరువుకు వెయ్యి ఒంటెలు దడదడలాడి పోయాయని జియాదుద్దీన్ బరానీ రాశాడు.
ప్రపంచంలోనే సాటిలేని మణి ఆ విధంగా ఇచ్చినవాటిలో ఉన్నదని అమీర్ ఖుస్రూ రాశాడు.
అది కోహినూరో బాబర్ వజ్రమో అయివుంటుందని అతడి భావం...
1323లో గియాసుద్దీన్ తుగ్లక్ కొడుకు ఉల్లూఖాన్ హఠాత్తుగా ఓరుగల్లుపై దాడిచేసి తన
లక్షల సైన్యంతో విధ్వంసం సృష్టించాడు...
చుట్టుపక్కల గ్రామాలను తగుల బెట్టారు..
నీరు కోటలోకి పోకుండా గండ్లు కొట్టారు... కోటలో వీరులందరూ ఒక్కొక్కరూ బలైపోతున్నారు..
గత్యంతరం లేక ప్రతాపరుద్రుడు లొంగిపోయాడు.. ప్రతాపరుద్రుడిని బందీగా చేసుకుని
ఢిల్లీకి తీసుకువెళుతుండగా నర్మదా నదిలోకి దూకి ఆత్మహత్య చేసుకున్నాడు..
కాకతీయుల వీరగాథ అలా అంతమైంది..

✦✦✦

**నే**డు ఓరుగల్లు ఓ శిథిల నగరం...అన్నీ ఖండిత శిల్పాలే..
మట్టికోట చుట్టుకొలత 40 కి.మీ. రాతి కోట పరిధి 12 కిలోమీటర్లు...
ఆనాడు ఓరుగల్లు నగరంచుట్టూ ఏడు ప్రాకారాలతో 77 బురుజులతో ఉండేదట...
కాకతీయుల శౌర్య పరాక్రమాలకు...గంభీర రాజసానికి... ఆర్థిక సౌష్టవానికి నిలువెత్తు సాక్ష్యాలుగా తోరణ ద్వారాలను చూడవచ్చు.
ఈ కీర్తి తోరణాల సమీపంలో పెద్ద కొండ ఉంది...
ఈ కొండంతా ఏకశిలతో ఏర్పడింది.. అందుకే ఈ నగరానికంతా కూడా ఏకశిలా నగరం అనిపేరు వచ్చింది.
ఈ శిలపై అష్టకోణాకృతిలో నిర్మించిన బురుజు ఉంది...దీనిపై నిలబడి చూస్తే నగరమంతా కన్పిస్తుంది.
వేలకొద్దీశిథిలాల శకలాలు... శిథిలమైన కోట బురుజులు...గోడలు... ఆలయాలు...
ఇవే రుద్రమ్మ భుజశక్తికి ఆనవాళ్ళు..
ఇవే ఢిల్లీకి తరలిపోయిన మన జాతి సంపదకు ఆనవాళ్లు!

రచయిత్రి **డి.పి.అనూరాధ**
చరిత్ర పరిశోధకురాలు, పాత్రికేయురాలు
హైదరాబాదు, ఫోన్: 9010016555

# 'రుద్రమ దేవి' సినిమా విజయం- మరిన్ని చారిత్రక చిత్రాల నిర్మాణాలకు దారి చూపుతుందా?

చరిత్ర కథల్ని తెర కెక్కించాలంటే సాహసమే. కథ చెడకుండా వాస్తవాలు మారకుండా ఎన్నో మెలకువలతో తీయాల్సి ఉంటుంది. గతంలో మన్యం తిరుగుబాటు వీరుడు, స్వాతంత్ర సమర యోధుడు అల్లూరి సీతారామరాజు 1974, మే1న సినిమాగా వచ్చి జాతీయంగా సంచలనమే సృష్టించింది. చాణుక్య చంద్రగుప్త వంటి కొన్ని చారిత్రక సినిమాలు తెరకెక్కాయి. అలా తెలుగు జాతి చరిత్ర, సంస్కృతుల్ని ప్రబోధించే కథల్ని తీయాలంటే మరింత సాహసమే. గతంలో అల్లాణి శ్రీధర్ కొమురం భీమ్ సినిమా తీసి, తెలంగాణా గిరిజనోద్యమకారుడి కథకు జీవం పోశారు. నిజాంను ధిక్కరించిన కొదమ వీరుడు, బహుజన




నేత, సర్దార్ సర్వాయి పాపన్న సినిమాకూడా చిత్రంగా వచ్చింది. ఈ సినిమాను జైహింద్ గౌడ్ నిర్మించారు. తెలంగాణా ఉద్యమం నడుస్తున్న సమయంలో శంకర్ తెలంగాణా ఉద్యమ కథను తీసి భేషనిపించు కున్నాడు. విజయనగర రాజులపై మహామంత్రి తిమ్మరుసు, తెనాలి రామకృష్ణ, మహాకవి కాళిదాసు, బొబ్బిలియుద్ధం, పల్నాటి చరిత్ర, తదితర రాజవంశాలపై వచ్చిన సినిమాలు సైతం ప్రేక్షకాదరణకు నోచుకున్నాయి.

2015లో 'బాహుబలి' సినిమా, రుద్రమదేవి సినిమా రెండూ భారీ బడ్జెట్‌తో వచ్చి టాలీవుడ్‌నే కాకుండా, బాలీవుడ్ నిర్మాతల్ని ఆశ్చర్యానికి గురి చేశాయి.. ఈ రెండు చిత్రాలు విదేశాల్లో విడుదలై వసూళ్ళలో ముందున్నాయి. జులై 10న విడుదలై బాహుబలి సినిమా అక్టోబర్ 17, 2015 నాటికి శత దినోత్సవాన్ని పూర్తి చేసుకుంది. 150 కోట్ల బడ్జెట్‌తో విడుదలైన సినిమా నాలుగు భాషల్లో విడుదలై అయిదువందల కోట్ల రూపాయలను రాబట్టి రికార్డు నెలకొల్పింది.

13వ శతాబ్దికి చెందిన కాకతీయ రాణి రుద్రమదేవి కథను తీసుకొని చరిత్రను పెద్దగా వక్రీకరించకుండా తొలిసారిగా త్రీడీగా మలిచి దర్శకుడు గుణశేఖర్ తన ప్రతిభను చాటుకున్నాడు. తన కలల ప్రాజెక్టుగా ఈ చిత్రాన్ని మూడేళ్ళపాటు శ్రమించి నిర్మించారు. తానే నిర్మాణ బాధ్యతలు ఒంటిచేత్తో తీసుకుని చిత్ర నిర్మాణానికి సాహ సించారు. తెలుగుతోపాటు హిందీ, కన్నడం, తమిళంలో నిర్మించారు.

కాకతీయ సామ్రాజ్యం తెలుగునాటే కాకుండా దక్షిణాపథంలోనే ప్రసిద్ధి చెందింది. శాతవాహనులు, ఇక్ష్వాకులు, చాళుక్యులు ఈ తెలుగు నేలను అజేయంగా పరిపాలించారు. కాకతీయులు సుమారు మూడు వందల సంవత్సరాలపాటు తెలుగు నేలను అఖండంగా పరిపా లించారు. ఇందులో సగం పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా, మిగతా సగం స్వతంత్రులుగా పాలన చేశారు. వీరి పాలనలో సగభాగం యుద్ధాలు. సామంత రాజుల కుట్రలు, దాయాదుల పోరుతోనే సరిపోయింది. కాక తీయుల పాలనలోని దక్షిణాపథ శాసనాలన్నీ ఆంగ్లంలో గ్రంథ రూపంలో వచ్చాయి. కాకతీ యులు కవులు, కళాకారులను పోషించి, తెలుగుజాతికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టారు. పౌరాణిక సంబంధమైన రామాయణ, మహా భారత కథలపై యెన్నెన్నో సినిమాలు వచ్చాయి. మొగలాయి, రాజపుత్ర వీరులపై కూడా హిందీ ఇతర భాషల్లో సినిమాలు వచ్చాయి. జోధా అక్బర్, అనార్కలి సినిమాలు సైతం ప్రేక్షకాదరణకు నోచుకున్నాయి. కథలను వక్రీకరించి సాంకేతిక విలువలు లేని సినిమాలు అయి, బాక్స్ ఆఫీస్ వద్ద పల్టీ కొట్టి, ఇంటిదారి పట్టిన సంగతులు సగటు ప్రేక్షకుడికి తెలిసిందే..

**కాకతీయుల చరిత్రకు ఆధారాలు**

కాకతీయులు కళ్యాణి చాళుక్యలకు సామంతరాజులు. వీరిగూర్చి కరీంనగరంలోని శనిగరం శాసనాలు, చామస్‌పల్లి, వెంకటాయపల్లిలో దొరికిన రాగిరేకులు, కరీంనగర్ జిల్లాలోని కాకతీయులకు చెందిన 15 శాసనాలు వరంగల్, ఖమ్మం, నల్లగొండ జిల్లా శాసనాలు, ఇతరచోట్ల జరిగిన సంఘటనలు, ఇతరరాష్ట్రాల్లోని శాసనాలు, చందుపట్లలో దొరికిన శాసనాలు రుద్రమ మరణ తేదీని వెల్లడించే శాసనం- కథా రచనకు ఉపయోగపడ్డాయి. కాకతీయ చక్రవర్తి గణపతి దేవుడి సోదరి మైలాంబ వేయించిన ఖమ్మంజిల్లా బయ్యారం శాసనం

కాకతీయుల మూల వంశ వివరాల్ని అందిస్తోంది. క్రీ.శ.1250లో ఈ శాసనం వేయబడింది. వేయిస్తంభాల గుడి, రామప్పగుడి, భద్రకాళి గుడి, ఓరుగల్లు కోట, పద్మాక్షిగుట్ట, ఘనపురం గుళ్ళు, పానగల్ పచ్చల సోమేశ్వరాలయం, పిల్లలమర్రి శ్రీ చెన్నకేశవస్వామి దేవాలయం, నగునూరు గుడులు, నదిమేడారం గుడి వంటివి కాకతీయుల చరిత్రకు ఆధారభూతాలు. కాకతీయులు కొంతవరకు సామంతులు గాను, తదుపరి కాకతి రుద్రదేవుడు క్రీ.శ. 1158-1195 పాలనా కాలంలో కాకతీయ స్వతంత్ర సామ్రాజ్యంగా యేర్పడింది. గణపతిదేవ చక్రవర్తి క్రీ.శ. 1199-1261, వీరి కుమార్తె రుద్రమదేవి క్రీ.శ. 1261-1295, చివరి రాజు ప్రతాపరుద్రుడు క్రీ.శ. 1295-1323కు పాలించాడు. వీరు 165 సంవత్సరాలు సొంతంగా పరిపాలించారు. క్రీ.శ. 1158-1323 సొంత పరిపాలనా కాలంలో రుద్రదేవుడు, మహదేవుడు, గణపతిదేవుడు, రుద్రమ, ప్రతాప రుద్రుడితో అయిదు గురు రాజులు పాలించారు. అంతకుముందు సుమారు క్రీ.శ. 1000-1158 వరకు అంటే 158 సంవత్సరాలుసామంతులుగా కళ్యాణి చాళుక్యులకు ఉన్నారు. కాకతీయులది సుమారు 323 సంవత్సరాల పరిపాలనన్నమాట. మార్కోపోలో వంటి ఇటలీ యాత్రికుడు రుద్రమదేవి పాలనాకాలంలో సందర్శించి, పాలనా విశేషాలను నమోదు చేశాడు. ఇటలీ యాత్రికుడు మార్కోపోలో నేపథ్యంగా కథ చెబుతున్నట్లుగా సినిమా కథను ప్రారంభించడం ఈ సినిమా ప్రత్యేకత. ఈ సినిమాకు తెలంగాణా ప్రభుత్వం వినోదపన్నును మినహాయిస్తున్నట్లు ప్రకటించగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మాత్రం మౌనం వహించింది. అక్టోబర్ 9న విశ్వవ్యాప్తంగా ఈసినిమా విడుదలై చక్కటి వసూళ్ళు రాబట్టినట్లు సమాచారం.

అయితే సేఫ్‌జోన్‌లోకి వెళ్లాల్సి ఉంది. అప్పుడు బాహుబలిలా 500 కోట్ల క్లబ్‌లోకి వెడుతుందా లేదా చూడాల్సి వుంది. ఒక వారంలోనే 55 కోట్లు వసూళ్ళు వచ్చినట్లు సమాచారం. ఆంధ్రా ప్రాంతంలో ఆదరణకు నోచుకున్నా కొత్త సినిమాల విడుదల వంటి ఆటంకాల వల్ల కాస్త వెనుకబడినట్లు తెలుస్తోంది. అడవి బాపిరాజు గారి గోనగన్నారెడ్డి ఈ కథకు మూలం కాగా ఆయన పేరును యెక్కడా ప్రకటించలేదు. వినుకొండ వల్లభరాయుడి క్రీడాభిరామం సైతం కాకతీయులకాలం నాటి సామాజిక రాజకీయ వివరాల్ని అందించింది. ప్రసిద్ధ రచయితలైన ముదిగొండ శివప్రసాద్, విపంచిగా పిలవబడే తోట ప్రసాద్, ఎం.బి.ఎస్ ప్రసాద్, మధుబాబుగారి కథా సహకారం తీసుకున్నట్లు సమాచారం. రుద్రమదేవి గూర్చి ఎందరో నవలలు, నాటకాలు రాశారు. దూపాటి వెంకట రమణాచార్యులు, పద్దిరాజు సోదరులు కూడా రాసినట్లు ఒక మిత్రుడు డా. రంగస్వామి వివరాలు అందించారు.

రుద్రమదేవి సినిమాకు కొనసాగింపుగా ప్రతాపరుద్ర సినిమా తీస్తున్నట్లుగా దర్శకులు గుణశేఖరే ప్రకటించారు. పరుచూరి సంభాషణలు మోగినా, చాళుక్య వీరభద్రుడి కథను కుదించినట్లు, బందిపోటు గోన గన్నారెడ్డి పాత్రను పెంచినట్లు, అందులో నిర్మాత అల్లు అరవింద్ హస్తం ఉన్నట్లు పత్రికలు రాశాయి. రుద్రమ పాత్రలో అనుష్క వీరోచితంగానే, ఛాలెంజీగానే తీసుకొని నటించింది. మగపాత్రలో మేకప్ బాగుంది. కత్తి సాములోను, యుద్ధాలలోను చివరకు ఏనుగుపైకి ఎక్కి చేసిన యుద్ధ తంత్ర పోరాటాలు గొప్పగానే దర్శకుడు చిత్రీకరించాడు. రుద్రమగా, చాళుక్య వీరభద్రుడి ప్రియురాలిగా గ్లామర్ పాత్రలో చక్కగా కనిపించారు. వ్యయ ప్రయాసలకోర్చి చిత్రాన్ని తీయడంలో విజయం సాధించాడని చెప్పవచ్చును. 80 కోట్లు ఖర్చు చేసినట్లు తెలుస్తోంది. గోనగన్నారెడ్డిగా అల్లు అర్జున్ తన సత్తాను నిరూపించుకున్నాడు. బన్నీ తెలంగాణ యాసలో పలికిన డైలాగులు అదరగొట్టినా కథలో ఆ పాత్రకు ఇంత ప్రాధాన్యత వుందా, లేదా అన్నది చర్చనీయాంశమే. శివదేవయ్య మంత్రి పాత్రలో ప్రకాష్ రాజ్ చాణుక్య చంద్రగుప్త సినిమాలో రాక్షస పాత్ర పోసించిన కైకాల సత్యనారాయణలాగా భళీరా అనిపించుకున్నాడు. గణపతిదేవ చక్రవర్తి పాత్రకు సీనియర్ నటుడు కృష్ణంరాజు న్యాయం చేశాడు. రాజధానిని అనుమకొండ నుండి ఓరుగల్లు కోటకు మార్చడం, ఆగిన కోటను, బురుజుల నిర్మాణం పూర్తిచేసినట్టు చూపడం, గ్రాఫిక్స్‌ను గొప్పగా వాడుకోవడం, ఆదిలాబాద్ జిల్లా కుంతల జలపాతాన్ని విస్తృతంగా వాడుకోవడం, వేయిస్తంభాల కోట, కుంతల వద్ద పాటల ప్రదర్శనకు లొకేషన్‌గా వాడుకోవడంలో దర్శకుని ప్రతిభను, సమయోచిత నేర్పును చెబుతున్నాయి. కోట సెట్టింగులు, సొరంగ మార్గం, రాణి రుద్రమగా ప్రియుడు చాళుక్య వీరభద్రునికి బయటపడిన వైనం, హరిహర మురారి దేవులు, అంబదేవుల కుట్రలు, దేవగిరి యాదవరాజు మహదేవుడి శత్రువైఖరి, ఏక స్తంభం మేడ, రుద్రమ కిరీటం, రుద్రసేన ఏర్పాటు, చెరువుల తవ్వకం, మదనికగా హంసనందిని నటన, కుట్రలు, హత్యలు ఈ సినిమాకు అదనపు హంగుల్ని సమకూర్చాయి. నాగదేవుడిగా గాయకుడు బాబా సెహగల్ నటన ఆకట్టుకుంది. ముక్తాంబగా నిత్యామీనన్, అంబదేవుడిగా జయప్రకాశ్ రెడ్డి, దేవగిరి యువరాజుగా విక్రంజీత్, హరిహర దేవుడిగా సుమన్, మురారి దేవుడిగా ఆదిత్య మీనన్ చక్కగా సరిపోయారు. హంసనందిని పావురాల సందేశ చిత్రీకరణ ఆకట్టుకొంది.

రాణిగా రుద్రమ పట్టాభిషేకంతో చిత్రకథను ముగించి, ఈ సినిమాకు కొనసాగింపుగా ప్రతాపరుద్రకు కథా సమన్వయం చేసినట్లు అనిపించింది.

మాస్ట్రో ఇళయరాజా సంగీతం మన్మోహనమే అయినా పాటల్ని ఇంకా మధురాతి మధురంగా మలచడంలో కాస్త శ్రద్ధ కనపరచవలసి వుంది. నేపథ్య సంగీతం తగినట్లు లేదు. దాన్ని మణిశర్మ లాంటి వాళ్ళకు అవకాశం ఇస్తే బాగుండేది. బాలీవుడ్ ప్రముఖ ఆర్టిస్టు నీతాలుల్లా మేకప్ నాణ్యంగా ఉంది. రాళ్ళకోట, మట్టికోట తదితర కోటల మర్మాలు, జలదుర్గం సెట్టింగుల రూపకల్పనలో పద్మశ్రీ తోట తరణి కళా కౌశలం అద్భుతం. అజయ్ విన్సెంట్ ఛాయాగ్రహణం ఉన్నత స్థాయిలో వుంది. సిరివెన్నెల సీతారామశాస్త్రి పాటలు అర్థవంతంగా వున్నాయి. మెగాస్టార్ చిరంజీవి ఇచ్చిన వాచకం నిండుగా వుంది. తెలుగుజాతికి, ముఖ్యంగా తెలంగాణకు చెందిన ఈ కథపై పలు చరిత్రకారులు రాసిన పుస్తకాలు గతంలో వచ్చాయి. పుచ్చా వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రి, కాకతీయులు అనే పరిశోధక పుస్తకం వ్రాశారు. సురవరం వారు ఆంధ్రుల సాంఘిక చరిత్రను రాశారు.

ఆచార్య ఎన్.జి. రంగా, మలయశ్రీ కూడా కాకతీయులపై పుస్తకాలు రాశారు. రామప్ప దేవాలయ నిర్మాణ విశేషాలు, జాయప సేనాని రాసిన పేరిణి శివతాండవం వంటి అంశాలు చోటు చేసుకోలేదు. బాహుబలిలో బల్గేరియా జలపాతాన్ని ఎస్.ఎస్. రాజమౌళి వాడుకుంటే రుద్రమదేవిలో తెలంగాణాలోని కుంతల జలపాతాన్ని పుష్కలంగా వాడుకొని, స్థానికతకు పెద్దపీట వేశారు. ముమ్ముందు మరికొన్ని చారిత్రక సినిమాలు రావడానికి ఈ భారీ చిత్రం పాదులు వేసినట్ల యింది.... ఈ సినిమాను తీయాలనే తలంపు రావడం, దానిని తనకు చేతనైనంత భారీగా తియ్యడం గుణశేఖర్ తెలుగుజాతికి చేసిన మేలుగా అనుకొంటే తప్పులేదు. అయితే ఈ చిత్రం 'బాహుబలి' కంటే ముందుగా విడుదలై వుంటే ఇంకా విజయవంతం అయివుండేది. 'బాహుబలి'ని తీర్చిదిద్దడంలో రాజమౌళి బృందం ఎంతో నిపుణత, చతురత చూపించింది. ఆ చిత్రం కేవలం ప్రేక్షకుల్ని ఊహాలోకాల్లోకి తీసుకెళ్లి ఆహా ఓహో అనిపించుకొని భ్రమలో ముంచి తేల్చుతుంది. 'రుద్రమదేవి' కథను సినిమాగా మలచడం ఒక పెద్ద సాహసం. అయితే పాత్రల్ని మరింత గంభీరంగా, సమగ్రంగా తీర్చిదిద్ది వుండవలసింది. సినిమా టెక్నిక్‌ను ఇంకా ప్రతిభావంతంగా ఉపయోగించుకొని ఉండవలసింది. అలాగని, దీన్ని తక్కువగా చూడడం తప్పే అవుతుంది. సామాన్య ప్రేక్షకులు ఆశించే వినోదానికి ఇందులో అవకాశం తక్కువ. అయితే దర్శకుడు దీనికి ఒక చిత్ర విచిత్ర జానపదరూపాన్నిచ్చి కథను పాడుచెయ్యకుండా చారిత్రక నేపథ్యాన్ని, లక్షణాల్ని కాపాడడంలో శ్రద్ధ వహించినందుకు మనం ఆయన్ని గుండెనిండుగా అభినందించాలి. దీన్ని స్ఫూర్తిగా తీసుకొని ముమ్ముందు తెలుగు చరిత్రలోని గొప్ప గొప్ప అంశాలను, వ్యక్తులను కథా వస్తువుగా తీసుకొని మరిన్ని మంచి చిత్రాలను తీయడానికి నిర్మాతలు, దర్శకులు పూనుకోవాలి. మనకు గొప్ప దర్శకులు, సాంకేతిక నిపుణులకు, రచయితలకు, నిర్మాతలకు లోటు లేదు. కాని, వారు తమ సమర్థతను, శక్తిని సరిగా వినియోగించడం లేదు. వారు కొంత విశాలమైన ఆలోచనలతో ధైర్యంతో ముందుకు వచ్చి మరిన్ని చిత్రాలను నిర్మించడానికి– సాంకేతిక ఔన్నత్యానికి 'బాహుబలి' నిదర్శనంగా ఉంటే, చారిత్రక చిరస్మరణీయ చిత్రాలవైపుకు 'రుద్రమదేవి' చిత్రం దారి చూపుతోంది. మరింత సాంకేతిక ఔన్నత్యం, ఉదాత్త ఆశయం, ధైర్యం కలగలిపిన సినిమాల కోసం మనం ఎదురుచూద్దాం.

**సంకేపల్లి నాగేంద్ర శర్మ**
చరిత్రకారుడు, ఉపాధ్యాయుడు, కరీంనగర్. 9441797650

# అక్షరాలు



చుట్టూ పక్షులెగురుతుంటాయి
చేతికి దొరికిందే మనది,
కవిత్వమూ అంతే!

ఉద్వేగం ఒక వల
రాళ్ళు పడతాయో
రత్నాలు పడతాయో
పంచరంగుల చేపలు
దొరికీ దొరకనట్టు జారిపోతాయో!

అద్భుతం దృశ్యం అదొక వరం
చూపుల పగ్గాలు చాలవు
చిక్కిన కాడికే చక్కదనం
మిగిలేది కలవరం

కల చెదిరిపోతుంది
జల మాత్రం ఆగిపోదు
ఈ అశాంతి
ఏ శాంతికి దారి తీస్తుందో తెలియదు

కనులు మూసుకుంటే తప్ప
లోకతత్వం బోధపడదు
ఇప్పుడు పక్షులు
లోపలా ఎగురుతుంటాయి
పక్షులు కావవి
అక్షరాలు!

**–డా॥ఎన్.గోపి,** హైదరాబాదు
ఫోను : 93910 28496

మనసులో మాట

డా॥ వావిలాల సుబ్బారావు

# చెరగని జాడ- గురజాడ

1915లో తనువు చాలించిన- గురజాడ తెలుగు సాహిత్యంలో తెచ్చిన మార్పులు, తెరిచిన కొత్త తలుపులు, జ్ఞాపకం చేస్తే నేటి తరం పాఠకులకు అవి ఘనమయినవిగా కనిపించకపోవచ్చు. - బాల్య వివాహాల నిరసన, వితంతు వివాహాలు, వాడుకభాష, సాధారణ మయిన నేటి కాలానికి ఆయన పోరాటాలు చిన్న విషయాలుగా అనిపించవచ్చు. గురజాడకు ముందున్న భాష సాహిత్యాన్ని- అందులో చిత్రించిన పరిమిత జీవితాన్ని గుర్తిస్తే ఆయన వేసినది ముందడుగే కాదు. "పెద్ద అంగ" (leap) అని అర్థమవుతుంది.

ఎట్లా వ్రాసినా -"ఇదేమివ్రాత" అనేవారు లేనికాలంలో మనం ఉన్నాం. ఆనాటి సాహిత్య సామ్రాజ్యానికి పండితులే ప్రభువులు. అలంకార శాస్త్రమే పీనల్ కోడ్. కనుక ముందు చూపుతో వ్రాస్తే చాలదు. ఎదిరించి నిలవాలి గూడ. గురజాడ మౌలిక చింతన కన్నా, భావకవిత్వం తక్కువ ప్రమాదకరమయింది గనుక- అదే ఆనాటి సాహిత్యాన్ని ముందుగా రాజ్యమేలింది. గురజాడ భావ విప్లవం సాహిత్యలోకానికి మింగుడు పడటానికి మరి కొన్ని దశాబ్దాలకాలం వేచి ఉండవలసి వచ్చింది. గురజాడ వృక్షానికి శాఖలు ఆలస్యంగా విస్తరించాయి. భావకవితా వృక్షం వెంటనే కాపుకు వచ్చింది. త్వరలోనే కాపు ఉడిగిపోతుంది.

ఇపుడు గురజాడకు శతవర్థంతి సంవత్సరం. (1915 నవంబరు30) 153 సంవత్సరాల క్రింద జన్మించిన గురజాడ ఇంకా సాహిత్య దిక్సూచిగానే ఉన్నాడు. చాలామంది కవులు సాహిత్య సౌందర్యానికే మిగులుతారు. అందుకే మననం చేస్తాం. జీవిత లక్ష్యం కోసం- సమిష్టి జీవనమార్గం కోసం దారి చూపుతూ మనముందు నిలిచేవారు తక్కువ. గురజాడతో కవితా ప్రయోజనం కొత్తబాట పట్టింది. భాష కొత్తగా మారింది. రెండూ ప్రజాపరం అయినాయి. కోటబురుజులు దాటించి పల్లెల్లోకి తెచ్చి ఏ హడావుడి చేయకుండా కవిత్వానికి చలువ పందిరి వేశాడు.

"విప్లవం పట్టిన వీరభద్రుని పళ్లెం ముందు వీరంగం వేశాడు శ్రీనివాసరావు. (మా కవిమిత్రులు హనుమయ్య వాక్యం)-చటులాలంకారపు మటుమాయల నటనలు-ఛందస్సుల సర్ప పరిష్వంగం-స్మశానాలవంటి నిఘంటువులు- అంటూ ప్రబంధ భాషతోనే ప్రబంధాల మీద యుద్ధం చేసాడు. కాని గురజాడ పూర్వ సాహిత్యం మీద సాత్విక యుద్ధం చేశాడు. గొప్పకవిత్వం అంటే శబ్దార్థి కారం-భావుకత-ఉక్తి నైపుణ్యం- అలంకారికత- అంటూ చాలా చాలాగా నిర్వచించుకున్న గత సాహిత్య సంప్రదాయాల నుండి- కవిత్వం అంటే సూటిగా అర్థం కావటం అని, నైపుణ్యంతో మిరుమిట్లు కొలపటం గాక హృదయాన్ని కదిలించటమని, ప్రేమ భావాన్ని రేకెత్తించటమని, కొత్త బాటకు నడిపించిన, నవ్య సాహిత్య సారథి గురజాడ. సంప్రదాయ ధర్మాన్ని పాఠకుని మనసులో నాటటం పురాణ సాహిత్య లక్ష్యం. అదే బాటలో సౌందర్య భావన రసతృప్తి కలిగించటం పూర్వ కావ్యాల ప్రధాన ధ్యేయం.

పాఠకునిలో కరుణ కలిగించటం గురజాడకు ప్రధానం. కవితా రచనలు అన్నీ కరుణ వైపుకే ముఖం త్రిప్పి ఉంటాయి. ఒక్క పూర్ణమ్మ ఏమిటి? కన్యక- డామన్ పితియస్ పెన్నిది- మనిషి- అన్నీ అంతే. తోకచుక్కను "సంఘ సంస్కరణ ప్రయాణ పతాక" అనటం వంటి నూతన కల్పనలకన్న కారుణ్య ప్రధాన భావనే అతని ముఖ్య కవితాగుణం.

కన్యాశుల్కం నాటకం గురించి చర్చోప చర్చలు జరిగాయి. అది భీభత్సరస ప్రధానం అన్నాడు శ్రీశ్రీ. మా "హనుమయ్య గారు" అది కరుణరస ప్రధానం అన్నాడు ఒక మంచి వ్యాసంలో. సమాజ మూర్ఖత్వం మీద - వ్యక్తుల అల్పత్వం మీద మనకు కోపం, అసహ్యం కలుగుతాయి. గురజాడ చేసిన రస చమత్కారం ఏమంటే అట్లాంటి పాత్రల చుట్టూ హాస్యం చిత్రించి- వారిమీద మనకు కలిగే కోపాన్ని కడిగేశాడు- లుబ్ధావధానులు- రామప్ప- అగ్నిహోత్రావధాని అందరూ కోపార్హులే. కాని వారిని హాస్యంలో ఇరికించి- మనచేత గూడ "పాపం ఈ పాత్రలు- అయ్యో!" అనిపిస్తాడు. అదీ కరుణ అంటే! మనలో కరుణ కలిగించటానికి గురజాడ చేతిలో హాస్యం ఉపకరణమయింది. హాస్యాన్ని వెకిలితనం బారినుండి కాపాడాడు. కరుణకు చెలికత్తెను చేసాడు. ఎంత గొప్ప రస ప్రయోగం! పాత్ర లెట్లాంటివయినా- వాటి గుణగణాలతో నిమిత్తం లేకుండా, సమాజ రథచక్రాల క్రింద నలిగి రక్తం ఓడుతున్న పాత్రలపై చివరలో పాఠకునికి/ ప్రేక్షకునికి జాలి కలుగుతుంది- అందరు దయనీయులై మనలో కరుణ కలుగుతుంది. నీతి నిష్ఠలో బిగుసుకు పోయిన సౌజన్యరావుకన్నా మధురవాణే ఒక మెట్టు ఎత్తున నిలుస్తుంది.

సంఘమూర్ఖత్వం మీద కందుకూరికి కోపం ఉంది. దానికి బలి అయిన వారిమీద జాలి ఉంది. గురజాడ వారి మూర్ఖత్వాన్ని గుర్తించి గూడ నవ్వుకుంటాడు. విప్లవ రచయితల దారివేరు. కారణంతో పాటు కారకుల్ని గూడ దండిస్తారు. ఏ మేరకయినా సరే! వయసు మళ్లిన ఎముకలు కుళ్లిన సోమరులారా చావండి" అని శపిస్తారు. గురజాడది కరుణమార్గం- ప్రేమమార్గం. భవభూతి కరుణకు, గురజాడ కరుణకు చాలా భేదం. శోకంమీద నిలచిన 'కరుణ' భవభూతిది. ప్రేమ మీద నిలచిన 'కరుణ' గురజాడది. ఇది తూచటం కాదు. విశ్లేషించటం మాత్రమే.

అన్ని విలువలకు పరిణామం ఉన్నట్లే సాహిత్య విలువలకూ పరిణామం ఉంటుంది. శ్రీనాథుడు పాండిత్యం వల్ల కవి సార్వభౌముడు. అల్లసాని వర్ణనల వల్ల కవితాపితామహుడు. వారందరి విలువలు ఒకటే. గురజాడ విలువలనే ముందుకు నడిపించాడు. శిల్ప నైపుణ్యంలో అలంకార నైపుణ్యంలో ఇతర కావ్యగుణాలలో గురజాడను మించిన వారు చాలామంది ఉన్నారు. ఘన సంపుటాలు వ్రాసిన ఉద్దండులు ఉన్నారు. అయినా గురజాడే దిక్సూచి.

శ్రీశ్రీకి గురజాడ పూర్వగామి. శ్రీశ్రీకి స్పష్టమయిన సిద్ధాంతం ఉంది. గురజాడ కాలానికి అవి సుదూరాన వీస్తున్న గాలులు. ఇంకా ఇక్కడదాక చేరలేదు. దేశమంతా రవీంద్రుని కవితా మాధుర్యంలో మైమరుస్తున్నది. అందుకు గురజాడది చాలా భిన్నం.

ప్రబలమయిన ప్రభావాలకు భిన్నంగా స్వంత కంఠం వినిపించటమే గొప్ప ముందుచూపు. ఈ జాడలో దాంపత్య ప్రియ భావనలూ ఉన్నాయి. కృష్ణశాస్త్రి లాగా అది విరహ మాధుర్యం కాదు. పూర్వపు అజ్ఞానానికి దూరం చేస్తూ జ్ఞానం వైపుకు ప్రేమతో కళ్లు తెరిపించే ప్రయత్నం ఉంటుంది. "తూర్పు బలబల తెల్ల వారెను" అంటూ కొత్త కాంతికి ముఖం త్రిప్పే ప్రియుడు కనిపిస్తాడు. ప్రేమవల్ల-ప్రేమ నుండి-ప్రేమకోసం. వివేకం కలగాలి. మరులు మాత్రమే కాదు. "జ్ఞానమొక్కటె నిలచి వెలుగును" - అని చెప్పి "నీ నెనరు కలుగకున్న పేదను- కలిగిన నా పదవి వేల్పురేనికెక్కడ" అని స్త్రీ పురుష సంబంధాలకు కొత్త నిర్వచనాన్ని 'చలం' కన్న ముందే యిచ్చాడు.

అయితే అవాస్తవమయిన అమలిన శృంగారాన్ని బోధించలేదు. నాటి నీతివాదుల లాగ వేశ్యలను కించపరచలేదు. అందుకు మధురవాణి ఉదాహరణ చాలు.

దేశభక్తి గేయం సర్వదేశ జాతీయగీతం "వందేమాతరం' నుండి "మా తెలుగు తల్లికి" - దాకా అన్నీ ప్రాంతీయ గీతాలే. సూక్తులు నినాదాలు కవిత్వాలవుతాయా అని విమర్శించారు. స్వభావోక్తి, గొప్ప అలంకారమయినపుడు, సత్యసూక్తి కవిత్వంకాదా! అలంకారాలను అల్లవచ్చు. సత్యం అల్లకానికి అందదు. అది దర్శనం. నీలోని పరిమితులను ఛేదించుకుంటే తప్ప కలగని ధర్మం-సత్యం. అలంకార రచన నైపుణ్య సాధ్యం. సత్యోక్తి, దర్శన నైపుణ్యం కన్నా దర్శనం గొప్పదయితే గురజాడది మహాదర్శనం గనుక ఆయన మహాకవి.

నేటి కవిత్వం గురజాడను దాటి చాలా ముందుకు వచ్చింది. గణబద్ధ ఛందస్సుల ఫ్యూడలిజాన్ని మాత్రా ఛాందస్సుల ప్రజాస్వామ్యాన్ని గూడ దాటాము. ముక్త ఛందస్సుల స్వీయ స్వామ్యంలోకి వచ్చాం. అయినా సరే కవితకు ఏదో ఒక లయ ఉంటేనే సొగసు. నేటి అభ్యాసకవులు ముత్యాల సరాలను కొంత కాలం సాధనచేస్తే శైలికి, కరుణ భావనకు, దోహదం కలుగుతుంది. ఎన్ని కొత్త కవితా శాఖలు వచ్చినా గురజాడ పునాదిలా నిలుస్తాడు.

రచయిత విశ్రాంత అధ్యాపకులు, విమర్శకులు
ఫోన్: 9866402973

# తెనుగు లెంక సూక్తులు-4

***ఏను వేఱు తెలుగు మానిసి వేఱను
వాడు సొచ్చె దెనుగువాడ లోని
కతడు పొంచి పొంచి యందాలవెల్లి నా
తెలుగు తల్లి వెలది వెలుగుడించె.***



'తెనుగు లెంక' 'అభినవ తిక్కన'
తుమ్మల సీతారామమూర్తి.

**బ**యటి శత్రువుల కంటె లోపలి శత్రువులే ప్రమాదకారులనే విషయం చరిత్ర నిరూపించిన సత్యం. ఈ సత్యం రాజ్య విషయం లోనే కాదు, భాష విషయంలోను నూటికినూరు పాళ్ళు నిజం. తెలుగు భాష విషయంలో తెలుగు వారే నిజమైన శత్రువులనడం కాదనలేని వాస్తవం. అక్షరాలా నిజం.

ఏ జాతికయినా స్వస్థాన వేష భాషాభిమానం ఉండాలనేది మహాకవి మాట. కాని దురదృష్టవశాత్తు ఆంధ్రదేశంలో పుట్టిన అతికొద్ది మంది మాత్రమే భాషాభిమానం చూపుతున్నారు. తెలుగువాణికి విలువనిస్తున్నారు.

తెలుగు తల్లిదండ్రులకు తమ పిల్లలను ఆంగ్లపాఠశాలల్లో చదివించడం ఇష్టం. తెలుగు పిల్లలకు ఆంగ్లమాధ్యమంలో చదవడం ఇష్టం. తెలుగు అధ్యాపకులు ఆంగ్లంలో సంతకాలు చేస్తారు. తెలుగు శాసనసభ్యులు తెలుగు శాసన సభల్లో ఆంగ్లంలో ఉపన్యసిస్తారు. తెలుగు శాసన సభాపతి ఆంగ్లంలోనే హెచ్చరిస్తుంటాడు. జి.ఒ.లు, చట్టాలు, ప్రభుత్వ వ్యవహారాలన్నీ ఆంగ్లంలోనే! తెలుగు రాష్ట్రాల ఏలికలు తమకు తెలుగు పట్ల ఎటువంటి బాధ్యతా లేదన్నట్లు పరిపాలిస్తారు. తెలుగు టి.వి. యాంకర్లు తెలుగు మాట్లాడరు. తెలుగు పత్రికల్లో సగం ఆంగ్లపదాలు కనిపిస్తుంటాయి. తెలుగు పట్టణాల్లోని అంగళ్ల పేరుపలకలు ఆంగ్లంలోనే దర్శనమిస్తాయి. ఇద్దరు తెలుగు వాళ్ళు కలిస్తే ఆంగ్లంలో సంభాషించుకోవాలని ఆరాట పడతారు! తెలుగు కవులు, రచయితలు ఆంగ్లపదాలను యధేచ్ఛగా వాడుతుంటారు. తెలుగులో ఉపన్యాసం చెప్పేవాళ్ళు తెలుగులోని సూక్తులను చెప్పకుండా అదేభావంఉన్న ఆంగ్లవాక్యాలను ఉదహరిస్తుంటారు. తెలుగుతల్లి విగ్రహం కింద ఆంగ్లభాషలో ఫలకం వేస్తారు. తెలుగు కార్యాలయాల్లో తెలుగు వినిపించదు. ఇదీ తెలుగుదేశంలోని తెలుగు పరిస్థితి.

తెలుగువాడు స్వార్థపరుడు. తోటి తెలుగు వారందరికంటే తానే గొప్ప అనుకుంటాడు. తన స్వార్థంకోసం తెలుగుజాతి, తెలుగు భాష నాశనమయినా పట్టించుకోడు. తమ భాషకోసం పొరుగు రాష్ట్రాలవాళ్ళు చేసేపనులను చూచి అయినా నేర్చుకోడానికి ప్రయత్నం చేయడు. ఇలాంటివాళ్ళు తెలుగు దేశంలో పెరిగిపోయారు. అందుకే తెలుగును విడిచి ద్వితీయభాషగా సంస్కృతాన్ని తీసుకుంటున్నారు. పొరుగురాష్ట్రంలో తెలుగు పాఠశాలలు మూసివేస్తుంటే అది తమ విషయం కానట్లు కళ్ళు మూసుకుంటున్నారు. కనీసం అడగడానికి ప్రయత్నం చేయడంలేదు.

**"అందుకే నేను వేరు, తెలుగువారు వేరు- అని భావించేవారు తెలుగు వీధుల్లో తిరుగుతున్నారు. అలాంటివారే అందాల తెలుగు తల్లిని మరచిపోయారు. తెలుగుభారతి వెలుగును తగ్గించారు." అన్నారు అభినవ తిక్కన**

నిజంగా తెలుగువారి ఉదాసీన భావమే తెలుగు దుస్థితికి కారణం. ఇలాంటివారే అందాల తెలుగు భాషకు ద్రోహం చేస్తున్నారు. తెలుగు వెలుగును నాశనం చేస్తున్నారు. కనుక ప్రతి తెలుగువాడు తన భాషపట్ల అభిమానాన్ని పెంచుకోవాలి. అవసరమయితే తప్ప ఇతర భాషను వాడకూడదు. అప్పుడే తెలుగు తల్లి సంతోషిస్తుంది. తెలుగుభాష దివ్యకాంతులతో ప్రకాశిస్తుంది.

**- డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ**
విశ్రాంత అధ్యాపకులు
ఫోన్ : 9849799711

రాణి శివశంకర శర్మ

# తెలుగుదనం వరమా? శాపమా?

*అప్పారావు నా నేస్తం*
*ఆంధ్రత్వం నా శాపం- అన్నాడు శ్రీశ్రీ*
*ఆంధ్రత్వం ఆంధ్రభాషాచ*
*బహూనాం జన్మనః ఫలం*

ఆంధ్రుడుగా పుట్టడం, ఆంధ్రభాషలో మాట్లాడ్డం ఎన్నో జన్మల ఫలితం అన్నాడు మీమాంస తత్వవేత్త అప్పయ్య దీక్షితులు.

నిజానికి ఆంధ్రత్వం వరమా, శాపమా?

తెలుగు నాటకరంగం పాతాళంలో వుంది అన్నాడొకసారి శ్రీశ్రీ. పక్కనే వున్న కర్ణాటక రాష్ట్రంలో భావ సంఘర్షణని ప్రతిబింబించే చక్కని నాటకాలు యిప్పటికీ ప్రజల మన్నన పొందుతుంటాయి. టిప్పుసుల్తాన్ నాటకాన్ని అడ్డుకోవడానికి హిందూవాదులు ప్రయత్నిస్తే పెద్ద ఉద్యమమే నడిచింది. భావ సంఘర్షణలో భాగంగానే కల్బుర్గి హత్యకు గురయ్యాడు. వీరశైవ సంప్రదాయం విగ్రహారాధనని పూర్తిగా వ్యతిరేకిస్తుంది అని చెప్పడం, ఆయనపై ఆగ్రహానికి కారణమైందంటే మనకి ఆశ్చర్యంగా వుంటుంది.

మనకి భావ సంఘర్షణని ప్రతిబింబించే నాటకాలూ లేవు, ఫక్తు వ్యాపార సినిమా వొక్కటే మనకి మిగిలిన కళ. ఉద్యమాల ప్రభావం వల్ల మనం విశాల హృదయాన్ని అలవరచుకొన్నామని, అందుకే పక్కరాష్ట్రాల్లోని ఛాందస దాడులు కనబడవని అంటుంటారు కొందరు లెఫ్టిస్టులు.

నిజమే ఆంధ్రదేశంలో భావజాల ఘర్షణ కారణంగా హత్యలు కనబడవు. ఆత్మహత్యలు మాత్రమే కనబడ్తాయి. ఆంధ్రదేశం అనగానే గుర్తుకు వచ్చేది విద్యార్థుల ఆత్మహత్యలూ, రైతుల ఆత్మహత్యలూ.

విద్యార్థుల ఆత్మహత్యల వెనక దాగిన సాంస్కృతిక కోణం ఏమిటి? ఆంధ్రుల ప్రాగ్మాటిస్టు ధోరణే కారణం కావచ్చు. ప్రాగ్మాటిస్టు ధోరణిని సామాజిక చేయాలని లెఫ్టిస్టులు ప్రయత్నించారు. ప్రాగ్మాటిస్టు ధోరణిని పూర్తి వ్యక్తిగతంచేసి లాభాలు పిండుకోవాలని చూస్తున్నారు విద్యా వ్యాపారులు. విద్యార్థులు వొకప్పుడు లెఫ్టిస్టులకి వనరుగా వుంటే, యిప్పుడు వ్యాపారులకి ఆదాయవనరుగా వుంటున్నారు. ఇద్దరూ ఆర్థిక రంగమే అన్నిటికీ మూలం అని భావించారు. పునాది అని భావించారు. తెలుగునాట బౌద్ధచరిత్ర కూడా మనలో వ్యాపార తత్వాన్నే పెంచిందా?'

ఈ ప్రాగ్మాటిస్టు ధోరణే తెలుగుభాషకి కూడా ముప్పుగా పరిణమిస్తోంది. ఇతర రాష్ట్రాల్లో మాతృభాషాభిమానం యెక్కువ. గుజరాత్‌లో యీ మాతృభాషాభిమానమే యింగ్లీషు విద్యకి అడ్డంకిగా నిలిచి, సాఫ్టువేర్ రంగంలో వారికి తగిన స్థానం లేకుండా చేసిందంటున్నారు.

మనది ఘర్షణ వైఖరి కాదు. సర్దుబాటు వైఖరి ఎక్కువ. దీన్ని విశాల దృక్పథం అనైనా అనచ్చు. అవకాశ వాదం అనైనా అనవచ్చు. అసలు స్వాభిమానమే లేకపోవడమనచ్చు.

మన భాషా నిర్మాణంలోనే యితర భాషా పదాలని ఎన్నిటినో లీనం చేసుకొనే స్వభావం వుందంటారు బూదరాజు రాధాకృష్ణ. ఒకే వాక్యంలో ఎన్నెన్ని పరభాషా పదాలు లీనమయ్యాయో ఉదాహరణగా చూపారు. అచ్చతెనుగు పదాలతో శివకవులు కావ్యాలు రాసి సంస్కృతం సాంకర్యం నుంచి తెలుగుభాషని విముక్తం చెయ్యాలని చూశారు. ఆధునిక కాలంలో హరికథా పితామహ ఆదిభట్ల నారాయణదాసుగారు గొప్ప సంస్కృత పండితులైనప్పటికీ అచ్చ తెనుగు కావ్యాలు రాశారు. పైగా సంస్కృతాన్ని దెయ్యపు భాష అని నిందించడానికి వెనుకాడలేదు. ఐతే యీ అచ్చ తెలుగు కావ్యరచన వొక ప్రయోగంగానే మిగిలిపోయింది.

ఆధునిక కాలంలో శ్రీశ్రీయే కాదు, శివసాగర్ లాంటి విప్లవకవి కూడా సంస్కృత పదాలని ప్రయోగించాడు. జాషువా సంస్కృత కావ్య సంప్రదాయాన్ని, కాళిదాసు ప్రారంభించిన సందేశ కావ్య సంప్రదాయాన్ని అనుసరిస్తూనే, గబ్బిలం పేరుతో దాన్ని మలుపు తిప్పారు. నన్నయని నరేంద్రుడి బొందలోనే నిద్రపోనియ్యమని దిగంబరకవి గర్జించాడు కాని నన్నయ కన్న బలంగా సంస్కృతకావ్య సంప్రదాయం తెలుగు కవిత్వాన్ని వెన్నాడ్తూనే వచ్చింది.

నామిని చేసిన భాషాసేవ యేమిటంటే- అనూచాన సంస్కృత సంప్రదాయాన్ని కావ్య పౌరాణిక సంప్రదాయాల్నీ పక్కన బెట్టి పూర్తి గ్రామీణ స్వరానికి స్థానం కల్పించడం. ఐతే యీ గొంతుక విశ్వరూపం చూపకుండా, బాపు రమణలనే బ్రాహ్మణులు కట్టడి చేస్తూ వచ్చారు.

జాషువాకి తిరుపతి వెంకటకవుల్లో వొకరు గండపెండేరం తొడిగారు. శూద్ర, అతిశూద్ర గొంతుకల్ని బ్రాహ్మణ్యం బ్యాలెన్సు చేస్తూ వచ్చిందా? లేక తెలుగుకీ సంస్కృతానికీ మధ్య అవినాభావ సంబంధం లాంటిదేమైనా వుందా? ఇవి పరస్పర పూరకాలా?

తెలుగు సాహిత్యం గాఢత్వం కలిగి లేదని, సంస్కృత సాహిత్యంతో పోలిస్తే అది దిగతుడుపు అని విమర్శించారు ఉమాకాంత విద్యా శేఖర పండితులు. తిక్కన భగవద్గీతని అనువదించక పోవడాన్ని ఆయన తప్పు పట్టారు. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు వేమన గ్రంథంలో తెలుగునాట గొప్ప మతప్రవక్త లెవరూ జన్మించలేదన్నారు. ప్రాచీన తెలుగు కవులని రామకృష్ణకవులు తూర్పార బడితే, తిరుపతి వెంకటకవులు 'గీరతం' పేరుతో ఖండన గ్రంథం రాశారు.

నేటి కాలపు కవిత్వంలో పండిత ఉమాకాంత విద్యాశేఖరులు కాళిదాసాది కవుల కవిత్వాన్ని ఉదహరిస్తూ, భావకవుల్లో కొత్తదనం యేదీలేదని కొట్టేశారు. పైగా వెయ్యి లోపాలున్నాయన్నారు. ఆయన మెచ్చుకొన్నదొకే వొక కవిత్వం ఎంకి పాటలు. సకల తెలుగు కవిత్వాన్నీ సంస్కృత సాహిత్యంతో పోల్చి కొట్టివేసిన యీపండితుడు ఎంకిపాటల్నే ఎందుకు ఆకాశానికి ఎత్తాడు? వెన్నెలంతా మేసి యేరు నెమరేసింది. 'ఆరిపేయవె దీపమూ చీకట్లో నీ కళ్ళు సిల్లులడ సూదాల ' యింత తాజాదనం యే కవిత్వంలో వుంది? బహుశా తెలుగుదనపు అన్వేషణ యిక్కడ మొదలైంది.

*ఎంకిపాట వన్స్‌మోరు*
*కవి కోకిల గబ్బిలం*
*విశ్వ సత్యనాథాయణ*
*అగ్గిమీద గుగ్గిలం (శ్రీశ్రీ)*

కవి కోకిల జాషువా గబ్బిలం పేరుతో సంస్కృత సంప్రదాయాన్ని విలోమం చేశాడు. కాని ఎంకిపాటలు గ్రామాల్లో గ్రామీణుల్లో అచ్చమైన తెలుగు సంప్రదాయాన్ని అన్వేషించి పట్టుకున్నాయి. మరి విశ్వనాథవారి కిన్నెరసాని పాటల సంగతి ఏమిటి? ఇటునుంచి అటే కాదు, అటు నుంచి యిటుకూడా ప్రయాణం జరుగుతుంది. కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్

అన్నాడో కవి.

ఉద్యమాలని కూడా పాటలే నడిపించాయి. పాటలు చాలావరకు సంస్కృత సంప్రదాయ ఛాయలనుంచి బయటపడ్డాయి. 'తోటరాముడి తొడకు తూటా తగిలిందని చిలుక చీటీ తెచ్చెరా' అని శివసాగర్ రాశాడు.తెలుగు తన సంస్కృతిని పాటలో చాటుకుందా? పాట ప్రధానం కావడం ఉద్వేగానికి ప్రాధాన్యాన్ని పెంచి, ఆలోచన స్థానాన్ని తగ్గించేసిందా? అసలు తెలుగువాళ్ళు సుదీర్ఘ ఆలోచనల్నీ వివేచననీ పక్కన బెట్టి తక్షణ ప్రయోజనంపై ఆధారపడే ప్రాగ్మాటిస్టులు కావడం వల్లే పాటకి అంత ప్రాధాన్యం వచ్చిందా?

మళ్ళీ మొదటికి వద్దాం. తెలుగులో తత్వశాస్త్రవేత్తలు లేరని డి. వెంకటరావుగారు అందుకే అన్నారా? నిజానికి యీ ప్రకటన సాహసంతో కూడుకున్నదే. ఎందుకంటే యీ తెలుగు నేలపైనే నాగార్జునుడు దిజ్ఞాగుడు లాంటి బౌద్ధ తాత్వికులూ తార్కికులే గాక, గొప్ప ఆలోచనా పరులైన కుమారిలుడు లాంటి మీమాంసకులు కూడా జన్మించారు. ఐతే యీ బౌద్ధ, బ్రాహ్మణ సంప్రదాయాలు సంస్కృత భాషలో సాగాయి. "గ్రీకు, లాటిన్ భాషల్లోని ఫిలాసఫీలని పాశ్చాత్యులు తమవిగా భావించడం లేదా? సంస్కృతంలో వున్నంత మాత్రాన తెలుగునాట వికసించిన తత్వశాస్త్రం ఆంధ్ర సంబంధి కాకపోతుందా" అని ప్రశ్నించారొకసారి తత్వశాస్త్ర ఉపన్యాసకులు అంజయ్యగారు.

ఈ ప్రశ్న సరైనదే కాని తెలుగు భాష, సాహిత్యాల్ని అర్థం చేసుకోవడానికి అంతగా పనికిరాదు. వీరశైవం కన్నడ భాషని పరిపుష్టం చేసింది. వైష్ణవం తమిళానికి వేదమంతటి ప్రాధాన్యాన్ని తెచ్చింది. మనం కన్నడిగుల వీరశైవాన్ని అనుసరించాం.తమిళుల వైష్ణవాన్ని అనుసరిస్తూ కవిత్వం రాశాం. మరాఠీ దళిత కవిత్వం దాకా మనం యితరులని అనుసరిస్తూ వచ్చాం. మావోయిజాన్ని అరువు తెచ్చుకున్నాం. యింతకీ మనదైన భావధార యేది?

మనదైన నగరం లేకపోవడం వల్ల మనదైన నాగరికత కూడా లేకుండా పోయిందని కొందరన్నారు.మన సంగీతం కూడా తమిళనాటే వికసించింది. యక్షగాన సంప్రదాయం కూడా మధుర, తంజావూరు రాజ్యాలలోనే వికసించింది. మనభాష మరోచోట వికసిస్తూ వచ్చింది. మన తత్వం మతం ధర్మం ఎక్కువశాతం నిరంతరం దిగుమతిగా వచ్చింది. ఐతే నష్టమేమిటి? మనదైనదంటూ లేకపోవడం అన్నిటినీ మనదిగా చేసుకోవడానికి అవకాశం యివ్వవచ్చు కదా? అన్ని దిక్కులనుంచి వచ్చే గాలులని ఆహ్వానించవచ్చు కదా?

తనలాంటి రచయిత తమగడ్డమీద పుట్టే మరో ప్రాంతం వాళ్ళు ఆకాశానికైనా యెత్తేవారు. చంపనైనా చంపేసేవారు. యీ తెలుగువాళ్ళు యేదీ చెయ్యరు అని చలం తెలుగువాళ్ళమీద విసుగు చెందాడు.

తెలుగువాళ్ళ మనస్తత్వం నిర్లిప్తం. అది మంచిదా, చెడ్డదా, వరమా, శాపమా ఎవరు నిర్ణయించగలరు?

ఒక్క తుపాకీ దెబ్బతో అన్ని సమస్యలూ ఎగిరిపోతాయని ఘీంకరిస్తూ వచ్చిన మన వీర విప్లవ ప్రగతిశీల కవులూ, రచయితలూ, అవార్డుల్ని గట్టిగా కౌగలించుకొని కూర్చున్నారు. కన్నడ రచయితలూ ప్రజాస్వామ్యంకోసం అవార్డుల్ని తిరస్కరిస్తున్నారు. మన కలం వీరులకదేదీ పట్టదు. నిర్లిప్తత లౌక్యంగా అవకాశవాదం ఫక్తు ప్రాగ్మాటిజంగా పరిణమించి, తెలుగునాట ప్రజాస్వామిక ధోరణుల్ని నామమాత్రం చేస్తోందా? తెలుగువాళ్ళ సాంప్రదాయిక మనస్తత్వం చివరికి శాపంగానే పరిణమిస్తోందా?

**రచయిత: శ్రీ రాణి శివశంకర శర్మ, ఉపాధ్యాయుడు, రచయిత, విమర్శకుడు. కంబం, ప్రకాశం జిల్లా, ఫోన్: 7396666942**

# సవరణలు

## అమ్మనుడి అక్టోబరు 2015 సంచికలో

1) **కొలువు శాల (కత)** 26, 27 పుటలు

మొదటి పేరా 13వ పంక్తిలో - పదిహేనేండ్లు కళ్లలా పెట్టుకుని పెంచుకున్న కొడుకు ఆదిత్యను హైదరాబాదుల ఉండే నారాయణ కొలువుశాలల ఇడసబెట్టి వచ్చుడే నా కన్నీళ్లకు కారణం" అనే వాక్యంలో కొంత భాగం ముద్రణలో రాలేదు. దానిని పై విధంగా సరిచేసుకోవాలి.

| | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 2వ పేరా-12వ పంక్తి | సోయిరా | పోయిరా |
| 4వపేరా - 5వ పంక్తి | చెమలు | చెమటలు |
| " 8వ పంక్తి | రూటలో | మాటతో |
| 6వ పేరా - 5వ పంక్తి | కిల్లకును | కిల్లాకును |
| 7వ పేరా -10వ పంక్తి | అమ్మోరె | అమ్మోలె |
| 8వ పేరా - 2వ పంక్తి | వస్తున్నాడు | అస్తున్నడు |

---

2) **జనవాణి**-24వపుట:

'చిత్తశుద్ధిలేని ప్రభుత్వం' అనే లేఖలో చివరి 2 వాక్యాలు, వ్రాసినవారిపేరు ముద్రణలోకి రాలేదు. ఆ వాక్యాలు ఇవి: తెలుగుమాట్లాడే ఇరు రాష్ట్రాల మేధావులను తెలుగు పునరుజ్జీవనం కోరే వారందరితో సంఘటిత పోరాటం చేస్తే తప్ప తెలుగును కాపాడుకోవడం కష్టమనిపిస్తుంది. ఈ దృక్కోణంలో ఆలోచించి సంఘాన్ని ముందుకు నడిపించాలి-

**రామిశెట్టి రోశయ్య**.మధిర-9390279127.

3) 16వపుట 'జనవాణి'లో లేఖ వ్రాసినవారి ఇంటిపేరు తప్పుగా పడింది. వారిపేరు **పెమ్మరాజు పూర్ణచంద్రరావు**.

## అమ్మనుడి సెప్టెంబరు 2015 సంచికలో:

'మరపురాని లవణం' వ్యాసంలో 49వ పుటలో రత్న వివాహదృశ్యం ఫొటోలో సిద్ధరాజ్ దద్దా అనేపేరును శ్రీచంద్రశేఖర ధర్మాధికారి (హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి) అని చదువుకోవాలి. ఈ పొరపాట్లకు మన్నించగోరుతున్నాము. - సం//

# 'అమ్మనుడి' లభించేచోట్లు

నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ భవనం ఎదురుగా, కాచిగుడా. **హైదరాబాదు - 500 027.** ఫోన్: 040-24652387

మైత్రీ బుక్ హౌస్, జలీల్ వీధి, కార్ల్‌మార్క్స్ రోడ్డు, ఏలూరు రోడ్డు, **విజయవాడ - 520 002.** ఫోన్ : 9866211995

మణి బుక్‌స్టాల్, షాప్ నెం.58, సండేమార్కెట్, **నెల్లూరు**-1. ఫోన్:7386223538.

## జనవాణి

# రచయిత సమాజానికి దిక్సూచి

రచయితలకు సాహిత్య వస్తువు తన చుట్టూ ఉన్న సమాజమే. సూర్యుడు ఉదయించని చోటకూడా కవి తన విజ్ఞాన నేత్రాన్ని తెరుస్తాడు. రచయిత తన అనుభవ పరిధిలోకి వచ్చిన విషయాలను పరిశీలిస్తాడు. లోపాలకు సరైన పరిష్కారాలు సూచిస్తారు. రచయిత మనుషులు అందరివలె సంఘజీవి. సమాజశిల్పి. సమాజంలో తలెత్తే రుగ్మతలకు చికిత్స చేసేది రచయితే. క్రాంతిదర్శి. సమాజానికి దిక్సూచి. కొత్తకథలు, పాత్రలు, నవలలు, నాటకాలు రచించినా, రచయిత లక్ష్యం, గమ్యం విశ్వశ్రేయస్సే. నవసమాజస్థాపనే కొత్త సాహిత్య లోకాన్ని. నూతన వరవడిని కల్పించడమే. మారుతున్న కాలంలో ప్రజలు, పాఠకులు కోరుకునే నైతిక విలువలను సృష్టించడమే రచయితల దృక్పథం. సాహిత్యం సార్వకాలికంగా, సార్వజనీనంగా ఉండదు. సాహిత్యం ఎక్కువ మందికి నచ్చేవిధంగాఉండాలి. సమాజం ఎదుర్కొంటున్న సాంఘిక, ఆర్థిక, సామాజిక, రాజకీయ సమస్యలకు పరిష్కారాలు చూపించాలి. సమాజాన్ని తన కలం పదునుతో మార్చగలగాలి. కత్తి గొప్పదా! కలం గొప్పదా! అనే ప్రశ్న వస్తే కలంగొప్పదని ఎవరైనాచెప్తారు. కత్తికన్నా పదునైన ఆయుధం కలం. అయితే ఇప్పుడు రచయితలు ఎందుకు రచనలుచేస్తున్నారో, ఏ వర్గాలకుమేలు చేస్తున్నారో అర్థం కావటంలేదు. రచయితలకు 'సామాజిక స్పృహ' ఉండాలి అనేది ఆధునిక దృక్పథం. కాని ఆదిశగా రచయితలు కృషి చేయటంలేదు.

రచయిత సమాజంలో తన వంతు కర్తవ్యం ఏమిటని ఆలోచించటమే సామాజిక చైతన్యం. ఈ చైతన్యం రచయితకు ముడి వస్తువు అవుతుంది. రచనకు ప్రయోజనకారి అవుతుంది. రచయితలుఎందుకు రచనలు చేస్తున్నారు? ఎవరికోసం రచనలు చేస్తున్నారు? రచనలవల్ల ప్రయోజనం ఏమిటి? అని ఆలోచించటంద్వారా ఈ చైతన్యం కొన్ని ఉత్తమ ఆశయాలకు దారితీస్తుంది. రచయితలు లోతైన అధ్యయనం చేయాలి. సామాజిక రుగ్మతలకు మూలాలు వెదకాలి. లోతుగా కారణాలు వెదకాలి. పరిష్కారాలు చూపించాలి. సమాజంలో చెడు, అనైతికతల నివారణకు నడుంబిగించాలి. రచయితలవల్ల చైతన్యం పెరుగుతుంది. నాగరికత పేరుతో వెర్రితలలు వేస్తున్న సమాజద్రోహ విధానాలను రచయితలు ఖండించాలి. ఏ రచనలో ఐనా వస్తువు ప్రధానమైనది. వస్తువును ఆశ్రయించుకొని రచనరూపం ఉంటుంది. సామాజిక స్పృహతో రాసే రచన పాఠకులలో సామాజిక చైతన్యాన్ని పెంచుతుంది. అది సమాజపురోగతికి దోహదం చేస్తుంది. రచయితలు ప్రగతిశీలమైన సామాజిక దృక్పథంతో నవతరానికి పునాదులువేయాలి.

**రావుల రాజేశం,** జమ్మికుంట:9848811424

# రాజమండ్రి పేరు మార్పు...

రాజమహేంద్ర వరము అని రాజమండ్రి పేరును మార్చి మంచిపని చేశారు. ఇదేవిధంగా ఆంధ్రప్రదేశ్, తెలంగాణలలో తెలుగుదనానికి విరుద్ధంగా ఉన్న వూళ్ల పేర్లను మార్చాలి. హలంతాలను అజంతాలకు మార్చడంతో ఈ పనిని మొదలు పెట్టాలి. మచ్చుకు– గుంటూర్, నెల్లూర్, కర్నూల్, ఒంగోల్ అనే విధంగా తెలుగులోను, ఇంగ్లీషులోను ఎక్కడా వ్రాయకుండా గుంటూరు, నెల్లూరు, కర్నూలు, ఒంగోలు...ఇట్లామార్చాలి. BANGALORE ను BENGALURU గా మార్చలేదా? మనం మార్చుకొంటే తప్పేమిటి? అదేవిధంగా మహబూబ్‌నగర్, కరీంనగర్, నిజామాబాద్ వంటి పేర్లను మార్చి పాలమూరు, ఎలగందల, ఇందూరు అని పాత పేర్లను అమలులోకి తేవాలి. వరంగల్‌ను ఓరుగల్లు చెయ్యాలి. ఇలా మార్చేందుకు తెలంగాణ, ఆంధ్ర ప్రభుత్వాలు రెండూ ఎవరికివారే పూనుకోవాలి. ఆంధ్రప్రదేశ్ పేరును 'ఆంధ్ర' అని గానీ, 'ఆంధ్రరాష్ట్రం' అని గానీ మార్చాలి. కొత్త రాష్ట్రాలేర్పడిన ఈ సమయంలో ఇది వెంటనే చేపట్టదగిన పని.

**కంచర్ల సత్యపాల్‌రెడ్డి,** హైదరాబాదు 8686486859

# విమోచన దినం ఎప్పుడో?

నవ్యాంధ్రప్రదేశ్‌లో ఆంగ్ల ఆధిక్యం
తెలుగుభాషపై చిన్నచూపు
పొరుగు రాష్ట్రంలో తెలుగుకు ఇక్కట్లు
'బంగారు తెలుగు వడ్డాణం'పై నిర్లక్ష్యం
'వెండి ఆంగ్ల ఉంగరం'పై ఆరాటం
కార్పొరేట్ పాఠశాలల వీరవిహారం
'డాలర్ల' వేటలో తల్లిదండ్రులు
వత్తిడి విద్యలతో విద్యార్థుల ఆత్మహత్యలు
సభలు, జి.వో.లతో కంటి తుడుపు
తెలుగు భాషకుపట్టాభిషేకం ఎప్పుడో! విమోచన దినం ఎన్నడో?

**పరుచూరి శ్రీనివాసరావు,** సెల్: 9963218700

# తేట తెలుగు భాష

ఉగ్గుపాల భాష, ఊయల్ల భాష
తేనెపట్టు జార్చిన తేటతెలుగు భాష
లెస్స అయిన భాష, లేమిలేని భాష
కృష్ణదేవరాయలు మెచ్చుకున్న భాష
గోదావరి అంచులా, కిన్నెరసాని వంపులా
కృష్ణమ్మ హొయలులా, తుంగభద్ర కిలకిలలా
పెన్నానది పదరుగురిలా, నాగావళి ఒరవడిలా
గలగలా, జలజలా మాటలు కురిసే భాష
పారిజాత పరిమళాలు పరవశించు భాష
పదనిసలు సరిగమలు పాడుకొనే భాష
వెన్నలాగ గొంతుజారు కృతులు, రాగకీర్తనలు
రవళించి పులకించిన రాజనాల భాష

**కిలారి మాధవీలత,** సెల్: 9491664551

# అమ్మనుడి నచ్చింది, కాని...

సాహిత్య సమారాధన, సృజనమీదనే కృషిచేస్తున్న నేను అప్పుడప్పుడూ తెలుగుభాషాభివృద్ధికే ప్రత్యేకించి కృషి చేస్తున్న 'అమ్మఒడి' నాకు అవసరమా' అని ఆలోచిస్తూ వచ్చేను. కాని అక్టోబరు 15 పత్రికలోని ఎ.కృషారావు గారి తాపీ స్మారక ఉపన్యాసం, తెలుగమ్మ ఒడిలో లాంటి వ్యాసాలు చదివేక నా అభిప్రాయం మారిపోయింది. రమేష్‌బాబుగారి 'అమ్మనుడి' ప్రయత్నం సాహిత్య సమారాధనకూ, సృజనకూ కూడ అవసరమే అనే నిర్ధారణకు వచ్చేను.

'కథల్లో ప్రాంతీయ పదాలు' గురించి: 'ఇందూరు కత'లోని పదాలు తెలుగు తెలిసిన99% మందికి తెలియవు. అందరకూ తెలిసిన స్టేషనురోడ్డు, ప్లాట్‌ఫారమ్ లాంటి వాటిని పరభాష అయినా అలాగే ఉపయోగిస్తే భాషా ప్రయోజనానికేమీ ఇబ్బంది లేదని నా అభిప్రాయం. ప్రతి పదానికి టిప్పణి చూసి చదివితే కథా ప్రయోజనం ఏముంటుంది? ఈ విషయం ఆలోచించమని సంపాదకులకు నా సూచన. ప్రాంతీయ పదాలు మీద చర్చ భాషా విషయికమైన వ్యాసాల్లోనూ చర్చల్లోను చేయవచ్చు.

**కొట్టి రామారావు,** సెల్: 990878905

# కన్నవారిని కాపాడుకుందాము

**మ**నలాంటి వర్ధమాన దేశాలలో యువత మనుగడ కోసం పోరాటం చేయాల్సిన పరిస్థితులలో ఇతరదేశాలలో జీవితాంతము గడిపే పరిస్థితి ఏర్పడింది. మన దేశంలో చదివిన చదువులకు మంచి ఉద్యోగాలు లేక నిరుద్యోగులుగానే మిగిలి చివరికి యువత జీవితం నిర్వీర్యం అవుతోంది. అక్కడక్కడ అరకొర ఉద్యోగాలు చేసినా ఆ ఉద్యోగాలు చేయడం కంటే ఊడిగాలు చేయడం మంచిది. ఇక నేటి యువత ప్రభుత్వ కొలువులు పొందాలంటే వ్యయ ప్రయాసలతో కూడిన పనిగా చెప్పవచ్చు. అంతకంతకూ పెరిగిపోతున్న జనాభాతోపాటు నిరుద్యోగులుగా ఎక్కువ యువత తయారవుతున్నారు. నిరాశ నిస్పృహలకు గురికావాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి.

యువత జీవితంపై ఆశలతో, ఉన్న ఊరులోని కన్నవారిని వదిలి సంపాదనకోసం పేగుబంధాన్ని తెంచుకొని పరాయి దేశాలలో జీవితాలను కాగితాలతోనే తెగని ముడి వేసుకొని నెట్టుకొస్తున్నారు.

యువతలో అసలు అవసరాల కన్నా కొసరు విలాసాల కోసం తమ విలువైన సమయాన్ని దుర్వినియోగ పరుచుకొంటున్నారు. సంపాదనలో పడి సంతులిత ఆహారం కూడ తీసుకునే సమయం లేక అల్పాహారాలతోనే అయిందని పించుకొంటున్నారు. ఆఖరికి అనారోగ్యాలను మరీ 'కొని' తెచ్చుకుంటున్నారు.

యువతకు తమ జీవితాలనిచ్చిన కన్నవారి కర్మకాండలను కూడా చివరికి కళ్ళారా చూడలేని, చేతులారా చేయలేని కఠినాత్ములుగా, సకల సంపదలుండీ అయిన వాళ్ళను ఆదరించలేని నిరుపేదలుగా మారుతున్నారు.

అటు తలిదండ్రుల్లోను, ఇటు యువతలో మార్పురావాల్సి ఉంది. చదువుకొనే సమయంలోతమ పిల్లలకు అలనా పాలనా తల్లిదండ్రులు అందించాల్సి ఉంది. ఆ విధంగా తల్లిదండ్రుల విలువను ఆనాడు తెలుసుకొని పెరిగి నేడు యువతగా తల్లిదండ్రులను ఆదరించాల్సిన అవసరాన్ని గ్రహించి తీరుతారు.

గతంలో యువతే తమ శక్తి సామర్థ్యాలు, ప్రతిభా పాటవాలతోఉన్న వూరికి, మన దేశానికి గొప్ప పేరు తెచ్చిపెట్టిన మహనీయులెందరో ఉన్నారు. వారిని నేటియువత ఆదర్శంగా తీసుకోవాలి. ప్రస్తుత పరిస్థితులలో పరాయి దేశాలలో సంపాదించుకొన్నప్పటికిని అప్పుడప్పుడూ పండుగవంటి పర్వదినాలలోనైనా తమ పుట్టినూరులో తల్లిదండ్రులు, బంధుమిత్రులతో గడిపి ఆనందాన్ని పంచుకోవాలి. అలాగే జీవితాంతం పరాయి దేశానికే పరిమితం కాకుండా తను సంపాదించిన సంపాదనతో– సంధ్య వేళల్లో పక్షులు గూళ్ళకు చేరినట్లుగా– విశ్రాంత జీవితాన్ని స్వంత దేశంలోనే ప్రశాంతంగా గడపాలి. అసలైన భారతీయులనిపించుకోవాలి. అలాగే యువత తల్లిదండ్రులూ అంతులేని ఆశల నడుమ తమ పిల్లల మరపురాని బాల్యాన్ని దూరం చేయకుండా కాపాడాల్సిన అవసరం ఉంది.

**అమ్మిన వెంకట అమ్మిరాజు, సెల్: 9440708656**

## "ఎక్స్‌రే" అవార్డు కవితలకై ఆహ్వానం

"ఎక్స్‌రే"జాతీయ స్థాయి అవార్డుకు కవితలను ఆహ్వానిస్తున్నది. ***ప్రధాన అవార్డుకు ఎంపికైన కవితకు పదివేల రూపాయల నగదుతో పాటు, జ్ఞాపిక, సత్కారము, మరో పది కవితలకు ఉత్తమ కవితా పురస్కారాలు.*** *కవితా వస్తువు, పరిధి విషయంలో కవికి పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. సుదీర్ఘ కవితలను పరిశీలించరు. కవితలను నవంబరు 30వ తేదీలోగా ఎక్స్‌రే, డోర్ నెం. 28-15-2, దాసువారి వీధి, అరండల్‌పేట, విజయవాడ-2 చిరునామాకు పంపాలి.* **వివరాలకు సెల్: 9848448763- కొల్లూరి, అధ్యక్షుడు, 'ఎక్స్‌రే'**

## "ప్రకాశంజిల్లా రచయితల సంఘం స్వర్ణోత్సవాలకు ఆహ్వానము

ప్రకాశం జిల్లా రచయితల సంఘం, స్వర్ణోత్సవ సభలకు తెలుగు కవులు, రచయితలను ఆహ్వానిస్తున్నట్లు సంఘం అధ్యక్షులు బి. హనుమారెడ్డి తెలిపారు. సంఘాన్ని స్థాపించి 50 సం॥లు పూర్తయిన సందర్భంగా 2016 సం॥ జనవరి 8,9,10 తేదీలలో ఒంగోలులోని టి.టి.డి కళ్యాణ మండపంలో మూడు రోజులపాటు నిర్వహించే స్వర్ణోత్సవాలలో జాతీయస్థాయిలోని ప్రఖ్యాత కవులు పాల్గొంటున్నట్లు తెలిపారు. సాహిత్య సభలు, జాతీయ కవి సమ్మేళనం, ప్రతినిధుల కవి సమ్మేళనం, తెలుగు సంస్కృతిని ప్రతిబింబించే సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేసినట్లు తెలిపారు. ప్రకాశం జిల్లా రచయితల సంఘం స్వర్ణోత్సవ సభలలో పాల్గొన్న ప్రతినిధులకు స్వర్ణోత్సవ జ్ఞాపిక, ప్రశంసా పత్రంతో పాటు మూడురోజులు ఉచిత భోజన, సాధారణ వసతి సౌకర్యం కల్పిస్తారు. **ప్రతినిధులుగా పాల్గొనదలచే కవులు, రచయితలు 100/- లు ప్రతినిధి రుసుముతో పొన్నూరు వేంకట శ్రీనివాసులు, ప్రధాన కార్యదర్శి, ఇంటి నెం. 33-1-5, తిరువెంగళం పిళ్ళై వారి వీధి, ఒంగోలు-523 001. ప్రకాశం జిల్లా, సెల్: 9440432939,email: srinivasulu, ponnuru@gmail.com ని సంప్రదించవలసినదిగా ఆయన కోరారు.**

## ఆంగ్లభాష మోజులో అమ్మభాషకు తూట్లు

**రోజు** రోజుకూ పెరుగుతున్న ప్రయివేట్ ఆంగ్ల మాధ్యమ పాఠశాలల్లో విద్యార్థులు ఎక్కువగా చేరుతున్నారు. మాతృభాషలో(తెలుగు మీడియం) ఉన్న ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థులను చేర్పించేందుకు తల్లిదండ్రులు ఇష్టపడడం లేదు. మన ప్రభుత్వ పాఠశాలల్లో చదివిన విద్యార్థులెందరో కార్పొరేట్ పాఠశాలలకు దీటుగా ర్యాంకులు సాధిస్తున్నారు. కాకపోతేఆ పాఠశాలలకు సరైన ప్రచారం లేకపోవడం వల్ల అవి వెనకబడి పోతున్నాయి. అదే కార్పొరేట్ విద్యాసంస్థల్లో చదివిన విద్యార్థులెవరైనా ఎంసెట్, ఐ.ఐ.టి. జె.ఇ.ఇ.లో మంచిర్యాంక్ సాధిస్తే వారి గురించి ఎక్కువప్రచారంచేసుకొని కార్పొరేట్ పాఠశాలల యాజమాన్యాలు విద్యార్థులను అడ్డుపెట్టుకొని తల్లిదండ్రుల నుంచి డబ్బుఉల ఎక్కువగా గుంజుతూ సంపాదనే ధ్యేకంగా పనిచేస్తున్నాయి.మన ప్రభుత్వ పాఠశాలలకు, కార్పొరేట్, ప్రయివేటు పాఠశాలలకు ఉన్న తేడా ఇదీ. నేడు రెండు తెలుగు రాష్ట్రాలలో నిరుపేదవాడు ప్రభుత్వ పాఠశాలలోనే చేరుతుండగా, పేదవారు, మధ్యతరగతివారు, ప్రయివేటపాఠశాలల్లో, ధనవంతులు దేశస్థాయిలో మంచి పేరున్న పేరుపొందిన కార్పొరేట్ పాఠశాలల్లో తమ పిల్లలను చదివిస్తున్నారు. తెలంగాణ ప్రభుత్వం తల్లిదండ్రుల కోరికప్రకారం కె.జి. నుండి పి.జి. ద్వారా కేంద్రస్థాయి విద్యగా ఈ విద్యాసంవత్సరం నుండి ఆంగ్ల మాధ్యమ పాఠశాలలను ప్రోత్సహించింది. పేద విద్యార్థులకు సైతం ఆంగ్ల విద్య అందుబాటులో ఉండాలని ప్రభుత్వ ఉద్దేశ్యం. ప్రయివేటు, కార్పొరేటు విద్యాసంస్థలకూ పోటీగా ప్రభుత్వ పాఠశాలలు ఉండాలని ప్రభుత్వ భావన. అయితేమంచిదే. ఫీజులు లేకుండా ఉచిత విద్య అందించడం అందరికీ ఆనందదాయకం.

అయితే– ఆంగ్ల మాధ్యమ పాఠశాలల్లో కూడా తెలుగును ఒక సబ్జెక్టుగా నేర్పి తీరాలి. అదీ మొక్కుబడిగా గాక పటిష్ఠంగా నేర్పాలి. అదే సమయంలో ప్రభుత్వం నిర్వహిస్తున్న తెలుగు మాధ్యమ పాఠశాలలను కొన సాగించాలి.అప్పుడు తల్లిదండ్రులకు – తమపిల్లలను ఏ మాధ్యమంలో చేర్పించాలో వీలుంటుంది.

స్మృతి మంజూష-4

# మొల్ల

- డా॥ సోమసుందర్ ఆవంత్స

సమకాలీన ప్రబంధ కవులతోనూ, పూర్వకవులతోనూ కవయిత్రి 'మొల్ల'అనేకచోట్ల విభేదించి స్వతంత్రించడం స్పష్టంగా కనిపిస్తుంది. పూర్వకవి స్మృతికి లాంఛనంగా ఒక్క తేటగీతిని మాత్రమే కేటాయించింది. కాలప్రభావాన్ని విసర్జించి రసిక పద విశేషణంతో శ్రీనాథుని స్తుతించింది. ఏమీ విశేషణాలు లేకుండానే రంగనాథుని పేర్కొంది. అంటే ఆమె రంగనాథ రామాయణం చదివింది. అన్న సాక్ష్యానికే శ్రీనాథుని సందర్భంలో కవి సార్వభౌమ బిరుదును, పేర్కొననివారు లేరు. కాని, ఏ విధంగా సర్దినా ఆగీత పద్య ఛందానికి లొంగకపోవడం కూడా కారణం కావచ్చు. బ్రతికున్న రోజులలోనే కవయిత్రిగా మొల్ల గొప్ప స్థానాన్ని అందుకోలేకపోయిందా అనే సంశయం కల్గుతుంది. కేవలం ఒక స్త్రీ అని మాత్రమే న్యూనతాభావం ప్రదర్శించారా? ఆమెను సర్వకవి ప్రపంచము విస్మరించడం సందేహాస్పదం అయినదే, ఏకవిపేర్కొనక పోయినా, ఏ ఒక్క శాసనంలోనూ ఆమె పేరు ఉటంకించమనకపోయినా ఏకామ్రనాథుని ప్రతాపరుద్ర చరిత్రలోనూ దానిననుసరించి వెలువడిన క్రీ॥శే॥ సర్వప్ప రచించిన సిద్దేశ్వర చరిత్రలోను మాత్రం మొల్ల కాకతీయ ప్రభువగు రెండవ ప్రతాపరుద్రుని ఆస్థాన కవయిత్రిగా వివరించబడడం గౌరవప్రదమే.

కాని, ఆవిధంగా పేర్కొనబడిన మొల్ల రామాయణ రచయిత్రి అవునో, కాదో నిర్ధారణ కావడం లేదు. ఏమైనా దొరికిన ఆధారాలతో మొల్ల కవయిత్రి. క్రీ॥శ.1310లో జన్మించింది. డెబ్బై ఏళ్ళు బ్రతికి 1980 ప్రాంతంలో కాలధర్మం చెంది ఉండవచ్చునని పరిశోధకులు భావిస్తున్నారు.

మొల్లను గురించి జనశ్రుతంగా ప్రచారంలోగల కథలు ఒకదానితో ఒకటి పొసగడంలేదు. కొన్ని పరస్పర భిన్నంగా తయారై కాలక్రమాన్ని నిర్ధారించుకోవడానికి అభ్యంతరం అవుతున్నాయి. తిక్కన్నగారి తండ్రి కొమ్మనామాత్యునకు ఒక కుమ్మరస్త్రీ ఉంపుడుగత్తెగా ఉండేదని, ఆమె ద్వారానే మొల్ల, గురునాథుడు జన్మించారని, ఒక గాథ. కాని, తిక్కనగారికే ఒక కుమ్మరస్త్రీతో అక్రమసంబంధం కలదని, ఆవిధంగా జన్మించినవాడే గురునాథుడు అని మరోగాథ. అతనికి ఆయనే విద్యాబుద్ధులు నేర్పి తన భారత రచనలో వ్రాయసగానిగ ఉపయోగించాడు అని మరోగాథ.

ఈ కథ ఆధారంగానే మహాకథకులు మల్లాది రామకృష్ణశాస్త్రి ఒక కమనీయగాథ కల్పించారు. అసలు మొల్లపేరుకు పూర్వస్థానంలో ప్రచారంలో ఉండే పదం. 'కుమారి'కి అపభ్రంశం అయి కుమ్మరిగా పరివర్తనం అయ్యిందేమోనని భాషావేత్తలు పరిశీలించాల్సిన అంశము అని కొందరు అన్నారు. కాని, ఆంగ్లభాషా ప్రభావం ఏర్పడిన తర్వాతనే మిస్‌కు సమానార్థంగా కుమారి అనే పదం వాడుకలోకి వచ్చిందితప్ప తత్పూర్వం ఎక్కడా కన్పించదు.

శ్రీ ఆరుద్ర తన సమగ్రాంధ్ర సాహిత్యంలో మొల్ల రచనా పద్ధతిని శైలి విన్యాసాన్నీ అనుసరించే కాలనిర్ణయం చేశారు. ఆ పద్ధతి సరియైనదికాదని, ఆచార్య నాయని కృష్ణకుమారి వక్కాణించారు. ఆరుద్ర పేర్కొన్న 'వలిపేవునన్నపైయ్యేదను' అనే పద్యంలో పౌరాణిక శైలి కానరాదని ప్రబంధశైలి విన్యాసకళాస్పర్శలు గాఢంగా కన్పిస్తాయి. అని కనుక ఆమె పద్నాలుగు, 15శతాబ్దాలకు చెంది వీరంతా చూపెట్టిన ఉపపత్తులు విశ్వసనీయంగా కన్పించవు. ములిగిపోతాయేమోననే భయం అంత అవసరమైనది కాదు. ఇంత అల్పమైన విషయానికి పెద్ద పెద్ద కొండలు త్రవ్వవలసిన పనిలేదు. తీరా త్రవ్వి ప్రయోజనం కన్పించదు.

సమకాలీకులైన కొరవిగోపరాజు, గౌరన అనంతామాత్యుడు పిల్లలమర్రి పిన వీరన్న నంది యల్లయ్య, ఘంటసింగయ్య, దోబగుంట నారాయణకవి, ఇత్యాదుల నెవ్వరిని, మొల్ల పేర్కొనలేదు. దీనిని ఒక ఘాటు హేతువుగా స్వీకరించి, పరిశోధకులు ఆ కవయిత్రి కాల నిర్ణయం చేయడం సబబు అయినదేనాపైన పేర్కొన్న కవులలోఎవరైనా గాని, ఇతరేతర కవులు, ఎవరైనాగాని, మొల్లను తన పూర్వపు కవిగా పేర్కొన్నారు. అనే సత్యాన్ని స్పర్శించనే లేకపోయారు. శ్రీనాథుని రసికుడు అని మాత్రమే- పేర్కొని కవి సార్వభౌమునిగా తలపోయని కారణంగా - శ్రీనాథునికి ఆ బిరుదు లభించకముందే మొల్ల ఉన్నదని తన రామాయణ కావ్యం రచించింది అని నిర్ణయించడంలోఆ ఔచిత్యం ఉంటుందా? అన్న అనేక విషయాలు చర్చించవలసిన అవసరం ఉంటుంది. కాని, ఇంత చరిత్ర తవ్వడం లేశమాత్రమైన కాలనిర్ణయానికే కదా!...

# కొనకళ్ళ బంగారుమామ పదాలు

**బం**గరుమామ పదాలు అసదృశ సురభిళగుచ్ఛాలు అసమాన కవితామాధుర్యంతో అసమాన్య అనుభవ సారళ్యాలే ప్రతిపాతంలో తొణికిసలాడుతుంది. అపూర్వకవితా మాద్వీక రసం అలవోకగా సామాన్య పదాల బలహీన శరీరాలపై లేపనమందిస్తుంది. అనుభూతిని పదాలలో దట్టించి, సుందరమూర్తులుగా నిలిపిన కవి కొనకళ్ళ వెంకటరత్నం, కృష్ణశాస్త్రి అంతటివాడ్ని ఆశ్చర్యానందాలలో ముంచాడు. నిండు హృదయంతోచలం అందించిన నీరాజనాలు అందుకున్నాడు.

1940ల నుంచి శ్రీ బి.వి. నరసింహారావు, గజ్జె కట్టి స్త్రీ వేషధారుడై నాట్యం చేయనారంభించాడు. ఆయనకు ఉపాలంభమైన ఆ పాఠాలు ప్రజల హృదయాలలో కొత్త తలపులు తెరిచాయి. ఎందరో యువనాట్యకాకులకు ప్రత్యేకం కలిగించాయి. 'మంఎకాడ కలుసుకో మరువకు మావయ్య' సుక్కలన్ని కొండమీద షోకు చేసుకునే యేల మరచిపోకు మరచిపోకు మావయ్యే' అంటూ విరహార్ద్ర హృదయాన్ని ఆవేశంగా అభివ్యక్తం చేసే బంగరు పిల్లను ప్రశ్న చేసుకుంటూనే ఉండేవారు శ్రోతలు.

శ్రీ నటరాజ రామకృష్ణ తన నాట్య ప్రదర్శనోపన్యాసాలలో 1960 వరకు కొనకళ్ళ గీతం ఒక్కటైనా స్వీకరించకుండాముగించేవాడు కాదు. ముఖ్యంగా మొక్కజొన్న తోటలో- ఎందరో బంగరుమామ పదాల ఆధారంతోజానపద నృత్య ఫణితులకు సభాగౌరవంకలిగించి, ధన్యులయ్యారు. ఇంత ప్రాముఖ్యత పొందిన ఆ పదాలు- సర్వవిధాల మరుపురాని మంచి కవితలలో ఉత్తమస్థానం ఆక్రమిస్తున్నాయి.

బంగరిపిల్ల వంటిస్నిగ్ధహృదయిని, ముగ్ధమనోహరి, ఒక్క ప్రియురాలు, లభిస్తేచాలదాఈబ్రతుకుపండడానికి అని యువహృదయాలు ఉవ్విళ్ళూరేవి. ఈ పదాలు బ్రతుకును మరింత ఉత్సాహజనకంగా మార్చేవి. ఆ పాటలు రసించనివాడుండేవారేకాదు. ఆ పాటలు విడిచిన నీడలు గుండెల్లో వచారులు చేస్తా బెంగటిల్ల చేస్తాయి. గ్రామీణ జీవితంలోమాత్రమేలభించే సౌందర్యాలు, స్నేహాలు, సౌమనశ్యాలు అలవోకగా ప్రత్యక్షం చేసి, కొనకళ్ళ సమ్మోహనాస్త్రం ప్రయోగిస్తారు.

**రచయిత ఫోను : 93478 48905**

# నాగరిక నిరక్షరాస్యులు

**–దుగ్గిరాల రాజకిశోర్**

"**జ**నాభా లెక్కలో వేసినట్లు తెలుగున సంతకము చేయగల వారందరూ చదువు వచ్చినవారే అని ఒప్పుకున్నా తెలుగువారిలో చదువుకున్నవారు వేయింటికి డెబ్బైయైదుగురు మాత్రమే. అంటే వేయింటికి తొమ్మిది వందల ఇరవై ఐదుగురు తెలుగువారు సంతకమైనా చేయలేరు అన్నమాట. ఒక కార్డు మీద చిన్న ఉత్తరమైనా వ్రాయలేని వారు 'రైల్వే టికెట్' మీద ఏ ఊరి పేరున్నదో చదువుకోలేనివారు వెయ్యింటికి 925 గురు ఉన్నప్పుడు తెలుగు జాతివారు నాగరికులని చెప్పడానికి నాలుక తిరుగుతుందా? యూరపు ఖండములో ఈ కాలమున 'న్యూస్ పేపరు' చదవలేని వారిని కిరాతులుగా ఎంచుకొంటారు. అంతమట్టుకు చదవడము, వ్రాయడము అక్కడ సర్వసామాన్యమయినవి."

పై మాటలు వ్యావహారిక భాషోద్యమకర్తగా ప్రసిద్ధి గాంచిన శ్రీ గిడుగు రామమూర్తి పంతులు గారు తన "నేటి తేట తెలుగు" అన్న వ్యాసములో వ్రాసినవి. ఈయన ఈ వ్యాసమును వందేళ్ళ క్రితం అంటే క్రీ.శ. 1913లో వ్రాశారు.

కిరాతుడు అంటే బోయవాడు. అంటే ఆటవిక దశలోనున్న అనాగరికుడు. వందేళ్ళ క్రితం అప్పటి సామాజిక స్థితిననుసరించి మనదేశంలో అధిక శాతం ప్రజలు వారి వారి వృత్తులలో వంశపారంపర్యముగా జీవనము సాగిస్తున్నారు. కాబట్టి ఎక్కువ మందికి చదవడమూ, వ్రాయడమూ రాని నిరక్షరాస్య స్థితి నాటి సమాజములో సహజము.

మరి నేడు మన సమాజములో ఎన్నో రకాల మార్పులు చోటుచేసుకున్నాయి. ఎన్నో రంగాల్లో చెప్పుకోదగ్గ ప్రగతిని మనము సాధించేము. అయినప్పటికీ శ్రీ గిడుగు రామమూర్తి గారు పేర్కొన్న కిరాతులు అనగా నిరక్షరాస్యులు నేటికీ మన సమాజంలో ఉన్నారు. నాటి సంఖ్యతో పోలిస్తే వీరి సంఖ్య కూడా తక్కువేమీ కాదు. వీరెవరిలోనూ పూర్వపు వృత్తివిద్యా వాసనలు లేవు. అవంటే ఏమిటో కూడా వీరికి తెలియదు. పైగా వీరు నాగరికులు. వీరికి ఆంగ్లమును ఉగ్గుపాలతోనే పట్టిస్తారు. హిందీ వంటి ఇతర భారతీయ భాషలను వీరు చక్కగా చదవగలరు, వ్రాయగలరు. వారి వారి పాఠ్యాంశాలలో తోటి వారితో పోటీపడుతూ ఎప్పటికప్పుడు తమ నైపుణ్యానికి పదను పెట్టుకుంటూంటారు. కానీ వీరు తెలుగులో నిరక్షరాస్యులు.

ఆధునిక నిరక్షరాస్యులైన వీరు నేటి తరం బాలబాలికలు. వీరంతా మోడ్రన్ మమ్మీల ఒడిలో ఆధునిక ఆంగ్ల కలల సౌధాలను నిర్మించుకున్నవారు. వీరి తల్లిదండ్రులకు తెలుగుపై నామోషీ కన్నా ఆంగ్లముపై వ్యామోహము ఎక్కువ. వారి పిల్లలను ఆంగ్లములో ముంచి తరింపజేయడానికి తెలుగుకి తగినంత దూరంలో ఉంచాలనుకుంటారు. నేటి విద్యావిధానము కూడా ఆంగ్లోపాసనతోనే రూపు దిద్దుకున్నది.

"మీకు తెలుగు చదవటం వచ్చా?" అని అడిగితే "అబ్బా తెలుగా!" అని చులకనగా మూతివిరిచే పిల్లలు. "అయినా తెలుగు ఎందుకు పనికి వస్తుంది?" అని అసహ్యపు వెటకారాన్ని చిట్లించే తల్లిదండ్రులు. ఇదీ నేటి పరిస్థితి.

పోనీలే చదవటం, వ్రాయటం రాకపోయినా మాట్లాడటమైనా తెలుగులో చేస్తున్నారు కదా అనుకుంటే ఆ సంతోషం కూడా ఎక్కువ కాలం నిలిచేట్టులేదు. ఒక స్కూల్‌లో ఇద్దరు చిన్నారులు విరామ సమయంలో తెలుగులో మాట్లాడుకున్నారని ఆ తరగతి ఉపాధ్యాయిని "తెలుగులో మాట్లాడటం మేము చేసిన తప్పు. ఇకమీదట అలా చేయం" అని వ్రాసిన పలకను వారి మెడలో వ్రేలాడదీయించింది. మరొక పాఠశాలలో తెలుగులో మాట్లాడిన నేరానికి ఒక విద్యార్థిని చేతులపై ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు వాతలు పెట్టాడు. ఇటువంటి సంఘటనలు మనం తరచుగానే చూస్తుంటాం.

తెలుగులో మాట్లాడినందుకు తమ పిల్లలను శిక్షించినందుకు వారి తల్లిదండ్రులు ఆయా పాఠశాలల యాజమాన్యాలపై పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేస్తారు. మీడియాలో శాపనార్థాలు పెడ్తారు.

అయినా పాఠశాల యాజమాన్యాల వారేం తక్కువ తిన్నారా? ఈ గొడవంతా ఎందుకని అనుకొన్నారేమో. కొత్త పద్ధతి మొదలుపెట్టేరు. అదేమిటంటే ఏ విద్యార్థి లేదా విద్యార్థిని అయినా సరే తెలుగులో మాట్లాడితే వారికి జరిమానా విధిస్తున్నారు. ప్రతిసారీ జరిమానా కట్టాలంటే ఎలా? కాబట్టి తల్లిదండ్రులే తమ పిల్లలను బడికి పంపించేటప్పుడు 'తెలుగులో వద్దు, ఇంగ్లీషులోనే మాట్లాడుకోండమ్మా' అని వారికి నీతులు చెప్పి మరీ పంపిస్తున్నారు. తెలుగు మాట్లాడకపోతే పోయె. తమ పిల్లలకు అయ్యవార్లు వేసే శిక్షలన్నా తప్పుతాయి కదా. మరి నేటి తలిదండ్రులు నిర్మించుకున్నవి ఇంగ్లీషు కలల సౌధములాయె. ఈ స్థితి నేడు పల్లెటూళ్ళలో కూడా వుంది.

ఆ మధ్య ఒక టివి ఛానెల్‌లో ఓ వార్తా కథనం ప్రసారమయ్యింది. గుంటూరు జిల్లాలో యూదు సంతతికి చెందిన వారు 40 మంది వరకూ ఉంటున్నారు. వారు కొన్ని తరాల క్రితమే అక్కడ స్థిరపడ్డారు. వారు స్వచ్ఛమైన తెలుగులో మాట్లాడుతారు, చదువుతారు, వ్రాస్తారు. అయినా తమ మాతృభాష అయిన హిబ్రూపై మమకారం కొద్దీ ఇజ్రాయిల్ నుండి ఒక టీచరుని పిలిపించుకుని మరీ శ్రద్ధగా ఆ భాషలో చదవటం, మాట్లాడటం, వ్రాయటం నేర్చుకుంటున్నారు.

బడి కెళ్ళే పిల్లలు రోజులో ఎక్కువ కాలం గడిపేది పాఠశాలలోనే. అక్కడ ఏ వాతావరణం ఉంటుందో అదే వారి జీవితాలపై తన ప్రభావాన్ని చూపుతుంది. మరి తెలుగే లేని పాఠశాల వాతావరణం మన పిల్లలపై ఏ ప్రభావాన్ని చూపుతోంది? వారు ఎటువంటి పౌరులుగా రూపొందుతున్నారు? రేపు వినడానికైనా వారికి నాలుగు తెలుగు మాటలు అర్థమౌతాయా? ఇదీ శ్రీ గిడుగు రామమూర్తి గారు తమ భావమును వెలిబుచ్చి వందేళ్ళు గడిచిన తరువాత మనం సాధించిన ఆధునిక ప్రగతి! మనం మురిసిపోతున్న నాగరికత! మన బడులలో మనమే రూపొందించుకొన్న విద్యావిధానంతో ఎంచక్కా తెలుగు నిరక్షరాస్య కిరాతులను తయారుచేసుకుంటున్నాం. You don't have to burn books to destroy a culture. Just get people to stop reading them. అంటే ఒక సంస్కృతిని నాశనం చెయ్యడానికి ఆ సంస్కృతికి చెందిన గ్రంథాలను తగులబెట్టనవసరం లేదు. అక్కడి ప్రజలు వాటిని చదవకుండా చేస్తే సరిపోతుంది. ఈ మాటలు అన్నది అమెరికాకు చెందిన ప్రముఖ సైన్స్ ఫిక్షన్ రచయిత రే డగ్లస్ బ్రాడ్‌బరీ.

మన పిల్లలను తెలుగు చదవకుండా, వ్రాయకుండా, కనీసం మాట్లాడకుండా చేస్తున్నాం. మరి మన సంస్కృతికి చెందిన విలువలను, మన సాహితీ వైభవాన్ని తరువాత తరాలకి ఎలా అందించగలం?

తెలుగు భాషకు ప్రాచీన హోదా సంపాదించుకున్నామని మురిసిపోతున్న మనం అసలు తెలుగే వినబడని వాతావారణాన్ని భద్రంగా భావి తరాల చేతుల్లో పెడుతున్నాం కదా!

**దుగ్గిరాల రాజకిశోర్, విశాఖపట్నం, సెల్: 8008264690**

చిత్తూరు కత

- ఐతం దివాకర్

# నానాటి బతుకు

**'గుడిలో** పాటలు పెట్టి ఎంతచేపు అయింది. ఇంకా దున్నపోతు మాదిరి నిదర పోతుండారు చూడు. ఒరేయి లెయ్యండ్రా గంట అయిదు అయింది' అని మమ్మల్ని లేపతా మా అమ్మ కల్లాపు చల్లేదానికి తెరువుకు పొయింది.

మా ఎగువ మిట్టాలంలో తెల్లవారితో నాలుగూ నాలుగున్నరకంతా గుడిలో పాటలు పెట్టిస్తురు. ఆ పాటల్ని వినినాకనే అందరూ నిదర లేచి వాళ్ల వాళ్ల పనిలకు పోతురు.

'కన్నక్కా' అని ఎదురింటిలో గాంది మామ, మా అమ్మను పిలిచినాడు. 'ఏమి గాందీ' అని మా అమ్మ అడిగింది.

'ఎనుమలగుండు చేనిలో చెనిక్కాయ పెరకాల. పిలకాయలు ఉంటే అంపించు కా. రెండు చాలులు పెరికిపెట్టితే అనేక నువ్వు వచ్చి విడిపిస్తువు' అనినాడు గాందిమామ.

'ఏడ గాందీ, వాళ్లు ఇంకా నిదరపోతానే ఉండారు. ఊరిలోఉండే పిలకాయిలంతా తెల్లవారతానే లేచి ఎంత పని చేస్తురు. వీళ్లేమో ముడ్డికి ఎండ వచ్చేవరకూ నిదరపోతుంటారు. అంతా వాళ్ల నాయన ఇచ్చే చెల్లెం. నువ్వే వచ్చి లేపి కూడనే తొడుకోని పోరా' అనింది అమ్మ.

పణుకొనే నేనూ నా తమ్ముడూ, అమ్మ మాటలనీ మామ మాటలనీ వింటా ఉండాము. ఇంకా పణుకొని ఉంటే ఒదవులేదని అనుకొంటా ఉండంగానే, 'ఒరేయి దివా, దాసూ లేయండ్రా. మా చేలిలో చెనిక్కాయి పెరకాల, రండ పోవచ్చు' అంటా ఇంట్లోకి వచ్చినాడు మామ. మేము ఇద్దరూ లేచి మూతిలు కడుక్కొని వచ్చితిమి. అంత చేపులోనే మానాయన కట్టకాపీ పెట్టి ఉండాడు. మాకు ఇద్దరికీ చిన్న చొంబుల్లో కట్టకాపీని పోసిచ్చి 'తాగేసి పోండ్రా' అనినాడు. కాపీ తాగి అయిన తోడనే 'మామా పోదుమా, ఏ చేనిలో చెనిక్కాయి పెరకాల' అని అడిగితిని. 'ఎనుములగుండు చేనిలోరా' అంటా మా ఇద్దరుని తోడుకొని పోయినాడు గాందిమామ.

'మనిచికి ఒక చాలు పట్టి ఎండ వచ్చేక ముందే బినబిన్నగ పెరికి కుప్పగ వేయండ్రా' అని చెప్పినాడు మామ. సరి అనేసి నేనొక చాలూ దాసు ఒక చాలూ పట్టుకొంటిమి. ఒక

ఎనిమిది చేతులు పాటుపడితేనే, నాలుగు కడుపులూ దినానికి రెండుపూటలు నిండేది ఇక్కట్టుగా ఉండాది. నానాటి బతుకు కూటికి చాలనట్టే ఉండాది. ఈ చెనిక్కాయిలని ఉడకేసుకొని తినేస్తే, ఎసుటిలోకి బియ్యమెట్ట, తట్టలోకి కూడెట్ట' అనింది అమ్మ.



చాలు అంటే ఒక ఎద్దులు బండి పోయే అంత అగలం.

'దాసూ, నువ్వు మొదటగా పెరికి కుప్ప వేస్తువో, నేను మొదటిగా పెరికి కుప్ప వేస్తునో చూడచ్చా' అని అడిగితిని మా తమ్ముడు దగ్గిర. 'సరినా చూసుకోవచ్చు' అంటా మడమడని చెనిగ చెట్లని పెరికేస్తా ఉండాడు దాసు. నేనునూ పనికి వంగితిని. మా పక్కన ఉండే చాలులో గాంది మామ పెరికేస్తా ఉండాడు.

'దివా, నువ్వు ఎన్నోవది, మీ తమ్ముడు ఎన్నోవది చదివేది' అని అడిగినాడు మామ పని చేస్తానే.

'నేను ఎనిమిదోవది, దాసు అయిదోవది చదవుతా ఉండాము మామా' చెప్పితిని.

'ఈ పొద్దు పల్లెంకు పోలేదారా' అడిగి నాడు మామ.

'ఈ పొద్దు శనివారం పల్లెంకు విడుపు. ఇంక సోమారం పోవాల'దాసు చెప్పినాడు. ఇట్ట మాటాడుకొంటానే చెనిగ చెట్లను పెరి కేస్తిమి. అంతా ఎత్తి ఒక దగ్గిర కుప్పగావేస్తా ఉండే అప్పుడు,'మీ అమ్మ చద్దికూడు ఎత్తుకోని వస్తా ఉంది, పొయ్యి తినేసి రాపోండ' అని నాడు మామ.

మేము ఇద్దరూ లేచి చేతులు కడుక్కోని వచ్చి చద్దికూడు తినేదానికి పరుబు మీద కూచుంటిమి. మా అమ్మ మా ఇద్దరికీ దోసిల్లో కూడు వేస్తా 'గాందీ రారా చద్ది తింటువు' అని మామని పిలిచింది.

'లేదుకా, వాళ్లకు వెయ్యి. ఇంక కొంచే పులో అమ్మ చద్దికూడు ఎత్తుకోని వచ్చేసు' అని చెప్పినాడు మామ.

'కొంచెగద్దు తింటువు రారా' అని తిరిగి పిలిచింది అమ్మ. మేము కూడా 'రా మామా తింటువు' అని పిలిస్తిమి. మామ లేచి వచ్చి నాడు. అమ్మ మామ దోసిల్లోనూ కూడు వేసింది. అందరుమూ ఎనుములగుండు నీడలో కూచుని తింటా ఉండాము.

అప్పుడు దాసు ఉండుకొని, 'మామా, ఈ గుండును ఏల ఎనుములగుండు అనేది' అని అడిగినాడు. 'తినేసి రండ, చెనిక్కాయి విడిపిస్తా చెప్పుతును' అనినాడు మామ.

అందురుమూ తినేసి, చెనిక్కాయ విడి పించేదానికివచ్చి కూచుంటుమి. అప్పుడు మామ ఉండుకోని ఎనుములగుండు కతను చెప్పినాడు.

'ఓ కాలాన ఈ గుండు, అద్దో ఆ పక్కన ఉండే కొండపైగా ఉండిందంట. ఒక తూరి మూడునాళ్లు రెయ్యాపగలు ఒకే వాన కురిసిం దంట. ఆ వానకు కొండపైగా ఉండిన బండల గుండుల కింద ఉండే మన్ను అంతా నాని కొట్టుకోని పోయిందంట. వాన తగ్గినాక ఊర్లోని ఎనుములు అన్నీ ఈడకు వచ్చి మేస్తా ఉండాయంట. అప్పుడు ఈ గుండు పైగా నుండి పొల్లుకోని వచ్చి ఎనుముల పైగా పడిం దంట. దానివల్ల ఎనములు అన్నీ చచ్చిపోయి నాయి. అప్పటినుండి దీనిని ఎనుములగుండు అని పిలస్తా ఉండారంట.'

మామ చెప్పి అయినాక అమ్మ ఇట్ట చెప్పింది, 'ఈ కతనే ఊర్లో నిండావాళ్లు చెప్పు తురు. అయితే అది ఏ కాలాన నడిచిందో చూసినవాళ్లు ఎవురూ ఇప్పుడు లేరు. మన ఊర్లోఉండే తూమాటి క్రిష్ణసామినాయుడు వాళ్లది ఆ కాలాన పెద్ద సొత్తు అంట. నూరు కాణిలకు పైగా నేల ఉండిందంట. నేను ఈ ఊరుకు కోడాలయి వచ్చే అప్పటికే ఇంకా అరవై కాణిలు ఉండింది. రానురాను వాళ్ల సొత్తు తగ్గిపోయింది. అయితేనూఈ పొద్దుకే మంచి చెల్లువాక్కు ఉండే కుటుంబం వాళ్లది. వాళ్లకి అప్పుడు ఏబై అరవై ఎనుములు ఉండి నాయి అంట. అన్ని ఎనుములని కట్టేదానికి ఊర్లోగా దొడ్డి లేకుండా, ఈ గుండు దగ్గిర కట్టిపెడుతురు అంట. దానికే ఈ గుండుకు ఎనుములగుండు అని పేరువచ్చింది అంటురు పెద్దోళ్లు.'

'ఈ గుండు కింద ఒక కొప్పర నిండా పొదిగిలి ఉంది అని చెప్పుకొంటురు. దానికే ఈ గుండును ఆ ఇంటివాళ్లు అమ్మేదేలేదు అంట. అట్ల అమ్మితేనూ దీనిని తీయాల అని తలచిన వాళ్లకి ఒళ్లు బాగలేకుంటా పోడుసును అంట. దానివల్ల ఎవురూ దీనిని తీసేలేదు' అన్నాడు గాందిమామ. ఇట్ట మాటాడుకొంటా చెనిక్కాయిలు విడిపిస్తా ఉండాము.

'దివా, దాసూ రాంద్రా, చెనిక్కాయి తీంగ లని ఎండేస్తుము' అంటా మామ లేచినాడు. మామతో చేరి కూడా మాడా తీంగలని ఎండేసితిమి. ఈ పనిలోనే పొద్దు పడమరకు వంగింది. గాందీమామ వాళ్ల అమ్మ ఉచ్చి పొద్దుకు కూడు ఎత్తుకోని వచ్చింది. అందురూ చోలుపుగా కూచుని కూడు తింటిమి. మాకు కూడు వేసేసి, కూటి యానాలని గంపలో పెట్టుకొని ఇంటికి పోడిసింది ఆయవ్వ. మేము కొంచెగద్దు చేపు మానునీడలో కూచుంటిమి.

అప్పుడు 'ఐస్ ఐస్' అని ఐసాయన ఐసు అమ్ముకోని చేనిపక్కన ఉండే దోవలో పోతా ఉండాడు. దాసు ఉండుకోని 'అమా అమా ఐసుకావాల, తీసమా' అని అమ్మని గెంజినాడు. నాకునూ ఐసు తినాలని ఉండినానూ అడగ లేదు. వాండికి తీసిస్తే నాకు తీసిస్తాదిలే అనుకొని గమ్మున్నే ఉండిపోతిని.

'నా దగ్గర దుడ్డు లేదురా. నన్ను ఉడ కాడించద్దు' అనేసింది అమ్మ. దాసు విడవ లేదు. 'మామా మామా నువ్వయినా తీసీ మామా' అంటా ఆడం పట్టినాడు. 'నా దగ్గర కూడా దుడ్డు లేదురా. కావాలంటే దోసడు దోసడు చెనిక్కాయిలని ఇచ్చేసి చెరొక ఐసు తీసుకో పోండ' అని చెప్పినాడు. సరే అని మనిచికి ఒక దోసడు చెనిక్కాయిలని ఎత్తుకోని పోయి ఐసు ఆయనకి ఇచ్చేసి, మనిచికి ఒక ఐసు తీసుకోని తింటా వచ్చితిమి.

'ఎట్టనో అడంపట్టి తీసేసిరి' అని అమ్మ తిట్టతా ఉంది. 'సరి పొద్దుపోతా ఉంది.

పాట

## తెలుగు మాధుర్యం

తెలుగు జాతి నాదంటు
తెలుగు వాణ్ణి నేనంటు
తెలుగు భాష మాదంటు
గళమెత్తి పాడుదాం
మన కీర్తిని చాటుదాం ॥తెలుగు॥

దేశమందెన్నెన్నో భాషలు వున్నా
మాతృభాష మధురిమకవి సాటిరావన్నా
సంగీత సాహిత్య సహస్రావధానాలకు
సాటిలేని మేటిభాష మన చక్కని తెలుగు
భాష ॥తెలుగు॥

నన్నయ్య తిక్కనాది వేలాది కవెలెందరొ
రచనలెన్నొ చేసినట్టి రమణీయభాషగా
ఇతిహాసప్రబంధాలు యింపుగ వెలుగొందే
వెయ్యేళ్ళ సాహితీ వైభవం మనదిగా
॥తెలుగు॥

తెలుగుభాష మాధుర్యం చవి చూడాలి
తెలుగు లోనే నిరంతరం మాట్లాడాలి
తెలుగు కీర్తి దిగంతాల వ్యాపించాలి
మాతృభాష పరిరక్షణ మహోద్యమం కావాలి

**ఎస్.వి.ఎస్.కె. త్రివిక్రమరావు,**
ఫోన్: 9290105891

బిన్నాగా వచ్చి చెనిక్కాయి విడిపించండ్రా' అన్నాడు మామ. అట్టనే నలుగురుమూ చేరి పొద్దు మునిగే వరకూ చెనిక్కాయ విడిపించి తిమి. విడిపించిన కాయిలని మూటకట్టినాడు మామ. ఒక నిండుమూట, ఒక అరమూట అయినాయి చెనిక్కాయలు. మా అమ్మ, అరమూటని చంకలో పెట్టుకొనింది. నేనూ దాసు పట్టి నిండు మూటని మామ తలకు ఎత్తితిమి.

కాయిలను ఎత్తుకొని వచ్చి కల్లంలో పోసితిమి. చెనిక్కాయిని విడిపించిన దానికి ఎనిమిదిలో ఒక బాగం ఇస్తురు మా ఊరులో. మేము ఇద్దరూ కూడా మాడా తీంగలు ఎండేసిన దానికి కొంచెం ఎక్కువగానే చెనిక్కాయిలు ఇచ్చినాడు మామ. బాగం వచ్చిన కాయల్ని మూటకట్టి చంకలోకి ఎత్తుకొనింది అమ్మ. మేము ముగ్గరుమూ ఊరిదోవను పట్టితిమి.

గువ్వలన్నీ గూడులలో ముడుక్కొనేసినాయి. వాటికి తోడుగా మా నీడలు కూడా పోయినట్టు ఉండాయి. నీడలు కూడా కానంత మబ్బులో నడస్తా ఉండాము.

'అమా అమా, ఇంటికి పోయినాక ఈ చెనిక్కాయిల్లో కొంచెం ఎత్తి ఉడకేసి ఇస్తువా మా' అని అడిగితిని నేను. మా అమ్మ ఏదీ మాటాడలేదు. 'చెప్పుమా చెప్పుమా' అంటా తిప్పి తిప్పి అడిగినాడు నా తమ్ముడు దాసు.

'గమ్మున్నే వస్తురా రారా రా. మీ తాతలు సంపారిచ్చి పెట్టుండే మడుల్లో చేనుల్లో పుట్లు పుట్లు పండించి గాదిలూ గరిసిలూ నిండబెట్టి ఉండాము. తిండికీ తిప్పకీ కొరలేదు. ఇంక ఈ చెనిక్కాయిలని ఉడకేసుకొని తినచ్చు, యేంచుకొనీ తినచ్చు. రాండ్రారే రాండ. కమ్మపుటక పుట్టి కూలిబతుకులు బతకతా ఉండాము. గుంట చేనులేక, మీ అబ్బ దున్న కాలకీ తోలకాలకీ పోతుండాడు. మీ అమ్మ కలుపులకీ కోతలకీ పోతుండాది. చాలని దానికి ఇద్దరు బిడ్డలనీ కూలికి అంపిస్తా ఉండాది. ఎనిమిది చేతులు పాటుపడితేనే, నాలుగు కడుపులూ దినానికి రెండుపూటలు నిండేది ఇక్కట్టుగా ఉండాది. నానాటి బతుకు కూటికి నోటికి చాలనట్టే ఉండాది. ఈ చెనిక్కాయిలని ఉడకేసుకొని తినేస్తే, ఎసుటిలోకి బియ్యమెట్ట, తట్టలోకి కూడెట్ట' అనింది అమ్మ.

| | | |
|---|---|---|
| *1.* | చెల్లం | : గారాబం |
| *2.* | కట్టకాపీ | : డికాక్షన్ |
| *3.* | అగలం | : వెడల్పు |
| *4.* | పల్లెం | : బడి |
| *5.* | పరుబు | : గట్టు |
| *6.* | చెల్లువాక్కు | : పలుకుబడి |
| *7.* | కాణి | : సుమారుగా 1.33 ఎకరా. 4 ఎకరాలు అయితే 3 కాణులకు సమానం. |
| *8.* | కొప్పర | : పెద్దపాత్ర |
| *9.* | పొదిగిలి | : నిధి |
| *10.* | ఉచ్చిపొద్దు | : మిట్టమధ్యాహ్నం |
| *11.* | చోలుపు | : వరుస |
| *12.* | యానాలు | : పాత్రలు |
| *13.* | గెంజు | : బతిమాలు |
| *14.* | మబ్బు | : చీకటి |
| *15.* | ఎనుములు | : ఎనుమలు |
| *16.* | సంపాదిచ్చి | : సంపారిచ్చి |

**తమిళనాడు రాయవేలూరు జిల్లాలోని ఎగువ మిట్టాళం అనే పల్లెటూరిలో పుట్టి పెరిగిన రచయిత శ్రీఐతం దివాకర్, ఆ జిల్లాలో తెలుగు వాణి నడిపిన తెలుగు తరగతులలో తెలుగును వ్రాయటం, చదవటం నేర్చుకొన్నారు. ఇదివరకు తల్లిభాష, నడుస్తున్న చరిత్ర పత్రికల్లో తన ఊరి గురించి వ్రాసినారు. ఇది దివాకర్ వ్రాసిన తొలి కత.**

ఫోను: +91 9790171881

## అప్పు చావుడప్పు

నేల, నింగి
వంగి నమస్కరించాయి
గరిసెలు గాదెలు నింపి
పండగలు జరిపించాయి
ఇప్పుడవి ఎవరి వశమయ్యాయి?
చేను చావును ఈనుతున్నది
మొక్క మృత్యువును కంటున్నది
ఉర్వి ఉరితాళ్ళను ప్రసవిస్తున్నది
పైరు కైజారైంది
పచ్చదనం గిన్నెలో బలిపీఠమైంది
గింజలిచ్చే వాడిని గుడ్డలూడదీసి
గుంజకు కట్టే
అప్పుది అధికారమైనచోట
నేల, నింగి దానికే
వంగి నమస్కరిస్తున్నాయి.

–'**నిజం**' ఫోన్: 9848351806

కవిత

## జాబిలమ్మ పదాలు

**ఆ**కాశ సౌధాలు
అద్దాల భవనాలు
కార్పొరేటు బడులు
ఓ జాబిలమ్మా!
  **అ**మ్మా అని పిలవదు
  అన్నం అని అడగదు
  తెలుగునే మరచాడు
  ఓ జాబిలమ్మా!
**ఆం**గ్లంలో చదువులు
డాలర్ల ఆర్జనలు
బతుకు పరమార్థాలు
ఓ జాబిలమ్మా!
  **వీ**పుపై పుస్తకాలు
  శూన్య మస్తకాలు
  భారమైన విద్యలు
  ఓ జాబిలమ్మా!
**తె**లుగు పలుకుట నేరం
పెనుశిక్ష ఖాయం
కొన్ని బడుల నియమం
ఓ జాబిలమ్మా!
  **ఆ**టలాడుట లేదు
  పాట పాడుట లేదు
  కథలు వినుట లేదు
  ఓ జాబిలమ్మా!
**ఒ**కటే ఒక మంత్రం
అదే చదువు మంత్రం
నిరంతరం అదే జపం
ఓ జాబిలమ్మా!
  **పా**లకులకు లేదు
  తల్లిభాషపై ప్రేమ
  పర భాషంటే మోజు
  ఓ జాబిలమ్మా!
**త**మిళుల కన్నడిగుల
మాతృభాషాభిమానం
ఎప్పుడగును మనకాదర్శం
ఓ జాబిలమ్మా!

**–మందరపు హైమవతి**, విజయవాడ
ఫోన్: 94410 62732

గోదావరి లోయలో
కొండరెడ్ల
బతుకు కతలు - 6

# అడవులు, చెట్లు, జీవాలు

- శ్రీ పల్లాల బొర్రంరెడ్డి

**ఆముదం:** జిడ్డిఆముదం, చిట్టిఆముదం (కారుఆముదం), వెర్రిఆముదం(కోటఆముదం).

**అంటు - అరటిపేర్లు:** బొంతఅంటు, మొకిరంటు, కారంటు, కుస్సుమంటు, రాచంటు, బగులం, ఇదుతురంటు.

**తినే కంపుకూరలు:** కుందికూర(వాము), కళ్ళికూర.

**చింతలు:** పుల్లచింత, తియ్యచింత, బూడెచింత, సంబచింత.

**పనసలు:** అంబటిపనస (బురద), కొమ్ముపనస, దూదిపనస, జడ్డిపనస, పునసిపనస, వానపనస, కొబ్బరిపనస.

**పనస తొళలు:** పండుతొళ్ళు, పచ్చితోళ్ళు.

**మామిడి చెట్లు:** తియ్యమామిడి, పులుసుమామిడి, కొదుపులమామిడి, బూడెమామిడి, గెంజిమామిడి, అంబటిమామిడి, కళ్ళికూరమామిడి, వానమామిడి, గుజ్జుమామిడి, ఉల్లిమామిడి.

**అంబలి రకాలు:** మామిడిపండ్లకలి అంబలి, చోడిపిండి పులిచిన అంబలి, గడజొన్నపిండి చోళ్ళతో, పొట్టజొన్నపిండి చోళ్ళతో, జీరికెచెట్టులో ముల్వపిండి, టంకపప్పుపిండి అంబలి, చిక్క అంబలి, పల్చఅంబలి, చింతఅంబలి, పాముతోక అంబలి.

**తాండ్ర:** మామిడితాండ్ర, తాటితాండ్ర.

**పిట్టు:** చోడెపిట్టు, టంకపిట్టు, గంటెపిట్టు, జీరికెపిట్టు, చీడిపండ్లపిట్టు, చిరినూకలపిట్టు, చవిడిదుంపలు-కందులు కలిపి పిట్టు.

**రొట్టెలు:** టంకరొట్టె, చోడెరొట్టె, జీరికెరొట్టె.

**పులగము:** కొర్రబియ్యం చీడిపండ్లు, గుమ్మడిపండు బద్దలు, కందులు, అనుములు.

**కుడుములు:** టంకకుడుము, బొడెపిండికుడుము, గంటెపిండికుడుము.

**కూడు రకాలు:** సామకూడు, గడజొన్నకూడు, పొట్టజొన్నకూడు, గంటెకూడు, బొంతకూడు, ఆరికెకూడు, సిప్పకూడు, కొర్రకూడు.

**జావలు:** కొర్రజావ, చిరినూకలజావ, సిప్పజావ, గంటెజావ, సామనూకలజావ.

**నూనెలు:** నువ్వులనూనె, జిడ్డుఆముదంనూనె.

**వంటసామాన్లు:** కూటికుండ, కూరకుండ, నీళ్ళకుండ, పులుసుపెనం, కూరతెడ్డు, వార్చెదగుడు (జిబ్బి), చట్టిగర్ర, నీళ్ళడొంకి, అంబటిడొంకి, దాంకెరి(పల్లెం), కోప(గ్లాసు), సీముంత(చెంబు), పులుసుగురుగు.

**తినే దొన్నెలు(కంచాలు):** కూటిదొన్నె, అంబటిదొన్నె, తూండి, కంటుమిడిక, ఒరిబొల్ప. (దొన్నె-అడ్డాకులతో కుట్టినది, విస్తరాకులు).

**జోలికె - గుగ్గిళ్ళు:** కందికాయ, గుమ్మడికాయ, అనపకాయ, చారిదుంప, మాటుగుదుంప, కప్పదుంప, జిబ్బిదుంప, పిడిదుంప, తేగ, గింటుగు, నూలెదుంప, చెద, చవిడె, వైయము.

**వంటకాలు:** తాలింపుకూర, తెడ్డు తాలింపు(మసిబొగ్గులతో), పొట్లం (నిప్పులో ఉడిచించుట), గొట్టంలో మాంసం వంట, తాలింపులేకుండ ఉప్పు కారంతో వంట.

**ఆకుకూరల పొట్లం:** గుమ్మడికూర, దిప్పకూర, తోటకూర, గుడ్డికూర, వెన్నెవెదురుకూర, గాజుకూర, గొండ్డుకూర, గర్బకూర, దూళికూర, కొప్పుకూర, చిలుకతోటకూర, ముల్లుదోటకూర (పొట్లం, పప్పులో), ముల్లుకూర (పప్పులో, పచ్చడి), తోటకూర (పొట్లం, పప్పులో).

**వేపుకొని తినే గింజలు:** అడ్డ, తంగుడడ్డ, పిండిగుదిలెం, గుమ్మడి, చిక్కుడు, గెంజాయి, పొగాకు, చింత, చంకెనువ్వులు.

కుందిపెంక = నాట్లుది, వేంపుబల్ల = కర్ర.

**పొగాకు రకాలు:** మట్టె, కాండ, ముల్లెరి.

**రోతిపోయి:** రోతికుండ, గుంజెగుడ్డలు.

**బట్టల సబ్బులు:** ఆవుపేడ మదిబుగ్గి కలిపి ఉడికించుట. తరువాత గుంజుట.

**నీండ్లపొంత (సబ్బులు):** పసుపు, సికాయ పులుసు, నిమ్మకాయ బద్దలు, పొత్తడినార(వెంట్రుకల జిడ్డు పోవును).

**మూటబొర్వ:** అడ్డాకులతో కుట్టినది. పప్పులు దాచి ఉంచుటకు.

**వెదురు బుట్టలు:** గంపబుట్ట, ఈనెలబుట్ట, ఆకుపలికె, పలికె, ఈనెలముచ్చికె, చేట, మామిడిపండ్ల కిమ్మ, ఎండ్రికల కిమ్మ, తట్టబుట్ట.

**నిచ్చెన:** అటకు ఎక్కునది; తాప: జీలుగచెట్టు ఎక్కునది.

**రొంటిబొక్క:** ధాన్యాలు దంచు బొక్క.

**పనిముట్లు:** గొడ్డలి, బుడ్డకత్తి, కొడవలికత్తి, మొనవలికత్తి, రొడ్డకత్తి, చేపటుకత్తి, ఊసికత్తి, గెలకత్తి, వాలకత్తి, సురకత్తి.

**దుక్కి పనిముట్లు:** మెడకిపూందు, పెంటగర్ర, నాగలి, కర్రికోల, మేడి, మొళ్ళలు, మునికర్ర, పుసపల్పులు, చిరితలు.

**కిరోసిన్ లేని దీపాలు:** జీడిఆముద గింజలు, వెర్రిఆముద గింజలు, పనసజిగురు. కొల్లెగుచ్చి ఎండబెట్టి నిప్పు అంటించుతరు.

**కంటెకర్రతో నిప్పు:** గుదిలెంకర్రబద్ద, ఎండినకందికర్ర, నల్లనువ్వు, చంకనువ్వు, వెదురుబద్ద. ఒక కర్రబద్దకి కన్నం పెట్టి, ఇంకోకర్ర సన్నంగీసి బొక్కలో పెట్టి రాపిడి చేసిన అగ్గివస్తది.

**జంతువులవేట:** కాపరికాయుట, సాంపరిసోంపుట (అధిక జనంతో). పాంపువేట, తొక్కుడువేట (ఒకమనిషి-వేపులు). గిలికవేట (ఇద్దరు-చెవులపిల్లికి). జాడ (దెబ్బతిన్నదానికి చూచుట). సాద పిట్టవేట (పిట్టలకి రాత్రి సాదతో).

**చేపలవేట:** రాత్రి బాణంతో చేపలను చంపుట.

**జూజుగువేట:** కాలువలో ఉన్న చిన్నచేపలు. వీటిని గుడ్డ కాల్వకి అడ్డము పట్టి పట్టుట.

**గుమిలెం:** వెదురుతో అల్లిన గొట్టం కాలువకి రాళ్ళు అడ్డంపెట్టి మధ్య ఉంచితే చేపలు దూరి ఉంటవి.

**రొయ్యివేట:** బొళ్ళలు చిన్నవి(ఎరలు), కొండ్లెపుకూర కర్రలో బొల్లను గుచ్చి దానితో పట్టుట.

**ఎండ్రికవేట:** కాలువకి రాళ్ళకోటలా అడ్డంవేసి ఆ రేవును ఇంకొక దారి వంపి(మల్లించి) కాలువకింద భాగం ఇనికినప్పుడు ఎండ్రికలను పట్టుదురు.

**ఎర్రగడవేట:** మిందె, పొంగురుమిడత, కోడిపొట్టు, మేకపొట్టు. జంతిరేణుకర్ర నాలుగుబద్దలు చేసి మధ్యలో దీముపెట్టి నారతోకట్టి కాలువనీటిలోని బొక్కలలో

పెట్టి ఎండ్రుకలను పట్టుట.

**ఎండ్రికబొక్కవేట:** గచ్చెలితో ఎండ్రికబొక్క తవ్వి పట్టుట.

**బద్దె:** కణుసు, పంది, దుప్పి, గేదె, పులి. పెద్దజంతువులను చంపు ఆయుధం.

**ఇరుకుమీటె:** కారుకోడి, తొగరుకోడి, కొక్కిపిల్లి. అడ్డనార ఉచ్చులలో దూరి మెడకు ఇరుకు చుట్టుకొని చచ్చుట.

**కొర్రుఉచ్చు:** అడ్డనార కొర్రుతో కట్టిన ఉచ్చు. పిల్లులు తిరుగుదారిలో ఉంచును.

**కుద్దె:** పండుపిల్లి, పూతపిల్లికి వాడుతరు.

**నేదివేట:** రాత్రిపూట నేదులు ఉన్న రాతిగుహలో దూరి సాదకట్టలతో వెలుతురులో బల్లెలతో పొడిచి చంపి, కాలితో కట్టుకొచ్చి బయటకి తీసుకువచ్చుట.

**అటగ్రమీట:** కణుసు, దుప్పి, పంది.

**చిట్టె:** పండుపిల్లి, పూతపిల్లి.

**అడప:** గొట్టి, వెదురెలుక, కొక్కిపిల్లి.

**చిన్నఅడప:** పిడుగు, కండెలు, పాదు. పిట్టలకి చంపుట.

**మాటు:** నెమలి, పంది, గొట్టి, పులి, నేది, వెదురెలుకలను చంపుచోటు.

**దీము:** చంపుటకు నమ్మించునది.

**మనుషులను చంపు ఆయుధాలు:** చెట్టుకిరె, అగ్గిబాణం, జువ్విబాణం, మంత్రిబాణం, పెట్టుమందు, మొక్కుబడి.

**కోళ్ళు, వాటి రంగులు:** ఎర్రకోడి, నల్లకోడి, పూల, చవల, నల్లబొట్లబేతువ, రావడిబొర్ష, మషిరె, పెట్టమారు, కాకి, కట్టికెనెమలి, బేతువ, సముద్రకాకి, పింగాలి, గాజి గూక్కేరి, పెట్టమూరు, నప్పెడికోడి, ఎర్రగాక్కెరి, నరకకోడి, పాసె, లగిచెకోడి, బుగ్గిపాసె, తెల్లజవుల.

**పశువులు రంగులు:** పుల్లది, బట్టలది, కర్రిది, చిర్రుది.

**గొనెటెద్దులు సజ్జులు:** గంతరేకు, పట్టెడి, పీట, పమ్ముదాడు, తర్టిండ్లు, ముడ్డిపట్టెడి, బొడ్డుతాడు, బొడుగు, గొనెబరువు.

**కొలతలు:** 1 పిడికెడు, 2 పిడుకులు 1దోసెడి, 2దోసులు 1గిద్దెడి, 2గిద్దెలు 1పాసెరి, 2పాసెర్లు 1సోల, 2సోలలు 1తవ్వెడి, 2తవ్వలు 1మానికె, 2మానికెలు 1అడ్డ, 2అడ్డలు 1కుంచెడి, 12కుంచాలు 1ముత్తుం, 30కుంచాలు 1పల్లా, 20పల్లాలు 1గరిసె.

**కోలెంకర్రతో తూకాలు:** 1పదులం, 2పదులలు 1వీస, 2వీసలు 1ఎత్తు, 4వీసలు అర్ధమనుము, 8వీసలు 1మనుము, 8మనుములు 1 కంట్లం, 64వీసలు 1 కంట్లం.

**కొలత సజ్లు:** గిద్ద, పాసెరి, సోల, తవ్వ, మానికె, అడ్డ, కుంచం.

**వాతలు:** పదులంవాత, వీసవాత, ఎత్తువాత, అర్ధమడుగువాత.

**పడుకొను సామాను:** వెదురుచాప, పట్టెమంచం, పిల్లలకి ఊయల.

**గిడుగు:** అడ్డాకులగిడుగు, తాటిఆకులగిడుగు.

**వెలందులు:** పొడిసామలు ఎండబెట్టినవి.

**ఆవించిన:** పొడిసామలు ఉడకబెట్టినవి.

**పచ్చితొళలు:** పనస తొనలు.

**పొంతరిబొక్క:** పనసగింజలు భూమిలోపల ఉంచి తినుట.

**ఉర్దుదుంప:** పిడిదుంప చెట్టులోని దుంప నరికి కత్తితో కోసి, దుంపచెట్టు పుంతకి భూమికిమధ్య మూకుదు ఆకులు చుమ్మచుట్టిపెట్టినది. తరువాత ఊరిన దుంప భూమికి లోతు తవ్వక్కరలేదు.

**ఎండబెట్టి తినుట:** పచ్చిపనస తొనలు, వెదురుకొమ్ములు.

**గాగలు:** తెల్లది, పచ్చది, మచ్చలది.

**వెలుగుగుడు:** ఇది చుప్పెట్లలో ఒకటి ఆకాశంనుండి భూమిమీదకి వచ్చును. దూలవిడి(జూన్)నెలలో ఇండ్లలోపలికి వచ్చును.

**చుప్పెట్లు:** ఇవి దూలవిడి(జూన్)నెలలో మద్ది, చింతచెట్లలో వాలి కరెంటు కాంతివలె చిదుపు చిదుపున మెరుస్తు అందాల కొలువు చేసుకుంటవి.

**పచ్చబొట్లగడ్డి, పాలతో పచ్చబొట్టు:** పచ్చబొట్లగడ్డి ఎరుపు. దాని పాలు(కొనలు) విరిచి ఆకులో పట్టవలెను. దానిని కావలసినచోట శరీరంలో చర్మంమీద ఆ పాలుపోసి సూదితో ఇష్టం ఉన్న ప్రకారం పొడువవలె. మూడురోజులు తరువాత పండును. అదే పచ్చబొట్టు. దీనిని 'రెడ్డివారి నానుబాలు' అని అంటరు.

**పొర ఊదేవి:** పాము, బూసిచెట్టు, వేగిస, తుమ్మికె, పిండిగుదిలెం, తెల్లగుమ్మ(కొవెలచెట్టు), రావడి, మొళ్ళికె, మోదిక, తీగతామెరి, చింత, మాయగుంపెన, తాండి, చీడి, మద్ది, తంగుడు, ఉచిరిక, రావి, తడిచె, నక్కెర, గుమ్ముడు, పంపెన, కరక.

**గుడిస వేణం:** గుడిస పుల్లంగిగ్రామంలోని గ్రామం. నాటురోడ్డు ఉన్న పుల్లంగి హెడ్క్వార్టకు 9మైళ్ళ దూరం ఉంటది. 9మైళ్ళ దూరంలో రెండుమైళ్ళు మాత్రం సమానమైన దారి ఉంది. ఎక్కువ నదికొండపై ప్రయాణించాలి, ఇక్కడ 7మైళ్ళ దూరంవరకు ఒక చెట్టుగాని, కాలువ ఉంటయి నీటివసతిగాని లేవు. ఈ పర్వతం 7మైళ్ళుదూరం మోకాలి ఎత్తు గడ్డిమాత్రం ఉంది. ఇది అంతా ఒక బండరాయితో ఆవరించి ఉంది. ఇలా చెట్టు లేకుండా బండరాయిపై కేవలం గడ్డి ఉన్నదానిని(వేణం) అంటరు. విషయం ఇక్కడ నేదువంది, లాగలు(బొరియలు), 10మంది మనుషులు ఒకేసారి నివాసం ఉండడానికి వీలున్నంత విశాలంగా ఉంటవి. ఇక్కడకూడా నేదుపందులతో పాఉలు కాపురం ఉంటవి. వేటకాల్లకు, అటవీఫలశాయ సేకరణదార్లకు జంతువులు పాములు వలన ప్రమాదం జరుగలేదు. ఇంతపెద్ద పర్వతంపైన మంచినీటి నూయి ఉన్నది. అందుకు దీనిని పాలకొండ అని పిలుస్తారు.

**గురమంద గుబ్బలమ్మ:** వేళ్ళగెడ్డ రామవరానికి పడమటి దశలో ఉన్నది. మెట్టపైభాగం మొత్తం రాయి. ఆ రాయినుండి నీరు వస్తది. సంతనంలేనివారు ఈ నీరు తాగుతరు. ఆ నీరు మెట్టపై భాగంలో ఉన్నరాయి పేటికె చందునుండి చుక్కలు చుక్కలు పడును. చేతులు ఒడ్డినప్పుడు సంతనం లేనివారికి రక్తం చుక్కలు, సంతనం ఉన్నవారికి పాలచుక్కలు పడును.

**పెండ్లం (మాటుగుదుంపలు):** బొంత అరటికాయలు పచ్చివి, మొకిరెఅరటికాయలు పచ్చివి, మాంసం పచ్చిది అగ్గిలో కాల్చుకొని తినవచ్చు.



ప్రతిగ్రామమునుండి ప్రతివాడు చదువు నేర్చుకోవాలని ప్రభుత్వ ఉద్దేశం. కాని పెద్దలకాలంలో చదువులేకుండనే వృత్తిపనులు, వ్యవసాయం, పాడిపంటలతో కడుపు కదలకుండ ఉన్నదానితో సర్దుకుని, గొప్పతనాలకి పోక, ఆశనిరాశలకి తావులేకుండ బతికారు. ఇది 40సంవత్సరాలనాటి మాట. ఆ రోజుల్లో ప్రభుత్వ చదువులంటే ఇష్టం ఉండేది కాదు.

చదువుకున్నవాడు – పొలం పోడు, వేట, పొలి చేయడం, మూటలు మోయడం, గిన్నె కడగడు–పడుకున్న చాప ఎత్తడు. మేకలు, గొడ్లు కాయడు. తల్లిదండ్రులకి తోడురాడు. చచ్చిన బతికిన ఒకచోట ఉండడు. అతడు గవర్నమెంటునౌకరు కులం తక్కువవారితో ఎదురుకుర్చులు. చదునుచాపలో ఉంటె వారికి దండాలు పెట్టాలి. ఒకరిని మోసం చేయాలి, కులంతక్కువవారు

వండిన పుటకూల్లు తినాలి అని బడికి పంపేవారు కాదు.

ముఠాదార్లు, పెత్తందార్లు, మునసబులు గ్రామాలు పాలించేవారు. వీరిదగ్గర లో–లంచాలవారు, లంచాలు తీసుకుని ప్రభుత్వంకు తెలియకుండ అన్ని కార్యాలు పూర్తిచేసి అమాయకులకి నష్టం పెట్టేవారు. పెద్దబాలశిక్ష చదివిన కోలగాడు గ్రామనౌకరు ఆ రోజుల్లో దొర. వీరు సరుకులు తిని డబ్బు ఇవ్వరు. పశువులను, మేకలను, చేనులో పండిన పంటలు దొంగిలించేవారు.

గ్రామంలో జరిగిన మోసాలు, గ్రామపెద్దలు చేస్తున్న మోసాలు తెలిసి గమనించి 1960వ సంవత్సరంనుండి నేలబడులలో చదువులు మొదలు పెట్టిరి. ప్రస్తుతం ప్రతి గ్రామంలో ఒకబడి, జి.వి.కె, మాబడి, భోజనం–వసతి ఏర్పాట్లు. ప్రతి గ్రామానికి ఒక చదువున్నవాడు వచ్చిడి, వాడికి చదువు పూర్తి లేదు, వ్యవసాయం పనికి రావడంలేదు, ఎడ్లకాపులేదు, పొలం దుక్కిలేదు, పోడులేదు, వేటలేదు. తండ్రికి తల్లికి తోడులేదు. తన ఎండిన పేగులపొట్ట పట్టుకుని, ఉపాధికి పట్టాపట్టుకుని ఫుల్‌ప్యాంట్, కళ్ళజోడు, ప్లాస్టికు జోడు వేసుకుని తిరుగుతున్నాడు. అగాధంలో పడ్డాడు. అన్నలు వచ్చి అలజడి సృష్టించిరి.

గుర్తేడుకొండలో టి.విజయకుమార్‌రెడ్డి, సుబ్రహ్మణ్యం– కలెక్టరు, సబ్‌కలెక్టరులను కిడ్నాప్ చేసి అడవిలో 7రోజులు ఉంచిరి. గిరిజనులకి చట్టం రాసిన రాయితీలు ఇవ్వమన్నరు. ఈ పరిస్థితులను గమనించిన ప్రభుత్వం అదుపు తప్పిదని, అన్నలకి దూరం చేయుటకు, హోంగార్డు, లైజన్‌వర్క్ అని జివికె పది ఫేయిల్డ్ అయిన వారికి పోస్టులు ఇచ్చిరి. అలజడులు తగ్గివి. అన్నలు తగ్గిరి, పోలీసుల క్యాంపులు ఎత్తివేసిరి.

ఉద్యోగ కేటాయింపులు ఎస్.టి.వారీగ ఉండకూడదు. జాతివారిగ ఉండాలి. అన్ని డిపార్టుమెంటులలో అనేక పోస్టులు బయటకి తీసి ఉద్యోగ నియామకం అని పిలుస్తున్నారు. ఆ ఇంటర్వ్యూలో ఒక రెడ్డికికూడ పోస్టు లేదు. ఆఫీసర్లు, కులాలనుకూడ సర్దుబాటు చేయుచున్నారు. ప్రస్తుతం గిరిజనేతరులకూడ వారి కులం పాడుకాకుండ. కొండజనంలో పూర్తిగ కలవకుండ తేరగవచ్చిన 'కొండ'ను వారి ఇంటిపేరుకు తగిలించు కొనుచున్నారు.

*(తరువాయి వచ్చే సంచికలో...)*

రచయిత ఫోన్లు : 08864244873, 8500935424–

**కవిత**

## మనకు తెలియని మహాకావ్యం

జనన మరణాల్లో
ప్రతి మనిషికీ
గుర్తుకొచ్చే
ఒకే ఒక గొప్పమాట
అమ్మ!
పసితనంలో చందమామ కోసం
మారాము చేసినప్పుడు
దాన్ని అద్దంలో చూపడంలోనే
అమ్మ గొప్పతనం అర్థమవుతుంది
అమ్మ తపనంతా
ప్రేమైక కుటుంబం కావాలని
మానవాళికి దక్కలేదెందుకో!
ఇంతకన్న ఏం అర్హత కావాలి?
ఓ మహోన్నత మహాజ్వాలకు
ఏమిచ్చి రుణం తీర్చుకోగలం?

**బెల్లం ప్రభాకర్,** నాగార్జునసాగర్.
ఫోన్: 9491525755

డా॥ ఈమని శివనాగిరెడ్డి
డా॥ మొవ్వా శ్రీనివాసరావు

# క్రీ.శ. 1523 నాటి పెదజంగమరెడ్డి శ్రీశైలం రాగిరేకు శాసనాలు-2

**గత సంచికలో తనకల్లుకు చెందిన కొమ్మిరెడ్డి పెద జంగమరెడ్డి శ్రీశైలంలో విడుదల చేసిన రెండు రాగిరేకు శాసనాల్లో మొదటి శాసనాన్ని ప్రచురించాము. రెండో శాసనాన్ని ఈ సంచికలో అందిస్తున్నాము. -సంపాదకులు**

శివలింగం, సూర్యుడు, శ్రీ విరూపాక్ష చంద్రుడు, నంది బొమ్మలతో నున్న ఈ శాసనాన్ని క్రీ.శ॥ 1513వ సం॥లో తనకంటి దేశాయి రెడ్డి అయిన పెద జంగమరెడ్డి శ్రీశైలంలో విడుదల చేశాడు. మిగతా వివరాలన్నీ మొదటి శాసనం మాదిరిగానే ఉన్నాయి. వర్తనలు నిర్ణయించి, ఆమేరకు నడిపించి ఇవ్వగలమని స్వామి సన్నిధిన వ్రాయించి యిచ్చిన ధర్మశాసనమని ఉన్నది. చివరన, "శ్రీరామ వాక్యమూ" అని రాయబడింది. శ్రీకృష్ణదేవరాయ ప్రస్తావన, పావుగొండ, మిడిగెశి, రత్నగిరి మొదలైన ఐదు దుర్గాల అధిపతులైన పెదజంగమరెడ్డి శ్రీశైలంలో, స్వదేశ, పరదేశ, ఉభయ నానాదేశాధీశ్వరులు పృధ్వీశెట్టి, రాయన్న మంత్రి భాస్కరుడు, నాలుగు రెడ్డి సింహాసనాలు కూడి ఇచ్చిన శాసనమని పేర్కొనబడింది. సమకాలీన శాసనాలను పోల్చుకొని ఈ శాసనాలను విశ్లేషించాల్సిన అవసరముంది.

<u>రెండోశాసనం</u> <u>శ్రీ విరూపాక్ష</u> <u>(మొదటిప్రక్క)</u>

1. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషాబ్బులు
2. 1445 అగునేటి ప్రమాది నామసంవత్సరం అశ్విజ శుద్ధ విజయ
3. దెశమి బ్రుగువాసర మందు॥
4. స్వస్తి సమస్త భువనమండ్డల పంచ్చాశత్కోటి విస్తీర్ణ భూమండలప్రణు... యే
5. కయిక భూరి గుణాలంకృత పృధిన్ త్రేతాయుగ శ్రీశైయిల మల్లికార్జున శ్రీ భ్రమరాం
6. బికా వరప్రసాద కృపాకటాక్ష వీక్షణాలంక్కారులైయిన స్వస్తి సమస్త నిజనామా
7........ ప్రశస్త సహితులయిన శ్రీ మగ్గడోశ్వర గౌరిశ్వర దేవరదివ్య శ్రీపాదపద్మా
8. రాదకులైయిన అబినవ జంబూద్వీప దక్షిణ వారణాసి కాసిని హరణ పుణ్యక్షే
9. త్రంబునకు సమానంబైయిన శ్రీ గోదావరి కృష్ణకావెరి మహా పుణ్యక్షేత్రంబ్బునకు
10. మధ్యేవప్పుచున్న శ్రీ శైయిల మల్లికార్జున శ్రీ భ్రమరాంబ్బిక సమస్తదేవతా ప్రతిష్ఠా
11. పన స్వర్ణమండప గోపుర ప్రాకార వెదికా స్తంభసోపాన నవరత్న ఖచిత కవాట
12. ద్వార నిర్మిత సత్య సంపన్నులైయిన శ్రీమద్రామయణానేక శతకోటిగ్రంథాం
13.కిత ప్రతిగ్రహ ప్రవిణులైయిన కోటిలింగ్గా ప్రతిష్ఠాపనాచార్యులైయిన సప్తస్క
14.ంత్తానాది శోడశ మహాదాన ప్రతిష్ఠాపనాచార్యులయిన దెవబ్రాంహ్మణ పూ
15. జా విధేయులయిన అనవరత భూసురాశిర్వాద సత్య సంపన్నులయినశ్రీమన్ంన్నా
16. రాయణ పాదారవింద సంభవులైన కరంజస గోత్రోద్భవులయిన శ్రీ చౌవుదేశ్వ
17.రి యిష్టదేవతా పాదప్రసాద సంభవులైయిన శ్రీశైయిల శిహ్వాచల వినుకొండ వుదయ
18. గిరి సమస్త రాజ్యభార దురంధరులయిన పావుగొండ్డ మిడిగెశి రత్నగిరి పంచ్చ
19. దుర్గాధిశ్వరులైయిన గురులింగ జంగమ కృపాకటాక్ష భక్తి సంపన్నులయిన రా
20.య వెశ్యాభుజంగ్గి భూచక్రది సమస్తచత్ర చామరాంద్వొళికా గండ పెండ్డారా
21. ది సమస్త బిరుదాంకితులైయిన కరదీపికా సహస్ర పరివేష్టితులైన శ్రీమల్లికార్జున్న
22. కృపాకటాక్ష వీక్షణాలంకారులైన హలాయుధ సమసభద్రిశాయిదశస్త్ర
23. యుద్ధధారులైన కనకాచల సమానధిరులైయిన శ్రీమన్ మహాచూలు
24. ప్రభువులయిన కనకగిరి పట్టణానకు ప్రతినామంబైన తనకంట్టి పురము
25. దేశాయి చక్రప్పరెడి వారికి పావత్వంయిన చౌడిరెడ్డి, వారికి పుత్రులై
26. మిరెడ్డి పెదజంగ్గమ రెడిగారు శ్రీశైల మల్లికార్జున

భమరాంబికాసారిని

27. ధ్యముఖమంటపశ్రీ బసవేశ్వర సంన్నిధానమంద్దు స్వదేశ పరదేశపు

28. భయ నానాదేశాదీశ్వరులుంన్ను పృధ్విశెట్టి రాయనమంత్రి భాస్కరన్ను సా

29. లు మూల నమస్తులుంన్ను రెడినాలుగు సింహ్వాసనములవారులుంన్ను, రత్న

30. సింహాసనాసీనులై కూడి కొలువై కూర్చుండి అయ్యావళి ముఖ్యులైన షవ

31. ంటి మకులాంచారునకు ఆచార వ్యవహార ప్రాయపిశ్చిత్తములకు కార

32. ణ కర్తలు అయినషువంటి తనకంటి రెడ్లవారు మహారాజశ్రీ కృష్ణ

33. రాయస్వామి వారు ఆచంద్రార్క స్థాయిగాను మాకు చెల్లె రాజ్యమున

34. వర్తనలు ధర్మశాసనము వ్రాయించ్చియిచ్చినారు. మీరు పవిత్రులుం

35. వారుంన్ను.. శాసనము వ్రాయించ్చి యింమని శలవుయిస్తిరి గనుకను

36. మీరు దయసేశి శలవు యిచిన బుది ప్రకారము మేము చతుర్దిక్కుల

37. వున్న కులము వారము అందరము సంమ్మతించి బాలవృద్ధ శ్రీ జ





38. న సంమ్మతముగాను మీకు ఆంచంద్రార్కస్థాయిగాను వ్రాయించి యి

39. చ్చిన ధర్మశానన క్రమవెట్లంన్నను, మీకు పూర్వాపూర్వములనుంచ్చి మీ

40. మాపెదలు యేమి న పుతూ వుండిరొ మెముంన్నూ అదెమెరగాను నడి.

41. పించి యిస్తున్నాము అని వ్రాయించి యిచ్చిన వర్తనలు నిర్ణయ వివరము

42. యిల్లు1 కి సంవత్సరము 1టికి అలం రెండు రూకలు దాన్యము...

43. యిరసా పెండ్లిండ్లకువర్తన నాణ్యంగం... సింహ్వాసనమునకు...వ

44. క్కశె...ఆకులు కటెలు నాలుగు బియ్యము ము. నాలుగు ముంత్తలు

45. బెడలు ము1 నెయ్యిశె 2 బెల్లం శె4 పండ్డుగ వర్తన సంవత్సరానుకు...

(రెండోప్రక్క)

46. టెంకాయలు 2 గ్రామం వ.1కి యీమెరగాను నడిపించ్చి

47. యిస్తినాము అని మెముచెతుర్దిక్కులవున్న కులం సంమ్మతిన

48. శ్రీస్వామి సంనిధిన వ్రాయించ్చి యిచ్చిన ధర్మశాసనము

49. స్వదత్తాద్విగుణం పుణ్యం పరదత్తా నుపాలనం పదత్తా

50. పహారెణ స్వదత్తం నిష్ఫలంబవెద్॥ స్వదత్తా పుత్రికా ధాతృపి

51. తృదత్తా మ సోదరీ అలస్యదత్తాస్వయం మాతా విప్రదత్తా

52. మధ్యంశజాః పరమహీపతి వంశజా వారిః బూమి పాస్సత

53. తముజ్వల ధర్మ చిత్తామద్ధర్మమెవ సతత పరిపాలయంత్తితత్వా

54. ద పద్మయుగళం నీరసావదత్త. శ్రీరామవాక్యమూ॥

–రచయితలు

## పుస్తక సమీక్ష

# కవిత్వంతో కరచాలనం




కవి అంటే గాఢానుభూతుల వర్షంలో తడిసేవాడు. తాను తడవడమే కాకుండా ఆ కవితా శీతల పరిమళాలను అందరికీ పంచేవాడు. అలాంటి కవి శిఖామణిగారు. తన మొదటి పుస్తకం మువ్వల చేతికర్ర నుంచి నేటివరకు విరామంలేకుండా కవిత్వంతో కరచాలనం చేస్తూనే వున్నారు. ఆ వరుసలో ఇటీవల ప్రచురించిన కవితాసంపుటి "పొద్దున్నే కవిగొంతు"

ఆధునిక యుగంలో దూరాలను దగ్గరచేసే ఎన్నో ప్రయాణ సాధనాలు ఉండవచ్చు. ఒకప్పుడు దారిలేని నదులమీద వంతెనలు పడి మార్గం సుగమం కావచ్చు. కానీ చిన్నప్పటి పడవ ప్రయాణాలు, అప్పటి నదీతీరాలు, అక్కడి చెట్లు, చెట్లపై గూళ్ళు, గూళ్ళ ఉయ్యాలలో ఊగే పిట్టలు ఇప్పటికీ దృశ్యకావ్యాల్లా మిగిలిపోతాయి. ఇక కవి సంగతి చెప్పేదేముంది. అలాంటి దృశ్యాలను ఎప్పటికీ మరవలేడు.అందుకే కవి తన చిన్నప్పటి మురమళ్ళ పడవలరేవును, ఒడ్డునే వున్న మర్రి చెట్టును బొమ్మగీసి చూపిస్తారు.

"ఇప్పుడు నదిమీద వంతెన పడి/నది అవసరం, పడవల అవసరం లేకుండా పోయిందిగాని/ అమ్మ ఫోటోలాంటి పడవల రేవు అమృత స్మృతి"

అని ఆనాటి మధురస్మృతిని మననం చేసికొంటారు.

'సకలాంగ' వికలాంగుల గూర్చిన కవిత. మధురగానం చేసే అంధురాలి గురించి–

చేతిలో వీణా పుస్తకమూ లేకుండా/ (సరస్వతి వేదిక మీదికి వొచ్చిందా అనిపించింది" అని అంటూ "విగ్రహం చేసిన శిల్పి/ చివరకు దేవతా విగ్రహానికి/ నేత్రాలను పెట్టడం మరచిపోయినట్టు/ దేవుడు ఈమెకు/ చూపివ్వడం మరచిపోయి వుంటాడు"

అని ఆమె రూపాన్ని అక్షర చిత్రంలో ఆవిష్కరిస్తారు.

శిఖామణి గారు కేవలం అనుభూతి కవిగా మిగిలిపోలేదు. తన జాతికి అవమానం జరిగినపుడు ధిక్కార స్వరమై గర్జిస్తారు. నా కవిత్వాన్ని/ నల్లని సైనుగుడ్డను చేసి/ నీ సమాధులపెట్టెకు/ నన్ను నేను చుట్టుకుంటున్నాను" అని లక్షింపేటలో జరిగిన సంఘటనను గురించి/ తన నిరసనను నిష్కర్షగా వినిపిస్తారు.

ఇంకా ఈ సంపుటిలో కవితాత, పొయ్యి రాజేస్తున్న అమ్మ, బీజాక్షరం, పులసచేప స్వగతం, మనిషిలేడు, పొద్దున్నే కవిగొంతు కవితలు ఆర్ద్రమైన కవితలు. కెరటాల చేతులు, పద్యాల పడవలు, నదిచెట్టు, అలల రంపం, పెట్రోమాక్సు పూలగుత్తులు మొ॥ రూపకాలు పాఠకుల మనస్సులను పరవశింప చేస్తాయి. కవిత్వ ప్రేమికులు చదివి ఆనందించ దగిన పుస్తకం.

**పొద్దునే కవిగొంతు** పుటలు 108; వెల రూ. 120/-

ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, ప్రజాశక్తి బుక్ హౌస్, హైదరాబాదు, నవోదయ పబ్లిషర్సు, విజయవాడ.

**–మందరపు హైమవతి,** విజయవాడ

ఫోన్: 9441062732

## పుస్తక పరిచయం

# సృజనకాంతి




డాక్టర్ సి. భవానీదేవి నలభై సంవత్సరాలుగా సాహితీ సేవలో వివిధ ప్రక్రియల్లో 39 గ్రంథాలు వెలువరించారు. నిరంతర రచయిత్రి భవానీదేవి గారి సాహిత్య వివేచనను ప్రతిబింబించే వ్యాసాలు, సమీక్షలు, పీఠికల్ని కలిపి డా॥ సి.ఎస్.ఆర్.మూర్తి సంపాదకత్వంలో "సృజనకాంతి" పేరుతో గ్రంథం వెలువడింది. ఈ గ్రంథంలో సంపాదకీయంతో పాటు 87మంది రచయితల విశ్లేషణలున్నాయి. రచయిత్రి భావజాలాన్ని తెలుసుకోవడానికి ఈగ్రంథం ఉపయోగ పడుతుంది. ప్రతి ఒక్కరు చదువదగిన పుస్తకం ఇది. "సృజనకాంతి"–పేజీలు 240, వెల: 350రూ. ప్రతులు దొరుకు చోటు: డాక్టర్ సి.ఎస్.ఆర్.మూర్తి, 102– గగనమహల్ అపార్టుమెంట్స్, రోడ్డు నెం: 6, దోమలగూడ,హైదరాబాద్– 500029, ఫోన్ నెం. 040–27636172, మరియు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారి అన్ని బ్రాంచీలు.

# భావన




ప్రముఖ సాహితీవేత్త డాక్టర్ చిల్లర భవానీదేవి గారి నాలుగు దశాబ్దాల సాహిత్యోత్సవం సందర్భంగా 2014లో వెలువడిన అభినందన సంచిక – "భావన". ఇందులో ఆశీస్సులు, శుభాకాంక్షలు, విశ్లేషణలు, అన్నీ కలిపి 64 మంది వ్రాసిన అంశాలు ఉన్నాయి.దీనిలో భవానీదేవిగారి పరిచయం మరియు చిత్రమాలిక పొందు పరచడం వలన, ఈ గ్రంథానికి విశిష్టత చేకూరింది.

"భావన"– పేజీలు 230. వెల: రూ. 200. ప్రతులు లభించుచోటు: హిమబిందు పబ్లికేషన్స్, 102, గగన మహల్ అపార్ట్‌మెంట్స్, రోడ్డు నెం.6, దోమలగూడ, హైదరాబాద్ – 500029, ఫోన్ నెం.040–27366172

# అరుణ స్ఫూర్తులు




"అరుణస్ఫూర్తులు" – గ్రంథ రచయిత ఆచార్య వల్లభనేని అరుణకుమారి. 'అరుణబాల' అనే కలం పేరుతో వివిధ పత్రికల్లో పలు వ్యాసాలు ప్రచురించారు. వీరికి తెలుగుతోపాటు ఇంగ్లీషు, ఒరియా, హిందీ భాషల్లో ప్రవేశం ఉంది.

అరుణస్ఫూర్తులు– గ్రంథంలో 21 వ్యాసాలు ఉన్నాయి. వీటిలో కొన్ని ప్రాచీన సాహిత్యానికి, మరికొన్ని ఆధునిక సాహిత్యానికి సంబంధించిన వ్యాసాలు. సులభశైలిలో చదవడానికి వీలుగా ఉన్నాయి. ప్రతి ఒక్కరు చదవదగిన గ్రంథం.

'అరుణస్ఫూర్తులు' – పుటలు 241; వెల రూ. 150/-రూ. దొరుకుచోటు– ఆచార్య వల్లభనేని అరుణకుమారి, డోర్ నెం. 45–37–64/1, జగన్నాథపురం, అక్కయ్యపాలెం, విశాఖపట్నం–16, ఫోన్: 0891–2750489

తమిళనాడులో
తెలుగు పాఠాలు

# తెన్నాటి విడిపట్టులు






తెన్నాడు (ఇప్పటి తమిళనాడు)లో జరుగుతున్న తెలుగు ఎసపు (ఉద్యమం) గురించి అమ్మనుడి చదువరులు ఎరిగినదే. అందులో వంతుగానే తెలుగు విడిపట్టులు (తెలుగు శిబిరాలు) నడుస్తున్నాయి. నెలనెలా అక్కడక్కడా ఏదో ఒక కులసంగం వాళ్లు, 'తెలుగువాణి( అరణి(ట్రస్ట్) తోడుపాటుతో కలుసుకొంటున్నారు. తెలుగు తరగతులనూ నడుపుకొంటూ తెలుగుదనాన్ని పెంచుకొంటున్నారు. సెప్టెంబరు 13న కంచి పెనువంటెం (జిల్లా), మధురాంతకంలో విడిపట్టు జరిగింది. దీనిని నడిపింది దువ్వూరి సురేశ్‌రెడ్డి. అక్టోబరు 11న ఈరోడు పెనువంటెం, బొమ్మినాయుడూరులో మరొక విడిపట్టు జరిగింది. దీనిని నడిపింది రాచకొండల సెందిల్ నాయుడు. ఈ రెండు విడిపట్టులలో 'తెలుగువాణి' నుండి స.వెం.రమేశ్, మార్టూరి వసంత్ నాయుడు, అగస్తిరెడ్డి దామోదర రెడ్డి పాలుగొన్నారు.

**మధురాంతకంలో కలుసుకొన్న వారిపేర్లు:** 1) దువ్వూరి సురేశ్‌రెడ్డి, పెనుబాక 2) దువ్వూరి ప్రతీక్ష, 3) దువ్వూరి పద్మనాబరెడ్డి, తిరుమలక్కాడు, 4) దువ్వూరి సంతోష్‌రెడ్డి, తిరుముక్కాడు, 5) చిలకనూరి కొండారెడ్డి, చెరవపాక, 6) సుందరమూర్తి రెడ్డి, కురుంబర, 7) ఓడూరి హరిదాస రెడ్డి, కడవ చెరువు, 8) వేలూరి సుకుమార్ రెడ్డి, తిరుముక్కాడు 9) దేవారెడ్డి ఉదయభాస్కరి, తుత్తి వెలగపట్టు, 10) నాగారెడ్డి కోదండరామిరెడ్డి, తుత్తివెలగపట్టు, 11) వేలూరి వెంకట క్రిష్టారెడ్డి, కాటి గుడలూరు, 12) ఓడూరి గోపిరెడ్డి, పాతూరు 13) ఓడూరి లక్షిత, కడవ చెరువు,14) దువ్వూరి విశ్వనాద రెడ్డి, తొన్నాడు, 15) ముత్తుకుమార్ రెడ్డి, తొన్నాడు.

**బొమ్మినాయుడూరులో కలుసుకొన్న వారి పేర్లు :** 1) రాచకొండల సెందిల్ నాయుడు, ఉప్పరవల్లి, 2) రాచకొండల వినోద్ నాయుడు,అత్తిపాళెం, 3) మల్లిని దివాకర్ నాయుడు, రాజులవాళ్ళ పల్లి, 4) దుగ్గిని రామరాజ్ నాయుడు, పాపల్లి 5) కాకర్ల ప్రభాకర్ నాయుడు, అందూరు6) పెమ్మసాని రాజేంద్ర నాయుడు, కురివికుళం జమీందారు, 7) పాలకొండ గుణశేఖర్ నాయుడు, గోమంగళం, 8) పామర్తి వెంకటేశ్ నాయుడు, నల్లమనాయుడి పల్లి 9) గుంటుపల్లి వరదరాజు నాయుడు, పాపనాయకుని పల్లి 10) పైడి జయకుమార్ నాయుడు, ఓటిబిడారం 11) గాలి బరణీదర నాయుడు, చొక్కం కొత్తూరు, 12) నంబూరి రాజకుమార్ నాయుడు, పాపల్లి 13) వల్లూరి వెంకటేశ నాయుడు, గణపతిపాళెం 14) మల్లిని మల్లిక, గాజులవాళ్ళ పల్లి 15) దివి నిత్య, పాపల్లి 16) గుంటుపల్లి సురేశ్ 17) మల్లిని నందిత.

మదురాంతకం విడిపట్టుకు వచ్చిన చిలకనూరి కొండారెడ్డిగారు 'తెలుగువాణి'కి లక్ష రూపాయల విరాళాన్ని ఇవ్వనున్నట్లు చెప్పినారు. వారికి 'తెలుగువాణి' మప్పిదాలను తెలియజేసింది

**రెండు ఊర్లలో పిల్లలకు అక్షరాలు నేర్పడంతో పని మొదలైంది**



**కంచిజిల్లా మదురాంతకం విడిపట్టు (శిబిరము) నడిచిన తరువాత ఆ విడిపట్టులో పాల్గొని, తెలుగు అక్షరాలు నేర్చుకున్న దువ్వూరి సురేశ్ రెడ్డి, దేవారెడ్డి ఉదయబాస్కరి ఇద్దరూ కలసి రెండు ఊర్లలో 30 మంది పిల్లలకు తెలుగు పాఠాలు నేర్పినారు. ఆ ఊరు అన్నంబాక, అచ్చెరపాక**

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362




# తెలుగు కోసం తమిళనాడు తెలుగువారి పోరాటం



## నిర్బంధ తమిళ భాషాచట్టాన్ని రద్దు చెయ్యాలి

తమిళనాడు రాష్ట్రంలో 2006లో తెచ్చిన నిర్బంధ భాషాచట్టాన్ని ఉపసంహరించుకోవాలని హోసూరులో నవంబరు 1–ఆదివారం నాడు జరిగిన తెలుగు సంఘాల సమైక్య వేదిక, తమిళనాడు తెలుగు యువశక్తి, కృష్ణగిరి జిల్లా రచయితల సంఘం, కన్నడ, ఉర్దూ, మలయాళ భాషాసంఘాల బహిరంగ సభలో విద్యార్థులు, నాయకులు ముక్తకంఠంతో తీర్మానించారు. స్థానిక కామరాజు కాలనీలో ఆంధ్ర సాంస్కృతిక సమితి అధ్యక్షులు రామలింగారెడ్డి అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో హోసూరు ఎమ్మెల్యే కె.గోపీనాథ్, తళి ఎమ్మెల్యే పి.రామచంద్రన్, చంద్రగిరి ఎమ్మెల్యే చెవిరెడ్డి భాస్కరరెడ్డి, మాజీ ఎమ్మెల్యే బి.వెంకటస్వామి, తమిళనాడు తెలుగు యువశక్తి రాష్ట్ర అధ్యక్షులు కె.జగదీశ్వరరెడ్డి, కర్ణాటక తెలుగు ప్రజాసమితి అధ్యక్షుడు బొందు రామస్వామి, తెలుగు సాహిత్య పరిషత్ ఎం.ఎస్.రామస్వామిరెడ్డి, కన్నడ సంఘ నాయకులు మంజునాథ్, రాజ్యసభ మాజీ సభ్యులు యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ మొదలగువారు పాల్గొని ప్రసంగించారు. తమిళనాడులో మైనార్టీ భాషా ప్రజల హక్కులను గౌరవించి వారి వారి మాతృభాషలను మొదటి పాఠ్యాంశంగా బోధించాలని డిమాండ్ చేశారు. 2016 మార్చి నెలలో జరగబోయే 10వ తరగతి పబ్లిక్ పరీక్షల్లో మా మాతృభాషలోనే పరీక్ష రాసే అవకాశం కల్పించాలని, మైనార్టీ భాషల విద్యార్థులకు రాష్ట్ర భాష అయిన తమిళాన్ని అదనపు భాషగా మాత్రమే బోధించాలని తీర్మానించారు. ఎన్నికల్లో తెలుగు, కన్నడం, ఉర్దూ, మలయాళ భాషల్ని కాపాడే పార్టీలకే ఓటు వేయాలని కూడా మహాసభ ఏకగ్రీవంగా నిర్ణయించింది.

వేలాది విద్యార్థులు ప్లకార్డులు చేతపట్టుకుని మాతృభాష కావాలని నినదించారు. బహిరంగ సభ ప్రారంభమైన అరగంటలో వాన కుండపోతగా కురుస్తున్నా, విద్యార్థులు తడిసి ముద్దయినా ఒక్కరూ కదల్లేదు. వేదిక మీద, కింద ఉన్న పెద్దలంతా కూడా తడిసిపోయినా కదల్లేదు. మాతృభాష రక్షణ కోసం అంత పట్టుదలగా వారంతా సభలో పాల్గొన్నారు. నాయకులంతా ఈ పోరాటంలో చివరి వరకూ ఉంటామని మాట ఇచ్చారు. విద్యార్థి ప్రతినిధులు కూడా మాట్లాడారు. మా మాతృభాషలను హరించే హక్కును మీకెవరిచ్చారని ప్రభుత్వాన్ని వారు నిలదీశారు.

AMMANUDI (Telugu Monthly)
November 2015, Vol.1, Issue.9

RNI-APTEL/2015/62362
Postal Reg. No.TEN/12/2015-17